రాణి శివశంకరశర్మ : దిలాస్ట్ బ్రాహ్మిణ్ గ్రంథం ద్వారా తెలుగు బౌద్ధిక రంగంలో సంచలనం సృష్టించిన రచయిత. ఆధునిక నాగరికత, సమాజం, రాజకీయాలను భారతీయ తాత్విక దృక్కోణంతో సునిశితంగా విశ్లేషించిన ఉదాత్త గ్రంథం దిలాస్ట్ బ్రాహ్మిణ్. ఈ గ్రంథం ఇంగ్లీషు, కన్నడ భాషలలోకి అనువదించబడింది. ఈ గ్రంథం ఆధారంగానే హిందూత్వ అనే నృత్య రూపకాన్ని కూడా రచించి ప్రదర్శింపజేశారు. ఆయన రచించిన వ్యాసాలూ, కథలూ, కవితలూ వివిధ తెలుగు దిన, వార పత్రికలలోను, సంకలనాలలోను ప్రచురితమయ్యాయి.

విప్లవ రచయితల సంఘంతోనూ, దళితవాదులతోనూ చిరకాలంగా సంబంధం కలిగిన ఈ రచయిత ఆ సిద్ధాంతాలను కూడా భారతీయ తాత్విక దృష్టితో పునర్మూల్యాంకనం చేశారు. గ్రహాంతరవాసి, పురాణవేదం ఇతర ప్రధాన రచనలు. తాత్వికుడు, కవి, రచయిత, విమర్శకుడైన రాణి శివశంకరశర్మ రచించిన విలక్షణ గ్రంథం ఇది.

పిన్నమనేని మృత్యుంజయరావు

# అమెరికనిజం

Political Philosophy

రాణి శివ శంకర శర్మ

జో ప్రచురణలు

కొరిటెపాడు, గుంటూరు

# ఆదిత్య హృదయం

ప్రకృతికి తనదైన గమనం వుంటుంది. అయితే అది ప్రయోజనం కోసం కాకుండా గమనం కోసం గమనం. దానికి ఒక ప్రయోజనాన్ని ఊహించి తదనుగుణంగా జీవన విధానాన్ని నిర్దేశించుకోవడంలో ప్రాచ్యులకూ, పాశ్చాత్యులకూ పూర్తిగా విరుద్ధమైన తాత్వికతలేర్పడ్డాయి. అనేకంలో తాను అనామకంగా ఉంటూ తనలో అనేకాన్ని ప్రదర్శించగల విశ్వరూపాన్ని ప్రాచ్యులు ముఖ్యంగా భారతీయులు తమ తాత్వికతగా బోధించారు. ఇది ప్రకృతి పురుషుల సంయోగం. సరిగ్గా దీనికి విరుద్ధంగా ప్రకృతిని జయించి మనిషి ఆధిపత్యాన్ని స్థాపించే తాత్వికతను పాశ్చాత్యులు ఆచరించారు. ఇది ప్రకృతి పురుషుల వియోగం.

భారతీయుల తాత్వికత సామాజిక అసమానతల చట్రంలోకి నెట్టబడి ఆచరణనుంచి దూరమైపోయింది. బహుళత్వాన్ని ఏకంగా ఆరాధించాల్సినచోట బహుళం బహుళంగా మిగిలి ఆధిపత్యపోరుకు దారితీసిన సామాజిక వాస్తవం ఇక్కడి తాత్విక ఆలోచనను మింగేసింది.

పాశ్చాత్యుల తాత్వికత యంత్రాన్ని సృష్టించి, యాంత్రికంగా ప్రపంచాన్ని మార్చేసింది. దీని పరణామం మానవ మనుగడకే ముప్పుగా పరిణమించింది. మరెంతో కాలం భూమి మానవ మనుగడకు ఆలంబన కాబోదన్నది అత్యంత విషాదంతోకూడిన నిజం.

పాశ్చాత్యుల తాత్వికతకు చరమస్థాయి అమెరికనిజం. దాని దుష్ఫలితాన్ని, విషఫలాల్ని నేడు మానవాళి కళ్ళుమూసుకు మింగుతోంది. ఇప్పటికైనా ఉనికిని కాపాడుకునేందుకు విశ్వంలో అత్యంత సౌందర్యరాశియైన, ప్రేమ మూర్తియైన , గంధ పూతయైన భూమిని దాని సంపూర్ణ పూర్వ రూపంలోకి తీసుకెళ్ళటం జీవుల లక్ష్యం కావాలి. అందుకు తాత్విక ఆలోచనల్లో పూర్తిగా మార్పు రావాలి. ఎందుకంటే సృష్టి భగవంతుడి తాత్వికతలోంచి అంటే జీవి తాత్వికతలోంచి మాత్రమే జన్మించింది.

అటువంటి ప్రాచ్య తాత్వికత మేఘాలలో ప్రభాకరుని వలె మరుగున పడిపోయింది. ఆ దివ్యకాంతిని సాక్షాత్కరింపజేసే ప్రయత్నమే అమెరికనిజం గ్రంథ లక్ష్యం.

– పబ్లిషర్స్

# విషయసూచిక

# ఆ అమ్మ - ఆ ఆవు

నదీ ప్రవాహపు ఒరవడిలో శాఖల వలె జీవులు యాదృచ్ఛికంగా కలుస్తున్నారు, మళ్ళీ విడిపోతున్నారు అంటుంది రామాయణం.

యాదృచ్ఛిక అనుబంధాలు తీసుకువచ్చిన స్పందనల నుంచి యీ గ్రంథం ఆవిష్కృతమైంది. భావస్థిరములైన జన్మాంతర స్నేహాలు నేటి మైత్రికి మూలం.

కొందరు సహృదయులతో చిగురించిన స్నేహాలు, ఆ స్నేహితులు రేపిన ప్రశ్నల అలజడులు యీ గ్రంథానికి మూలమయ్యాయి. వారితో సుదీర్ఘ సంభాషణలు, వారు ఎక్కుపెట్టిన ప్రశ్నలు నాలో రేపిన అలజడి సంవత్సరాలపాటు సాగింది. నిరంతర అధ్యయనానికి మూలమైంది.

అధ్యయనం, అంతర్మథనం కలిసి యీ గ్రంథం ఆవిర్భవించింది. ఆధునికతని విమర్శించడానికి కారణం అది దుఃఖదాయకమైనదని కాదు. ఆధునికత వినసొంపైన ఆదర్శాలని మన ముందు వుంచింది. వాటి వెనుక తన దుర్మార్గాల్ని దాచేసుకుంది. అదీ అసలు సమస్య.

అమెరికా ఆధునికత తీసుకువచ్చిన అనేక ఆదర్శాల్ని పక్కన పెట్టి స్వేచ్ఛా పతాకాన్ని ఎగురవేసింది. స్వేచ్ఛ.. స్వేచ్ఛ.. స్వేచ్ఛ.. యీ అంతులేని స్వేచ్ఛ వెనుక అంతుపట్టని క్రౌర్యాన్ని మరుగుపరచింది.

యిలా తప్పించుకు తిరుగుతున్న వాస్తవాల్ని వేటాడడమే అమెరికనిజం గ్రంథం లక్ష్యం.

మొత్తంగా యీ ఆధునికత ప్రత్యేకించి అమెరికనిజం గతం కంటె చాలా ఆకర్షణీయమైనదని యెవరైనా వాదించవచ్చు. దాని విద్యుత్ మెరుపుల వెనుక దాగిన భయంకరమైన చీకటి మాత్రమే నిజం. దాన్ని పారదర్శకం చేయడమే అమెరికనిజం గ్రంథ లక్ష్యం.

యీ గ్రంథం ఆవిర్భావానికి కొందరు మిత్రులతో సంభాషణలు ఊతమిచ్చాయి. ఆ మిత్రులెవరూ ఆంగ్ల మానసపుత్రులు కాదు. పాశ్చాత్యం తీసుకువస్తున్న సాంకేతిక పదజాలంలో కూరుకుపోయిన వారు కాదు. అందువల్లనే వారితో కమ్యూనికేషన్ సాధ్యమైంది.

అమెరికనిజం భాషని అయోమయంగా మార్చి మనవైన సంభాషణలూ, స్వగతాలూ, స్మృతులూ లేకుండా చేసింది.

మంచి చెడులను పక్కనబెట్టి మనదైన భాష లేకుండా చేయడం ఆధునికత యొక్క ప్రత్యేక లక్షణం. ప్రధానంగా అమెరికనిజం లక్షణం. బుర్రల్నే ఆక్రమించడంవల్ల మనదైన ఆలోచన, భాష, నుడికారం లేకుండాపోయాయి.

తప్పిపోయిన భాషని తిరిగి కనుగొనడమే ప్రధానంగా యీ గ్రంథ లక్ష్యం.



# స్వచ్ఛంద మరణం

అమెరికా అన్నది వొక స్థలం కాదు. అది సర్వవ్యాప్తమైన భావజాలం. దాని నుంచి ఎవరూ తప్పించుకోలేరు.

ప్రాచీన కాలంలో సముద్రయానం నిషిద్ధం. తమ జీవన విధానాన్ని పరాయిభావాలు అతలాకుతలం చేస్తాయని భావించారు ప్రాచీనులు. అందువల్ల సముద్రాన్ని దాటకూడదన్నారు. ప్రాచ్య దేశాలవారు ముఖ్యంగా చైనా, భారతదేశాల ప్రజలు యిట్టి నియమాలతో జీవించారు. స్వధర్మే నిధనం శ్రేయః అన్నారు. జననీ జన్మభూమి అంటూ పలవరిస్తూ జీవించారు.

యిప్పుడు కూడా అటువంటి కఠోర నియమాలతో జీవించినా ఫలితం శూన్యం. ఎందుకంటే అమెరికన్ భావజాలం ఎక్కడో లేదు. నీ యింట్లోనే వుంది. నీ వంట్లో వుంది. అది స్థల కాల బద్ధం కాదు. సర్వ వ్యాప్తం. పరమాత్మయైన లేని స్థలమైనా వుండవచ్చు. కాని అమెరికన్ భావజాలం లేని స్థలం వుండదు.

గర్జించు అమెరికా గాండ్రించు అమెరికా అని గానం చెయ్యక తప్పదు. రష్యా యేది? అమెరికాలో కలిసిపోయింది. సహేంద్ర తక్షకాయ స్వాహా అన్నట్లు అమెరికా తనలో కలిపేసుకుంది.

మరి కమ్యూనిజం ఏది ఎక్కడ కమ్యూనిజం యూరోపియన్ వలసవాద భావజాలం నుంచి పుట్టింది. తొండ ముదిరి ఊసరవెల్లి యైనట్లు యూరోపియన్ ఐడియాలజీ ముదిరి అమెరికా పుట్టింది. స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం అనే యూరోపియన్ ఆధునిక విలువలు ఒకేఒక మార్కెట్ స్వేచ్ఛలో సంగమించాయి. స్వేచ్ఛ.. స్వేచ్ఛ.. స్వేచ్ఛ.. మరొకటేదీ లేదు.

స్వేచ్ఛా రాక్షసి చివరికి అన్నిటినీ మింగేసింది. వ్యక్తి స్వేచ్ఛ అంటూ ఏదీ లేదు. వ్యక్తిని కూడా మార్కెట్ మింగేసింది.

మార్కెట్ డిజైనింగ్ తప్ప మరేదీ లేదు. రకరకాల వస్తువుల్ని డిజైన్ చేసి, యంత్రాల ద్వారా సృష్టించి మార్కెట్‌లోకి వదులుతుంది మార్కెట్. మనుషులు కూడా (వైద్య శాస్త్రం జన్యుశాస్త్రాల ద్వారా) డిజైన్ చేయబడ్డారు. తయారు చేయబడ్డారు. వారి జన్యువులు పేటెంట్ చేయబడ్డాయి.

మరి దీనికంతటికీ కర్త ఎవరు? మార్కెట్టే. కర్త కర్మ క్రియ కూడా మార్కెట్టే.

మార్కెట్టు యంత్ర నాగరికతని సృష్టించిందా యంత్ర నాగరికత మార్కెట్టుని సృష్టించిందా అనే ప్రశ్నలు, చెట్టు ముందా విత్తు ముందా అని అడగడం లాంటివే. యింతకీ రెండు ఒకటే.

మరి మనిషి ఎక్కడ మానవుడా మానవుడా అని మహాకవులు గొంతెత్తి కీర్తించిన మానవుడు ఎక్కడ?

మానవుణ్ణి యూరప్ సృష్టించింది. యూరప్ భావజాలంతో పాటే మానవుడూ అంతరించాడు.

యూరప్ భావజాలపు తార్కిక పర్యవసానం అమెరికా. అమెరికా మానవుణ్ణి హతమార్చింది.

స్వేచ్ఛకి జన్మనిచ్చింది.



# దేవుడు సరే..
# మానవుడూ మరణించాడు

దేవుడు మరణించాడు అన్నాడు నీషే అనే జర్మన్ తత్వవేత్త. క్రైస్తవం దేవుడికి జన్మనిచ్చింది. దేవుడికి ప్రతిరూపంగా మనిషి వచ్చాడు. దీన్నే విలోమంగా చెప్పాలంటే మనిషికి ప్రతిరూపంగా దేవుడు జన్మించాడు. ప్రాచ్యతత్వంలో దేవుడూ లేడు మనిషీ లేడు. ప్రకృతి మాత్రమే వుంది.

మనిషి కోసమే అతని ఆకలిని వాంఛలనీ తీర్చడానికే ప్రకృతి వుంది అంటుంది క్రైస్తవం. అందుకే ప్రకృతిపై మనిషి విజయపతాకం ఎగరవేశాడు. ప్రకృతినే మార్కెట్టు సరుకుగా మార్చాడు. ఈ విజయాన్ని మార్క్సు గొప్పగా కీర్తించాడు.

ఐతే విజేత మరణించాడు. మనిషి మరణించాడు. మనిషి సృష్టించిన మార్కెట్టే అతన్ని మింగేసింది. మనిషి సమాధిపై మార్కెట్టు విజయపతాకాన్ని ఎగరవేసింది. స్వేచ్ఛావిపణి విశ్వవిజేత.

యిప్పుడు దేవుడూ లేడు... మనిషీ లేడు.

యీ పరిణామాన్ని చూసి యూరప్ సృష్టించిన విలువలు కూడా మృగ్యమౌతున్నాయని గగ్గోలు పెడ్తున్నారు కమ్యూనిస్టులు. స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం అనే యూరోపియన్ మానవ విలువలే నశించాయంటున్నారు. మార్క్సు పలవరించింది ఆ విలువలకోసమే నంటున్నారు.

ఏకఛత్రాధిపత్యం వహిస్తున్న అమెరికా ఏ విలువల్నీ సృష్టించలేదంటున్నారు. పైగా అన్ని మానవ విలువల్నీ ధ్వంసం చేస్తోందంటున్నారు. అమెరికా వట్టి దగుల్బాజీ అంటున్నారు. యూరప్ గొప్పదంటున్నారు.

యూరప్ మరణించింది.

అమెరికా పుట్టింది.

యూరప్ గర్భాన్ని చీల్చుకొని అమెరికా పుట్టింది.

గట్టివైనవన్నీ కరిగిపోతున్నాయన్నాడు మార్క్స్. అలా కరగదీస్తున్నందుకు పెట్టుడిదారీ వ్యవస్థని కీర్తించాడు.

పెట్టుబడిదారీ వ్యవస్థ సృష్టించిన విలువల్ని మానవతా వాదాన్నీ కూడా అమెరికా కరిగించి వేసింది యిది సహజ పరిణామం.

గ్రామాల్ని ధ్వంసం చేసిన నగరాల్ని కీర్తించాడు మార్క్స్. అన్ని నాగరికతల్ని మింగేసే మహానాగరిక తిమింగలంగా జన్మించింది అమెరికా. యిదీ సహజపరిణామమే.

నిరంతర ధన ప్రవాహం తప్ప ధనికుడు లేడు.
విప్లవం తప్ప సామ్యవాదం లేదు.
నిరంతరం మార్పు తప్ప, చలనం తప్ప దానికి కర్త లేడు.
స్వేచ్ఛ తప్ప మానవుడు లేడు.



# రాముడు అదృశ్యమయ్యాడు

ఒకప్పుడు హిందూవాదులకి రాముడు ప్రధాన అజెండాగా వుండేవాడు. యిప్పుడు అభివృద్ధే వారి అజెండా. హిందూత్వ - అభివృద్ధి యిదీ వారి మంత్రం. రాముడు సోపానం మాత్రమే అభివృద్ధిగమ్యం.

ఇప్పుడు రాముడు సోపానం కూడా కాదు. కమ్యూనిజం వారి సోపానం. కమ్యూనిస్టులు కీర్తించిన అభివృద్ధి నమూనాని హిందూవాదులు ముందుకి తీసుకు వెళ్తున్నారు. కమ్యూనిస్టులు విఫలమైనచోట హిందూవాదులు శ్రీకారం చుడ్తున్నారు. యింతకీ అభివృద్ధి అంటే ఏమిటి ?

అమెరికనిజమే, స్వేచ్ఛా వాణిజ్యమే, లాభసాటియైన ఉత్పత్తి, అటువంటి కంపెనీలకి ఆహ్వానం. అదే అభివృద్ధి.

పశ్చిమబెంగాల్లో కమ్యూనిస్టులు ప్రయత్నించి విఫలమైన అభివృద్ధి నమూనానే హిందూ గుజరాత్ అందుకుంది.

చివరికి మావోయిస్టులకి కూడా ప్రత్యేక తాత్విక దృక్పథం లేదు. వారిదీ మన ప్రభుత్వాల దృక్పధమే. ప్రకృతిమీద పగబట్టిన ఆధునిక అభివృద్ధి నమూనాయే కాని మావోయిస్టులూ, కమ్యూనిస్టులూ మానవుడి గురించి మాట్లాడ్తారు మానవతావాదాన్ని పలవరిస్తారు. పాత యూరోపియన్ భాషని వాడతారు. అది పాత చింతకాయ పచ్చడి. యిప్పుడది పనికిరాదు.

అదుపులేని అభివృద్ధి అంతులేని స్వేచ్ఛ, అందులో మానవుడి ప్రసక్తి అసలే లేదు. యిదే నేటి ఆధునికత సారం. యీ మార్గం రామభక్తులకే బాగా తెలుసు. యూరోపియన్ క్రైస్తవులు క్రీస్తుని వదిలేశారు. హిందూవాదులు రాముణ్ణి వదిలేశారు. యిద్దరూ బింబ-ప్రతిబింబాలు, ధ్వని-ప్రతిధ్వనులు. యిప్పుడు యిద్దరూ దేవుడు లేని మానవుడూ లేని స్వేచ్ఛా విపణిని ఆరాధిస్తున్నారు.

క్రీస్తు లేడు...

రాముడూ లేడు.....

చివరికి మానవుడూ లేడు....

కేవలం మార్కెట్టు వుంది.  అదే అమెరికనిజం.



# రామాయణ కల్పవృక్షం - మార్క్సు విషవృక్షం

మార్కెట్టుకి మూలమైన క్రైస్తవమే మార్క్సు మతం. ప్రొటెస్టెంట్ క్రైస్తవమే మార్క్సు మతం. మార్క్సు తండ్రి యూదు మతాన్ని విడిచిపెట్టి ప్రొటెస్టెంట్ క్రైస్తవుడిగా మారాడు. అక్కడే మార్క్సు మూలం వుంది.

మరి మార్క్సు నాస్తికుడా కాదా ? మతం మత్తుమందు అన్నాడు కదా అంటే నిజమే అన్నాడు.

మతం మత్తుమందు నిజమే కాని ఎన్నో బ్రాండ్ల మత్తుమందులున్నట్లే ఎన్నో మతాలు వున్నాయి. క్రైస్తవం శ్రేష్ఠమైన మత్తుమందు. ఇస్లాం నాటు సరుకు భారతీయ ధర్మం మరింత నాటుసరుకు యిదీ మార్క్సు హృదయం.

అందుకే మార్క్సులో మతపరమైన విలువలు మిగిలి వున్నాయి. క్రైస్తవ మతపరమైన విలువలు దాగి వున్నాయి. అది యూరోపీయ ధోరణి.

ప్రకృతిపై మానవుడే సార్వభౌముడు అంటాడు మార్క్సు. మనిషినే మహారాజు అంటాడు. ప్రకృతి అతనికి బానిసగా పడివుండాలంటాడు.

మరి ప్రకృతిని దైవంగా భావించే భారతీయ ధర్మం సంగతి ఏమిటి ? కోతిని కూడా హనుమంతుడిగా మహాశక్తివంతుడిగా సముద్రాల్ని అవలీలగా లంఘించే మహిమాన్వితుడిగా, శ్రీరామచంద్ర పరబ్రహ్మ ధర్మపత్ని సీతామహాసాధ్వి జాడను కనుగొన్న ధీశాలిగా, వ్యాకరణవేత్తగా, గొప్ప సంస్కారవంతుడిగా, మానవుడు కూడా అడుగు జాడలలో నడవవలసిన ఆదర్శంగా నిలిపిన రామాయణ నీతినీ ధర్మాన్నీ మార్క్సు ఏమంటాడు ?

కోతిని కూడా సింహాసనంపై నిలిపిన భారతీయ మనస్తత్వాన్ని గురించి, గోవు వంటి జంతువులని కూడా దైవంగా కొలచిన జంబూద్వీప అంతరంగాన్ని గురించి కారల్ మార్క్సు ఏమంటాడు ?

అది వట్టి మూఢత్వం అంటాడు అనాగరికత అంటాడు. వానరాన్ని కూడా పూజించే ప్రాకృతిక అజ్ఞానం అవివేకం అంటాడు.

మరి జంతువులని పూజించడం అవివేకం, అజ్ఞానం ఐతే దేవుణ్ణి మనిషిగా చూడడం మనిషిని పోలిన వాడుగా ఆరాధించడం సంగతి ఏమిటి ?

జంతువుని పూజించడం మరీ అవివేకం అంటే ఏమిటి ? మనిషిని పూజించడం మంచిది అని అంతరార్ధం. కనీసం జంతువుని పూజించడం కంటె మనిషిని పూజించడం శ్రేష్ఠమైన పని అని, నాగరికత అని మార్క్సు హృదయం.

అసలు గాయపడిన పక్షిని చూసి వాల్మీకి హృదయం ద్రవించి రామాయణం పుట్టింది. మార్క్సు ప్రకారం యిది అజ్ఞానం, అనాగరికత.

ప్రకృతి అంతా మనిషి భోజనం చేయడానికి సిద్ధం చేసిన డైనింగ్ టేబుల్ తప్ప మరేమీ కాదు. యిదే క్రైస్తవం. క్రైస్తవం ప్రకారం మనిషి కోసమే యీ ప్రకృతినంతా దేవుడు సృష్టించాడు. యీ చరాచర ప్రకృతి అంతా మనిషి కోసమే. దేవుడు తనని పోలిన వానిగా మనిషిని సృష్టించాడు. అతడే ప్రకృతిపై సార్వభౌముడు, మహారాజు. యిదే క్రైస్తవ సృష్టిక్రమం. యీ బైబిల్ దృక్పథమే మార్క్సు హృదయం.

ధ్వంసం చేసి చదును చేసి రోడ్లు వేసి మనిషి ముమ్మందుకు సాగేందుకు ఉపకరించేది మాత్రమే ప్రకృతి. అంతకు మించి ప్రకృతికి ప్రత్యేకత లేదు. మానవ కేంద్రక దృష్టితో చూసి ప్రకృతికి విలువకట్టాలి. వినియోగపు విలువ మాత్రమే ప్రకృతి పరమార్థం.

అందుకే చరిత్రనంతా సంఘర్షణమయంగా చూసిన మార్క్సిజం, చిట్టచివరికి మిగిలేది ప్రకృతితో నిరంతరం సంఘర్షణ మాత్రమేనంటుంది. ప్రకృతికీ మనిషికీ మధ్య యుద్ధం ఎప్పటికీ నిలిచే వుంటుంది. మానవులలో వర్గాలు అంతరించినా, ప్రకృతిమాత్రం జయించవలసిన శత్రువుగా నిలిచే వుంటుంది. అదొక సైతాన్. దేవుడు వున్నతంతకాలం సైతాన్ వుంటాడు. వారిద్దరిమధ్య యుద్ధమూ వుంటుంది. యిదే బైబిల్ కథనం ప్రకృతికీ మనిషికీ మధ్య కొనసాగుతుందంటుంది మార్క్సిజం.

సంఘర్షణని పరమార్ధంగా వర్ణించే మార్క్సిజం ప్రకృతితో మానవుడి బొడ్డు బంధాన్ని తెంచేసింది. అదే మానవ నాగరికత అంది మార్క్సిజం.

మరి ప్రకృతిని పూజించే కోతిని కొలిచే భారతజాతిని ఎవరు ఉద్ధరించాలి. ప్రకృతిపై ఆధిపత్యం సార్వభౌమత్వం వహించలేని జంతుస్థాయి భారతీయుల్ని ఎవరు ఉద్ధరించాలి అని మార్క్స్ని అడిగి చూడండి.

ఆయన యిచ్చే సమాధానం యిది. క్రైస్తవులే ఉద్ధరించాలి. యురోపియన్ క్రైస్తవులే ఉద్ధరించాలి భారతీయుల్ని ఉద్ధరించేది క్రైస్తవ సామ్రాజ్యవాదం తప్ప మరేమీ కాదు. అదే అమృతం. అదే కపిని పూజించే రామాయణ విష వృక్షానికి విరుగుడు. యూరోపియన్ క్రైస్తవులు బడితపూజ చేస్తేనే భారతీయులు బాగుపడ్తారు అంటాడు మార్క్స్.

వలస క్రైస్తవులు భారతీయ గ్రామీణ వ్యవస్థని ధ్వంసం చేశారు. చేతివృత్తుల్ని ధ్వంసం చేశారు. వ్యవసాయాన్ని ధ్వంసం చేశారు. ఎంతో హింసని ప్రయోగించారు. దానిమాటేమిటి అని మార్క్స్ని అడగండి.

దానికి ఆ మహానుభావుడు యిచ్చే సమాధానం ఏమిటంటే హింస విప్లవానికి మంత్రసాని. మార్పుకి నాంది హింసే. యీ పుర్రెలో అమృతం దాగివుంది. యూరోపియన్ క్రైస్తవుల వలసవాద హింసలో పురోగతి వుంది అభివృద్ధి వుంది. యీ పుర్రెలో అమృతం దాగివుంది అని రెట్టించి చెప్తాడు మార్క్స్.

సరేకాని అనాగరికులైన భారతీయుల్ని క్రైస్తవులే ఎందుకు జయించాలి వారే ఎందుకు సంస్కరించాలి ముస్లింలు భారతీయుల్ని సంస్కరించలేరా?

ముస్లింలు సంస్కరించలేరు వారు అనాగరికులు, క్రూరులు. అందుకే ఇండియాని టర్కీ ముస్లింలు జయించడం కన్నా యూరోపియన్ క్రైస్తవులు జయించడమే మంచిదైందంటాడు మార్క్స్. అంటే ముస్లింలు కూడా అనాగరికులే. అంతకు మించిన అనాగరికులు భారతీయులు వీరందర్నీ ఉద్ధరించవలసివారు క్రైస్తవులు. వారి నాగరికత వీరందరికంటె పురోగమన శీలమైనది, అమృతతుల్యమైనది.

సరేకాని యీ అమృతం రెడ్ ఇండియన్స్‌కీ యింకా అనేక జాతులకీ యెందుకు దక్కలేదు? వారి జాతులన్నీ మూలమట్టంగా ఎందుకు అంతరించాయి? అమృతం తాగితే చిరంజీవిత్వం రావాలే కాని చావకూడదు కదా?

దీనికి సమాధానం కోసం మార్క్సు గురువుగారి దగ్గరకి వెళ్ళాలి. హెగెల్ దగ్గరకి వెళ్ళాలి. ఆయన ఏమంటాడంటే ఆఫ్రికన్ బానిసత్వాన్ని కూడా మానవ నాగరకతలో ఒక దశగా చూడాలంటాడు. తెల్ల క్రైస్తవులకి కొందరు బానిసలుగా మారడమూ, ఊడిగం చేయడమూ, బానిసలుగా కడతేరడమూ కూడా మానవ పురోగతిలో అవసరమైన దశలంటాడు. అభివృద్ధి సోపానాలంటాడు అందువల్ల కొన్ని జాతులు అంతరించినా మానవుడు మిగిలేవుంటాడు. యీ జాతుల నిర్మూలనని మానవ పురోగతిలో ఒక దశగా సరిపెట్టుకోవాలంతే.

యింతకీ మానవ పురోగతి అంటే ఏమిటి? తెల్లవాడి పురోగతే మానవ పురోగతి బైబిల్ చెప్పినట్లు దేవుణ్ణి పోలినవాడు తెల్ల క్రైస్తవుడే. మిగిలినవాళ్ళు మానవుడికంటె వెనుక దశలో వున్న తక్కువ స్థాయి మానవులు. వాళ్ళు అంతరించినా పోయేదేంలేదు.

రేపు యీ యూరోపియన్ నాగరికత పర్యవసానంగా ప్రకృతి కలుషితమై అణుబాంబులు విస్ఫోటనమై ప్రళయం వచ్చి మానవజాతి అంతరించే పరిస్థితి వచ్చినా పోయేదేంలేదు. బంకర్లలో తెల్ల క్రైస్తవుడు బైబిల్ పట్టుకొని భద్రంగా వుంటాడు.

మార్క్సు చెప్పిన అమృతం దక్కేది వాడికే.

నిజానికి యూరోపియన్ వలసవాది మనకు ఇచ్చింది విషాన్నే కాని అమృతాన్ని కాదు. భోపాలు విషవాయువు ఇందుకు ప్రత్యక్ష ఉదాహరణ. దీన్ని అమృతంగా నమ్మబలికాడు మార్క్సు. అమృతం పేరుతో విషపాత్రనే భారతీయులకి అందించాడు.

యింతకీ యీ విష పాత్రలోంచే అమెరికా పుట్టింది. యీ విషానికే స్వేచ్ఛ అని పేరు పెట్టి మార్కెట్టు వస్తువుగా మార్చింది అమెరికా. రకరకాల వస్తువుల పేర్లతో అమ్ముడయ్యేది యీ స్వేచ్ఛే.

ఐతే మార్క్స్ కీర్తించిన చారిత్రక మానవుణ్ణి కూడా స్వేచ్ఛ పేరుతో విముక్తం చేసింది అమెరికా. చరిత్ర ముగిసిపోయింది అని గానం చేసింది అమెరికా.

మార్క్స్ అనంతర ప్రపంచంలో మనం ఉన్నాం.

అదే అమెరికనిజం.

అదే స్వేచ్ఛనిచ్చే అమృతం.

అది నిజంగా అమృతమా.. విషమా.. అని హేతుబద్ధంగా చర్చించే అవకాశమే లేదు.

ఎందుకంటే అలా చర్చించే మానవుడు అంతరించాడు మానవ చరిత్ర ముగిసింది. స్వేచ్ఛ మాత్రమే మిగిలింది. హద్దులు చెరిపేసే స్వేచ్ఛ గ్లోబలైజేషన్ స్వేచ్ఛ.

అదే అమెరికనిజం.



# అమృతంలో దాగిన విషం

నిజానికి వలసవాదం అమృతం కాదు. కాని దాన్ని అమృతంగా నమ్మబలికారు వలసవాదులు. దాన్నే కొనసాగించాడు మార్క్స్. ఆ దారిలోనే నడిచారు భారతీయ సంస్కర్తలు.

క్రైస్తవ వలస పాలనని ధర్మరాజ్యంగా ఈశ్వరేచ్ఛగా అభివర్ణించారు సంస్కర్తలు. వలసవాదుల వెన్నుదన్నుతో కుట్రలూ కుతంత్రాలతో భారతీయ సంస్కృతిని దెబ్బతీయడానికి ప్రయత్నించారు. ఇక్కడి కవులనీ కవయిత్రుల్నీ అధములుగా కామాంధులుగా చిత్రించారు. శృంగారరసాన్ని నీచమైన అభిరుచిగా నిందించారు. స్త్రీలు నాట్యం చేయడాన్ని శృంగార రచనలు చేయడాన్ని బరితెగించడంగా భావించి నిషేధించడానికి ప్రయత్నించారు. అందుకోసం వలస వాదుల్ని రెచ్చగొట్టారు. వలస క్రైస్తవుల కంటె ఎక్కువగా క్రైస్తవ నీతిని వంటపట్టించుకొన్నారు. యిదే క్రైస్తవ నీతిని నాటి సంస్కర్తల నుంచి నేటి విప్లవ రచయితలూ, మేధావులూ నిస్సంకోచంగా అనుసరించారు. అదే ప్రగతిశీలత అన్నారు.

ప్రముఖ సంస్కర్త కందుకూరి వీరేశలింగం పంతులుగారు ముద్దుపళని రాధికాసాంత్వనాన్ని తీవ్రంగా దూషించారు. మగవాళ్ళకంటె బరితెగించి బూతు వర్ణనలు చేసిందన్నాడు. దేవదాసియైన బెంగుళూరు నాగరత్నమ్మ గారు వీరేశలింగంపై కత్తిదూసి వీరనారి అనిపించుకొన్నారు. ఆడవాళ్ళకేనా యీ నీతులు? మగవాళ్ళు ప్రబంధాల్లో యెటువంటి శృంగారమైనా వర్ణించవచ్చు. స్త్రీలు మాత్రం శృంగార అభివ్యక్తికి దూరంగా వుండాలా అని నిలదీశారు. దాంతో కోపోద్రిక్తుడైన వీరేశలింగం తెల్లవాళ్ళలో తన పలుకుబడిని ఉపయోగించి రాధికా సాంత్వనాన్ని నిషేధింపజేశారు. తాను రాసిన బూతు రచనలపై మాత్రం వేటుపడకుండా జాగ్రత్తపడ్డారు. ఇదీ కొసమెరుపు.

వీరేశలింగంతో పాటే వీరేశలింగం గారి ఆధునిక భావాలు అంతరించలేదు. శృంగారం పాపం నీచం అనే క్రైస్తవ నీతిని కమ్యూనిస్టులూ చివరికి విప్లవ రచయితలూ కూడా ఒంటబట్టించుకొన్నారు. బెంగుళూరు నాగరత్నమ్మ గారు కాదు వీరేశలింగమే వారికి ఆదర్శంగా నిలిచాడు.

ప్రముఖ విప్లవ మేధావి కె.వి. రమణారెడ్డి గారు ముద్దుపళనిపై వీరేశలింగం భావాల్నీ పదజాలాన్నీ కూడా యధాతథంగా అరువు తెచ్చుకున్నారు. అదే యూరోపీయ క్రైస్తవనీతి నాటి నుంచి నేటివరకు సంస్కరణ పేరుతో కొనసాగుతూ వచ్చింది.

వలనవాద భావజాలంపై పోరాడిన బెంగుళూరు నాగరత్నమ్మ గారి భావాలూ మరుగున పడిపోయాయి. స్త్రీలపై వివక్ష గురించి, స్త్రీల అభివ్యక్తిపై ఆంక్షల గురించి ఆవిడ చేసిన పోరాటం పోరాటం కాకుండా పోయింది. ఆవిడ ప్రగతిశీల మేధావుల పాతివ్రత్యానికి భంగకరంగా భాసించింది. ఎందువల్లనంటె ఆమె ఆధునిక క్రైస్తవ విద్య నేర్వలేదు. వలస క్రైస్తవులతో చెలిమి చేయలేదు. వారి మధ్య పలుకుబడి సంపాదించలేదు. పైగా సంప్రదాయ కళలని ప్రేమించింది. త్యాగరాజుకి గుడికట్టింది. అట్టి స్వదేశీ భావజాలం గల స్త్రీ నుంచి నేర్చుకోదగినది ఏదీ లేదు. పెరటి చెట్టు వైద్యానికి పనికిరాదు. దాన్ని పెకలించి వేయవలసిందే యిదే వలసవాద అమృతంలో దాగిన విషం.



# కోనసీమ వాల్మీకి

సంస్కృత పదాల్ని పాత ప్రతీకల్ని వాడుతున్నందుకు నేటి కాలం కవి ఒకరు తీవ్ర విమర్శకు గురయ్యాడు. ఆ కవి పేరు నామాడి శ్రీధర్.

ప్రధానంగా ఆధునిక దళిత మేధావులు సంస్కృత భాషపై కత్తిగట్టారు. ఇంగ్లీషు భాషని విముక్తి ప్రదాయినిగా ముందుకు తీసుకువచ్చారు.

యిట్టి భావాలకి విరుగుడుగా ముందుకు వచ్చాడు నామాడి శ్రీధర్. గోమాత, కోకిల వంటి పాత కవి సమయాల్ని యితడు కొనసాగించడం, గ్రామీణ సంప్రదాయ వ్యక్తీకరణలపై దృష్టి నిలపడం కూడ విమర్శకు దారితీసింది. యితడు కాలాన్ని వెనక్కి తిప్పుతున్నాడన్నారు కొందరు.

ఎందుకంటె దళితవాదం ఇంగ్లీషు భాషతో పాటు నగరీకరణని ఆదర్శంగా అభివర్ణించింది. ఇది అంబేద్కర్ చూపిన దారే.

దీనికి భిన్నంగా ఇస్మాయిల్ చూపిన దారిలో నడిచాడు నామాడి శ్రీధర్. దీనికి అతని దళితత్వం అడ్డురాలేదు.

యిస్మాయిల్ ప్రకృతి సౌందర్యాన్ని ఆరాధించే కవి. చిలుకలు వాలిన చెట్టు కవితా సంకలనం ద్వారా చెట్టు కవిగా ప్రసిద్ధుడయ్యాడు. కృష్ణశాస్త్రికి వీరాభిమాని. నామాడి శ్రీధర్ కూడా యీ అడవి దాగిపోనా అన్నట్లే మిగిలిపోయాడు.

జర్నలిస్టు వృత్తిని విడిచిపెట్టి ప్రస్తుతం వ్యవసాయాన్ని జీవనాధారంగా చేసుకున్న శ్రీధర్‌కి ఫుకుఓకా రాసిన గడ్డి పరకతో విప్లవం అనే పుస్తకం అంటే చాలా యిష్టం. యిది ప్రకృతి వ్యవసాయాన్ని మూలంగా తీసుకున్న తాత్విక గ్రంథం. పురాణ ప్రతీకలతో కవితల్ని రాసిన ఒరియా కవి సీతాకాంత్ మహాపాత్ర అంటే కూడా అభిమానం.

నామాడి శ్రీధర్ నాకు చాలాకాలం నుంచి మిత్రుడైనా, అతని కవితల్లోని నిగూఢార్థాల్ని నాకు వివరించి చెప్పింది ఒక ఆలయ పూజారి. అతని పేరుకూడా నా పేరే అంటే శర్మే. మంత్రాల్ని అలవోకగా పఠించే యీ పూజారి శ్రీధర్ కవితల్ని కూడా శ్రావ్యంగా ఆశువుగా వల్లిస్తూ వాటి ప్రాకృతిక సౌందర్యాన్ని వివరించాడు.

శ్రీధర్ నాకు చిరకాల మిత్రుడైనప్పటికీ అతని కవిత్వాన్ని నేను స్వయంగా గుర్తించలేదు. శర్మ శ్రావ్యమైన గొంతులో అతని వివరణలో మాత్రమే అతని కవిత్వాన్ని రసాస్వాదన చేయగలిగాను.

దీనికి కారణమేమిటి ? నాకు చాలాకాలం నుంచి తీవ్రవాద భావాలు కలిగిన కమ్యూనిస్టులూ, తర్వాత దళిత కవులూ మిత్రులుగా వున్నారు. వీరి తీవ్రతలో గ్రామీణత, సంస్కృతభాష, పురాణ ప్రతీకలూ వ్యర్థమైనవిగా భావించబడి కొట్టుకుపోయాయి.

శ్రీధర్ కమ్యూనిస్టు పార్టీలో పనిచేసినవాడే, ప్రగతిశీల భావాల్లో ఊరేగినవాడే. కాని అతని హృదయం ఎక్కడో నిలిచిపోయింది. బహుశా ప్రాచీన గోదావరీ తీరంలో నిలిచిపోయింది.

ఆ గోదావరీ తీరంలోని వైదిక బ్రాహ్మణుడే అతడి కవిత్వాన్ని వేదంలా వల్లెవేస్తూ సారాన్ని నాబోటి బ్రాహ్మణాధముడికి వివరించడం వింతలో వింత.

నిజానికి గోదావరీ తీరం వేదమంత్ర పారాయణులకి ప్రసిద్ధి. 17వ శతాబ్దానికి చెందిన విశ్వగుణాదర్శచంపువులో నిష్ఠా గరిష్ఠులైన వైదిక బ్రాహ్మణులకి నెలవుగా గోదావరీ తీరం వర్ణించబడింది. వేద మంత్రాల్ని స్పష్టంగా శ్రావ్యంగా చదవగలిగేది కోనసీమ బ్రాహ్మణులేననే ప్రసిద్ధిని యీ గ్రంథం స్పష్టం చేసింది. దేశ విహారం చేస్తున్న గంధర్వుల సంభాషణ ద్వారా వ్యక్తం చేసింది.

బోడిగుండుకీ మోకాలికీ ముడిపెట్టినట్లు దళితుడైన ఆధునిక కవి శ్రీధర్‌కీ వేదానికీ యేమిటి సంబంధం అని మీరు అడగవచ్చు.

రుగ్వేదంలోని ఉషస్సూక్తం సూర్యోదయాన్ని అద్భుతంగా సరళంగా వర్ణిస్తుంది. సరిగ్గా ఆ ప్రకృతి పారమ్యతే ఇస్మాయిల్ గారిలోనూ శ్రీధర్‌లోనూ దర్శనమిస్తాయి.

ఇస్మాయిల్ గారిలో లేనిది శ్రీధర్‌లో కనబడేది సంస్కృత పదబంధాలపట్ల మక్కువ. ఒకప్పుడు తోలుబొమ్మలాటలో కూడా సంస్కృత శ్లోకాలు వల్లించేవారు. సంస్కృతం బ్రాహ్మణులలోనే మిగిలిపోయిందన్నవాదన ఆంగ్ల మానసపుత్రులు సృష్టించిందే. వీరు సమాజంలోని విభిన్న సంస్కృతుల్నీ జాతుల్నీ ఎన్నడూ ఎక్కడా కలవలేనివిగా భావిస్తారు. ఘర్షణనే పరమసత్యంగా భావిస్తారు. కారణం వారికి ఆంగ్ల విద్య ద్వారా సమాజంతో సంబంధం తెగిపోవడమే కారణం.

సముద్రమూ గోదావరీ కలిసే సంగమస్థలి కోనసీమలో వుంది. శ్రీధర్ కూడా వున్నాడు. శ్రీధర్ కవితల్లో గోమాత చాలాచోట్ల దర్శనమిస్తుంది. యిప్పుడు రకరకాల గోజాతులు స్మృతులుగానే మిగిలిపోతున్నాయి. ఆ స్మృతుల్ని కూడా తుడిచెయ్యాలని ఆధునికత కంకణం కట్టుకుంది. నిజానికి ఆధునికత స్మృతికి విరోధి. స్మృతిపై బురద జల్లడానికే ఆధునికులు యిష్టపడ్తారు.

యీ ఆధునికతను చీల్చుకొని పల్లెకన్నీరు పెట్టిందో కనపడని కుట్రల అంటూ గోరటి వెంకన్న వంటి దళితకవి గొంతు విప్పాడు. అంతరించిపోతున్న వృత్తుల్నీ కళల్నీ స్మరించాడు.

కాని స్మృతిని సంపూర్ణంగా తుడిపెయ్యాలన్న ఆతృత ఆధునికుల్లో స్పష్టంగా కనబడ్తుంది. స్మృతి అంటే వట్టి జ్ఞాపకం కాదు. మన భావోద్వేగాలతో సంస్కృతితో సంప్రదాయాలతో పెనవేసుకున్న ప్రాచీన వృక్షం స్మృతి - ఆ స్మృతికి వాహిక భాష. జ్ఞాపకం సంగతి వేరు. మనం టెలిఫోన్ నెంబర్లని గుర్తుపెట్టుకొంటాం. అది జ్ఞాపకమే కాని స్మృతికాదు.

యంత్రాలకీ జ్ఞాపకశక్తి వుంటుంది కాని స్మృతి వుండదు. స్మృతిని జ్ఞాపకం స్థాయికి దిగజార్చడమే ఆధునికత పని. అదే యాంత్రీకరణ.

అందుకే ఆధునికత భాషపై దాడి చేస్తుంది. భాషని పలచపరచాలని చూస్తుంది. భాషని కేవలం సాధారణ కమ్యూనికేషన్ స్థాయికి దిగజార్చాలని చూస్తుంది.

ఒకసారి శ్రీధర్ నన్ను భోజనానికి పిలిచాడు. ఆ సందర్భంలో నేను తెలుగులో కొన్ని అక్షరాల్ని వత్తుల్నీ తొలగించి సంస్కరించి సరళం చెయ్యాలన్నాను.

అటువంటి సంస్కరణ లేమీ అవసరంలేదు భాషలోని స్వచ్ఛతని మనం చెడగొట్టకూడదు. యిప్పటికే భాష చాలా చెడిపోయింది. సారళ్యం పేరుతో భాషనుంచి చాలా సంస్కృతం తెలుగు పదాల్ని సాగనంపుతున్నాం. చెడగొట్టిందిచాలు. భాషలోని సౌందర్యం పోతే భాష చచ్చినట్లే. భాషలోని మధురిమని వదగడితే భాష మరణించినట్లే. అందువల్ల భాషని సంస్కరించడం కాదు. దాన్ని స్వస్వరూపంలో నిలుపుకోవడం యెలా అన్నది నేటి సమస్య అన్నాడు శ్రీధర్.

అంటే అతడు కవిత్వ భాషనే భాష అంటున్నాడు. దాన్ని ఆ స్థాయినుంచి ఆ సింహాసనం నుంచి దుమ్ములోకి పడదోయడానికి యిష్టపడడంలేదు.

కవిత్వాన్ని ఆధునికులు స్త్రీత్వంగా నిరసిస్తారు అంటాడు డి.ఆర్.నాగరాజు అనే కన్నడ దళిత మేధావి. వికాసవాద యుగం కవిత్వాన్ని అనుమాన దృక్కులతో చూసిందంటాడు. కవిత్వ అభివ్యక్తి స్త్రీల అభివ్యక్తి. దానినెప్పుడూ పర్యవేక్షిస్తూ నియంత్రిస్తూండాలి అని ఆధునిక మేధావులు వక్కాణించారంటాడు.

స్త్రీని కవిత్వాన్నీ ఏక కాలంలో అవమానించారు ఆధునికులు. లూషన్‌లాంటి కమ్యూనిస్టు రచయితలలో కూడా స్త్రీలపట్ల వ్యతిరేకత స్పష్టంగా కనిపిస్తుంది. దీన్ని స్త్రీ వాది సావిత్రిగారు నిరసించారు. సరే ముద్దుపళనిలాంటి కవయిత్రులమీద దాడి తెలిసినదే.

పురుషులను మించి బరితెగించిన వ్యక్తీకరణ ముద్దుపళని చేసిందని సంస్కర్తల కమ్యూనిస్టుల మొత్తంగా ఆధునికుల ఆరోపణ.

నిరంకుశాః కవయః అన్నారు. కవులు నిరంకుశులని సృష్టి కర్తలైన బ్రహ్మలనీ అన్నారు.

సృష్టి అనగానే స్త్రీయే గుర్తుకు వస్తుంది. స్త్రీత్వం వెంటాడుతుంది. అవ్యక్తవేదన, అంతర్మథనం యివన్నీ కవిత్వపు పురిటి నెప్పులు.

ప్రాచీన తాత్వికుడు ప్లేటో కవిత్వాన్ని నిషేధించాలని ఎప్పుడో అన్నారు. అది కట్టుబాట్లను తెంచేస్తుందని భయపడ్డాడు. ఆ తాత్వికతకి కొనసాగింపే నేటి ఆధునికత కూడా. ముఖ్యంగా ప్రసవం నుంచి విముక్తి.

ఆర్థర్ పోషన్ హోవర్ అనే జర్మన్ తత్వవేత్త ప్రపంచం దుఃఖమయమని యీ దుఃఖాన్నుంచి బయటపడాలంటే ప్రసవించడం నిలిపివెయ్యాలన్నాడు.

ఆధునికత గర్భనిరోధక పద్ధతులనే కాదు, ప్రసవంతో సమానమైన అన్నిరకాల వ్యక్తీకరణ పద్ధతులనుంచి విముక్తినీ, స్వేచ్ఛనీ ప్రవచిస్తోంది.

దీనిలో స్మృతులనుంచి స్వేచ్ఛ ప్రధానమైనది. యీ స్మృతి నుంచి స్వేచ్ఛనే మనం వాస్తవికతావాదం అంటున్నాం.

ఆధునికత లైంగికతకి విరోధి. ఇంద్రియాలకి శత్రువు. భావోద్వేగాలను ఊహను కల్పనలను కవిత్వాన్నీ వడగట్టిన ఫక్తు సమాచారం మాత్రమే అవసరం. జ్ఞానం అంటే అదే.

భావోద్వేగ పూరితమైన వ్యక్తీకరణ నుంచి బయటపడాలి. దానినే స్వేచ్ఛ అంటుంది ఆధునికత.

యిది ద్రష్టనుంచి దృశ్యాన్ని వేరుచేసే సైంటిఫిక్ మెథడ్.

అందుకే అభ్యుదయ సాహిత్యంలోకూడా శృంగార వర్ణనల్ని నిషేధించారు ముద్దుపళని మీద శత్రుత్వం అందుకే.

గుమాస్తాలని తయారుచేయడమే ఆంగ్లేయుల విద్యావిధానం అంటారు యీనాటికీ అంతే.

గాలిబ్ సమకాలికుల్లోచాలామంది కూలీలు తోటమాలులు కూడా గాఢమైన కవిత్వం చెప్పేవారు. దాశరథి కవియైన రిక్షావాలా గురించి స్మరించాడొకసారి. యిప్పుడు కవిత్వం భాషనుంచి నిష్క్రమించింది. భాషలో భాగం కాకుండా పోయింది.

సామెతలూ జాతీయాలూ ఎప్పుడో నిష్క్రమించాయి.

యాంత్రికమైన ఆధునిక స్వేచ్ఛకి భాష మరణించడం మొదటి షరతు.

భాషని సంస్కరించి వాస్తవికంగా మార్చాలని ప్రయత్నించింది వికాసవాద యుగపు యూరప్

భాష నుంచి పూర్తి స్వేచ్ఛని ప్రవచిస్తోంది అమెరికా. యాంత్రిక వ్యక్తీకరణనే భాషగా ముందుకు తెస్తోంది.

చరిత్ర మరణించింది - స్మృతులు మరణించాయి
భాష మరణించింది - మనిషి మరణించాడు
స్వేచ్ఛ మిగిలింది.



# లౌక్యాభిరామాయణం

క్రైస్తవ వలసవాదం స్మృతుల్ని వక్రీకరించింది. గాఢత్వాన్ని తగ్గించివేసి వట్టి జ్ఞాపకాలుగా మార్చేసింది.

దీని ఫలితంగా శ్రుతి స్మృతి పురాణాలు బుట్టబొమ్మల్లా మారిపోయాయి. వాటి వైవిధ్యాన్నీ, విస్తృతినీ కోల్పోయాయి. పురాణేతిహాసములు, బహుముఖములు తాత్వికములు. వాటిని ఆధునికులు ఏకశిలా సదృశంగా ఘనీభవింపజేశారు. తాత్వికతని పిండివేశారు. పిప్పిని మిగిల్చారు. ఇంతకీ పురాణేతిహాసములు వైదికతత్వాన్ని కథా రూపంలో విశదం చేయడానికి ఉద్దేశించినవి. వాటిలోని కథతత్వ శాస్త్ర ప్రతిపాదకమే కానీ కథ మాత్రమే లక్ష్యం కాదు. కథ కథకోసం కాదు.

అసలు కథకి, సంఘటనలకీ మానవ అనుభవాలకీ కర్మ భూమిలో ప్రాధాన్యం లేదు. అందువల్లనే గాంధీమహాత్ముడు కూడా ఆత్మకథ ఎందుకు రాస్తున్నావనే ప్రశ్నని ఎదుర్కోవలసి వచ్చింది.

సత్యాన్వేషణ అని తన ఆత్మకథకి నామకరణం చేశాడు గాంధీ. అంటే సత్యాన్వేషణని వివరించడం కోసం కథని ఆలంబనగా చేసుకొన్నాడే కాని ఆత్మకథని రాయడం ప్రధానం కాదు. కథే పరమార్థం కాదు.

ప్రాచీనులు వివిధ రీతుల్లో వేదాంతసారాన్ని మనకి అందించారు. ఉపనిషత్తుల్లో సమాధి భాషలో సత్యాన్ని ప్రతిపాదించారు. సమాధిభాష అంటే సూత్ర ప్రాయంగా నిర్వికల్పంగా సత్యాన్ని వొక సాక్షాత్కారంగా చెప్పడం. తదే జతి తన్నైజతి. అది కదులుతోంది కదలడంలేదు ఇత్యాది ఉపనిషత్ మంత్రాల్లో పరమాత్మ స్వరూపాన్ని ఎటువంటి దృష్టాంతాలూ లేకుండా ప్రతిపాదించారు. వాక్కులకి ఆగోచరమైనదిగా సూక్ష్మంగా సూత్రీకరించారు. ఇది ఉత్తములకి ఉద్దేశించినది.

మరికొన్ని చోట్ల రూపకాలంకారంలో దృష్టాంతాలతో ప్రతిపాదించారు. ఉదాహరణకి పళ్లుతినకుండా సాక్షిమాత్రంగా వుండే పక్షిని వర్ణిస్తూ, సాక్షి చైతన్యాన్ని ఆత్మతత్వాన్ని ప్రతిపాదించారు. ఇది మధ్యములకి ఉద్దేశించినది.

పురాణ ఇతిహాసాల ద్వారా కథారూపంలో తత్వశాస్త్రాన్ని సామాన్య శ్రోతలకి అందజేశారు. ఇదీ కథయొక్క పరమార్థం. కాని పరమార్థం పోయి కథ మాత్రమే మిగిలితే, కాలక్షేపమే పరమార్థమైపోతే ఆధునిక విద్యావంతుల తీరిక సమయపు బఠానీగా మారిపోతే అదే బాపురమణల రామాయణం. అది పటం కట్టుకొని గోడకి తగిలించుకోవడానికి మాత్రమే పనికి వస్తుంది. (ముత్యాల ముగ్గు కూడా వీరి రామాయణం క్రిందేలెక్క).

సరళత్వం కోసమే సారాన్ని త్యజించవలసివస్తే అంతకన్న విషాదం లేదు. దానికన్న సరళత్వాన్ని త్యజించడమే మంచిది. ముళ్ళపూడి వెంకటరమణగారు సరళత్వాన్ని గురించి బోధిస్తుండగా విన్నాను, తిరుప్పావై ఆంధ్రీకరణ సందర్భంలో.

యింతకీ బాపురమణల సరళీకరణ ఏమిటి? రామాయణ సారాన్ని పాతివ్రత్యానికి కుదించివేయడం. యింతకన్నా పాపం మరేమీలేదు.

వీరి సంపూర్ణ రామాయణాన్ని నందమూరి తారకరామారావు రావణునిగా నటించిన సీతారామకళ్యాణాన్ని పక్కనబెట్టి చూడండి. రామారావు సినిమాలో అసలు రామాయణ సారంవుంది.

రామాయణంలో రాక్షసుడైన మారీచుడికి వాల్మీకి యిచ్చిన విశేషణం ఏమిటో తెలుసా? మహాత్ముడు. రాముడిలో లీనమయ్యేంత తీవ్రమైనదీ, నిరంతరాయమైనదీ మారీచునిలోని రామద్వేషం. యింతకీ అది వైరభక్తి. పురాణాలలో సర్వత్రా కనబడేది వైరభక్తే. కారణం ఏమిటంటే - రాగద్వేషాలు, సుఖ దుఃఖాలు యీ ద్వంద్వాలన్నీ పరస్పరాశ్రితాలే.

నిజానికి ద్వంద్వాలు లేవు. అవి మిథ్యాజనితాలు. అందువల్లనే వాటిపట్ల నిర్లిప్తత వహించాలి అని వేదాంతసారం. అందువల్ల రాక్షసుడంటే దైవానికి విరుద్ధమైనవాడు అని అర్థం కాదు. నిజానికి రాక్షసుడు అనే పదానికి నీచార్థం లేదు. రక్షించేవాడు అని అర్థం. దేవతలూ, రాక్షసులూ, అన్న దమ్ములేనని

పురాణాలు చెపుతున్నాయి. యింతకీ ద్రవిడ ఉద్యమాల ప్రభావం వుంటే వుండవచ్చు కాని ఆ వుద్యమాల ప్రభావంతో రామారావు పురాణ పాత్రల్ని కేరికేచర్లుగా చేయలేదు. రావణున్ని చిత్రించడంలో అతనిలోని రాజస స్వభావాన్ని, భక్తినీ, తాత్వికతనీ అతనిలో దాగిన బహుముఖమైన అంశాల్ని బహిర్గతం చేశాడు. మళ్ళీ రావణుడి నుంచి రాముడివైపు ప్రయాణం చేసి శ్రీరాముని వేదనని కళ్లకు కట్టేట్లు చేశాడు, లవకుశలో.

రాముణ్ణీ, రావణున్నీ యిద్దరినీ సమదృష్టితో అర్థం చేసుకోగలిగిన వారు మాత్రమే రామాయణాన్ని అర్థం చేసుకోగలరు. వాల్మీకి వలె రాక్షసులలోని మహాత్ముడిని చూడగలవారు మాత్రమే రామ భక్తులు. బాపూరమణలు అట్టివారు కాదు. వారిలో అంతటి తాత్విక గాఢత్వంలేదు. వారిలోని చమత్కృతి, సౌందర్యమూ వారిని మింగేశాయి. రమణగారికి శబ్ధ చమత్కారంపట్ల మక్కువ యెక్కువ. అది తాత్వికశూన్యాన్నీ గాఢత్వలేమినీ సూచిస్తుంది. తమలో తత్వం (అస్తి నాస్తి విచికిత్స) లోపించిందని ముళ్ళపూడివారు అంగీకరించారు, కోతి కొమ్మచ్చిలో.

రంగనాయకమ్మగారి రామాయణ విష వృక్షమైనా, వాల్మీకి రామాయణాన్ని అర్థం చేసుకోవడానికి సోపానంగా పనికివస్తుంది కాని, బాపూ రమణల సంపూర్ణ రామాయణం ఎందుకూ పనికిరాదు. రామాయణ విషవృక్షానికి లక్ష్యశుద్ధివుంది. బాపూరమణలకి అదేమీలేదు.

యింతకీ వొక గ్రంథాన్ని పొగిడేవాళ్ళు చేసే కీడు తిట్టేవాళ్ళు చేయరు. బుద్ధుడ్ని అవతారంగా కీర్తించడమంటే, బౌద్ధాన్ని తిరస్కరించడమే. రామభక్తి రామాయణంలోని తార్కికతని తాత్వికతని ధ్వంసం చేస్తుంది. త్యాగరాజు వట్టి రామభక్తుడు కాదు. శ్రీరామ తత్వజ్ఞాని, వేదాంతి.

యజ్ఞం చేసే బ్రాహ్మణులు వొక శూద్రుని చేత యజ్ఞనింద చేయిస్తారు. యిట్టి సంప్రదాయాన్ని గురించి ఉప్పులూరి గణపతిశాస్త్రిగారు వేద సారముక్తావళిలో వివరించారు. ఎందువల్లనంటే నిందాస్తుతులు రెండు ముఖాలు

మాత్రమే. అందుకనే వ్యాజస్తుతి శతకాలు అనేకం వెలిశాయి. వ్యాజస్తుతి అంటే పైకి నింద అంతర్గతంగా స్తుతించడం.

అందుకే రామలక్ష్మణులలోని వినయవిధేయతలకి మరో ముఖంగా జాబాలి కనిపిస్తాడు. జాబాలి పితృభక్తి, కర్మకాండల్ని హేతుబుద్ధితో తీవ్రంగా ప్రశ్నిస్తాడు.

ఐతే హేతుబుద్ధికి చాలా పరిమితులు వున్నాయి. నాగార్జునుడు హేతువుకిగల రెండు ముఖాల్నీ బలంగా చూపుతూ హేతువుని అభావం చేసివేశాడు. జాబాలి హేతుబుద్ధి రాముణ్ణి ఢీకొంది. రామాయణం ఆధ్మాత్మ రామాయణంగా పరిణమించడంతో జాబాలి హేతుబుద్ధి కూడా అభావం చెందింది. హేతువు భస్మాసురుడు వంటిది. అది తనని తానే చంపుకుంటుంది. అక్కడే తత్వం పుడ్తుంది.

నందమూరి తారక రామారావు వీరబ్రహ్మేంద్ర స్వామి చరిత్రలో పండితులారా అనే పాటలో బ్రాహ్మణ పండితుల్ని విమర్శిస్తాడు. యిది కొందరు పండితులకి బాధ కలిగించింది. కాని బాధపడవలసిన విషయంకాదు. సనాతన పండితులలో ధిషణాహంకారం వుండేది. తాము విద్యావంతులమనే గర్వం వుండేది. ధనగర్వంలాగే యిదీ మనిషిని బంధిస్తుంది. అందుకే శంకరాచార్యులవారు నహి నహి రక్షతి డుకృఞ్ కరణే అని వ్యాకరణ పండితుల్ని పరిహసించారు.

తత్వం తెలుసుకోవాలేకాని పాండిత్యం వల్ల సమాచార సేకరణ వల్ల వొనగూడేదేమీలేదు. పాండిత్యం వల్ల బుద్ధికి పదునుపెట్టడం వల్ల వచ్చే హేతుబుద్ధి కూడా ఆధ్యాత్మ రామాయణసారంగా పర్యవసించాలి.

ఆధ్యాత్మ రామాయణాన్ని పఠించేవారిని హిందూవాది గోల్వాల్కర్ విమర్శిస్తాడు, బంచ్ఆఫ్ థాట్స్ అనే గ్రంథంలో. ఆ గ్రంథాన్ని పారాయణ చేసేవారు నిర్లిప్తంగా మారిపోతున్నారని విమర్శించారు. నిష్క్రియాపరులు అవుతున్నారన్నారు.

అంటే రామాయణం అద్వైతతత్వంగా మారకూడదు. అదొక వీరగాథగా మాత్రమే మిగలాలి. అలా మిగిలితేనే గుళ్ళూ గోపురాల పేరుతో రాజకీయ ఆధిపత్య పోరాటాలు సాధ్యమౌతాయి.

అందువల్ల రాముణ్ని ఆధునిక హీరోగా మార్చెయ్యాలి. రామాయణంలోని ద్వంద్వాల మధ్య పరస్పర మార్పిడిని హేతుబుద్ధిని, తర్కాన్నీ అంతిమంగా తత్వాన్నీ

అభావం చేసివెయ్యాలి. రాముణ్ణి క్రీస్తుగా, రావణున్ని సైతానుగా నిలపాలి. యిద్దరినీ పూర్తి విరుద్ధమైన వాళ్లుగా చిత్రించాలి. యిందుకోసం నందమూరి తారకరామారావుగారి రామాయణం నుంచి బాపు సంపూర్ణ రామాయణంలోకి ప్రయాణించాలి.

సంపూర్ణ రామాయణం అనే పేరే తప్పుపేరు. రామాయణం ఎప్పటికీ సంపూర్ణంకాదు. యుగ పరంపర కొనసాగుతూనే వుంటుంది. కాలచక్రం తిరుగుతూనే వుంటుంది. శ్రీరామచంద్రుడు మళ్ళీమళ్ళీ జన్మిస్తూనే వుంటాడు. రామకథ కొనసాగుతూనే వుంటుంది. శాఖోపశాఖలుగా విస్తరిస్తూనే వుంటుంది. బహుళ రామాయణాలుగా విలసిల్లుతూనే ఉంటుంది. అది కల్ప వృక్షమేకాని సంపూర్ణ రామాయణంకాదు.

రామాయణ విష వృక్షం అనే పేరువల్ల వచ్చే నష్టమేమీ లేదుకాని. రామాయణాన్ని సంపూర్ణం అని ముగించెయ్యడంలోనే కుట్ర దాగివుంది. అంటే రాముణ్ణి పురాణ పురుషుడిగా కాక చారిత్రక పురుషుడిగా మార్చే ఆధునిక బుద్ధి దాగివుంది. చరిత్ర పురుషులకంటే పురాణపురుషులే యెక్కువ ప్రభావం వేశారంటాడు రామమనోహరలోహియా. పురాణపురుషుల్ని చరిత్ర పురుషులుగా మార్చడంలోనే ఆధునికతవుంది. దేశకాల బద్ధులిగా కుదించడంలోనే ఆధునికత వుంది. సనాతనంపై దాడివుంది. సనాతనం అంటే దేశకాల పరిధులు లేనిది. శాశ్వతమైనది.

యిట్టి సనాతన దృక్పథాన్ని కేవలం పాతివ్రత్యానికి కుదించి వెయ్యవలసిన అగత్యం ఎందుకు వచ్చింది? రామకథ అంటే పాతివ్రత్య కథ. సెక్సుకి సంబంధించిన పవిత్రత, ప్యూరిటన్ దృక్పథంలో కూడిన కథగా కుదించడంలోని ఆంతర్యమేమిటి? బాపూ రమణల సంకుచిత దృక్పథానికి మూలం ఏమిటి? క్రైస్తవ ప్రేరితులైన కందుకూరి గురజాడల దృక్పథమే వారిది. ముద్దపళని రచించిన రాధికాసాంత్వనాన్ని పాతివ్రత్యానికి భంగకరమనే దృష్టితో క్రైస్తవ ప్రభువులచేత నిషేధింపజేశాడు కందుకూరి వీరేశలింగం పంతులు. ఆ విధంగా కామం ధర్మం కాదు మహా పాపం అనే క్రైస్తవ నీతిని భారతీయ నీతిగా మార్చాడు. తారను కూడా పతివ్రతలలో ఒకరిగా కీర్తించిన జాతి భారతజాతి. తార దేవగురువు

బృహస్పతి భార్య. బృహస్పతి శిష్యుడైన చంద్రుని ప్రేమించింది. యీ కథని వర్ణించిన తారాశశాంకాన్ని కూడా బ్రిటీషువారు నిషేధించారు.

క్రైస్తవ ప్యూరిటన్ నీతిని భారతీయులలో వ్యాపింపజేసి వారిని సంస్కరించాలనే వలసవాద దృక్పథం రామకథను కేవలం పాతివ్రత్యానికి సంబంధించిన కథగా సంకుచితం చేసివేసింది. బాపూరమణల వంటి మర్యాదస్తులైన వ్యక్తుల్ని సృష్టించింది క్రైస్తవ విద్యా విధానమే.

యీ క్రైస్తవ విద్యావిధానం ప్రాచీన బ్రాహ్మణులలోని విశాల దృక్పథాన్ని తాత్విక దృష్టినీ తార్కిక పరిణతినీ తొలగించివేసింది. భారతీయ తర్కాన్నీ తత్వాన్నీ తొలగించివేయడం ద్వారా ఇతిహాస పురాణాల్ని కేవలం కాలక్షేపం కథలుగా, కళాత్మక దృశ్యాలుగా మార్చివేశారు వీరు. భారతదేశం కథలకి పుట్టినిల్లు అనిపేరు. విస్తృతమైన వైవిధ్య భరితమైన కథాసాహిత్యం భారతదేశంలో వర్థిల్లిందని పొగుడుతారు. నిజమేకాని అవి కథలు మాత్రమేకావు. వైదికతత్వ ప్రతిపాదకాలు. తత్వాన్ని తొలగిస్తే అని జీవంలేని బొమ్మలు.

ఆలయంలో విగ్రహాన్ని ప్రతిష్ఠించినపుడు మంత్రశక్తిద్వారా ఆ విగ్రహాలకి ప్రాణప్రతిష్ఠ చేస్తారు. లేకపోతే ఆ విగ్రహాలు దేవతలు కానేరవు. అట్టి ప్రాణప్రతిష్ఠచేసే మంత్రశక్తి బాపూరమణలకి లేదు. వారిలో తార్కికత తాత్వికత లోపించింది.

తాత్విక పరిణతి వున్న వ్యక్తి వొకే విషయానికి సంబంధించిన బహు ముఖాల్ని చూడగలుగుతాడు. యీ పరిణతి నందమూరి తారకరామారావులో కనబడుతుంది కాని బాపూరమణలలో కాదు.

తారకరామారావు విశ్వనాథ సత్యనారాయణగారి శిష్యుడు. విశ్వనాథవారి విశ్వరూపం వేయిపడగలు నవలలో కనిపిస్తుంది. ప్రకృతిలో, వ్యవసాయంలో, కుటుంబ వ్యవస్థలో అన్ని రంగాల్లో ఆధునికత తీసుకువచ్చిన మార్పుని చిత్రించారు విశ్వనాథ. ఆధునికత తీసుకువచ్చిన ముప్పుని పసిగట్టారు. బ్రాహ్మణుల పతనం వల్లనే బ్రాహ్మణ వ్యతిరేక ఉద్యమాలు వచ్చాయన్నారు వేయిపడగలలో విశ్వనాథ.

విశ్వనాథ శిష్యుడైన నందమూరి తారకరామారావు యీ బ్రాహ్మణ వ్యతిరేక ఉద్యమాల చైతన్యాన్ని బ్రహ్మజ్ఞానంలో మేళవించడానికి ప్రయత్నించారు. వేమన, వీరబ్రహ్మం వంటివారు బ్రహ్మజ్ఞానాన్ని అనుసరించినవారే. వీరబ్రహ్మంగారైతే తాను శంకరాచార్యుల వారి అవతారమేనన్నారు. యీ విధంగా శూద్రబ్రాహ్మణ తత్వాలనే రెండు ముఖాలు నిజానికి సనాతన ధర్మం యొక్క బహుళత్వానికి ప్రతీకలేనని రామారావుగారి పౌరాణిక దృష్టి చాటుతుంది. ఆయన పౌరాణిక దృష్టిలో తీవ్రత వుంటుంది. సౌమ్యత వుంటుంది. తాత్వికత వుంటుంది. సామాజికత వుంటుంది. యివన్నీ విశ్వనాథ వారిలోనివే శిష్యునిలోకీ సంక్రమించాయి. అంతేకాదు రామారావు కంచి పరమాచార్యులవారి అనుయాయి. చార్వాక తత్వంకూడా యీశ్వరోక్తమేనని సూతసంహిత ప్రవచించింది. యీ సత్యాన్ని స్పష్టంచేస్తూ సనాతన ధర్మం యొక్క బహుముఖీనతని విశాలత్వాన్ని చాటినవారు చంద్రశేఖర సరస్వతి స్వామివారు. వారి అడుగుజాడలలో నడిచి తరించినవారు రామారావు.

బాపూరమణలలో మాత్రం నయాబ్రాహ్మణుల భ్రష్టత్వం దృగ్గోచరమౌతోంది. ఆధునిక విద్య తెచ్చిన లౌక్యం ప్రధానమౌతుంది. అతివినయం విసుగు తెప్పిస్తుంది. పురాణ ఇతిహాసాలకి యెట్టి నూతన వ్యాఖ్యానమూ కనబడదు. అట్టి వ్యాఖ్యానం చెయ్యగల సాహసమూ మృగ్యం.

వ్యాఖ్యానాలకీ, భాష్యాలకీ తలుపులు మూసేసి కథలు మాత్రమే చెప్పుకునే చేవ చచ్చిన తరానికి ప్రతీకలు బాపూరమణలు.

పురాణ దేవతల బొమ్మల్ని నగ్నంగా చిత్రించిన ఎం.ఎఫ్. హుస్సేన్ చిత్ర కళలో సంప్రదాయం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. కాళిదాసు కుమార సంభవంలో వర్ణించిన పార్వతీ పరమేశ్వరుల పవిత్ర రతికేళి గోచరిస్తుంది. భాగవత పురాణంలోని శ్రీకృష్ణలీలలు గుర్తుకువస్తాయి. ఏకంసత్ తనని తానే రెండుగా స్త్రీ పురుషులుగా విభజించుకొని రతికేళి సలపడం వల్లనే సృష్టి యేర్పడిందనే భారతీయ తత్వం హుస్సేన్ చిత్రాల్లో గోచరిస్తుంది. మర్యాదల్ని అతిక్రమించలేని

బాపూ లౌక్యపు చిత్రకళలో సంప్రదాయమూ లేదు చట్టుబండలూ లేవు. పైగా స్త్రీలని అవమానించే బాపు కార్టూన్లు కోకొల్లలు. గయ్యాళి పెళ్ళాలూ, లావయిన స్త్రీలూ, అప్పడాల కర్రలూ వగైరా...

బాపూ బొమ్మల్లో వైవిధ్యం శూన్యం. ఆయన చిత్రాల్లో అందరూ ఒకేలా ఉంటారు. రాముడు, లక్ష్మణుడు, హనుమంతుడు, త్యాగరాజు, చివరికి బాల మురళీకృష్ణ... అందరూ ఒకేలా కన్పిస్తారు అన్నారు మహా వాగ్గేయకారులూ, సినిమా, నాటక కళాకారులూ మంగళంపల్లి బాల మురళీకృష్ణ.

బాపూరమణలది సంప్రదాయ దృష్టి అని ఏమాత్రమూ చెప్పలేం. సనాతన బ్రాహ్మణ దృష్టి అని యేమాత్రమూ చెప్పలేం. సనాతన బ్రాహ్మణుల ఆలోచనలలో వూహలలో అంతులేని సాహసికత కనబడ్తుంది. వారి జీవితం పరిమితం కావచ్చుకాని వూహలు, ఆలోచనలూ అవధులు లేనివి. ఒకే పాత్రయొక్క భిన్న స్వభావాల్ని ఒకే విషయం యొక్క బహుళముఖాల్నీ వారు చూడగలరు వ్యాఖ్యానించగలరు.

వేటూరి ప్రభాకర శాస్త్రిగారు ఒక మహా పండితుడి గురించి చాటు పద్యమణి మంజరిలో రాశారు.

ఆ పండితుడు పెళ్ళి మంత్రాల్ని కూడా వెటకారం చేస్తూ విరుద్ధార్థాల్ని కల్పించి చెప్పేవారు. ఒకసారి పూరీ జగన్నాథస్వామి సన్నిధికి వెళ్ళిన ఆచార్యులవారు రావి ఆకులలో కుట్టిన విస్తరిలో భోజనం చేస్తున్నారు. స్థానిక బ్రాహ్మణులు విష్ణువు శయనించిన పత్రాలపై భోజనం చేయడం ధర్మంకాదని వ్యాఖ్యానించారు. దానికి శాస్త్రిగారు చమత్కారంగా సమాధానం యిచ్చారు. అయ్యా నేను విష్ణువు శయనించిన పత్రాలపై భోజనం చేస్తున్న మాట నిజమే. మీరు విష్ణువునే భుజించేస్తున్నారు ఆ సమాధానానికి బ్రాహ్మణుల నోళ్ళు మూతలు పడ్డాయి. ఒరిస్సాలో బ్రాహ్మణులు చేపలు తింటారు. మత్స్యము విష్ణువు అవతార స్వరూపమేకదా.

యిదీ పురాణతత్వం జీర్ణమైన వారి వచనశైలి. బాపూరమణల నుంచి యిట్టి వ్యాఖ్యానం అసాధ్యం. వారికి పురాణాలు పూజనీయ వస్తువులేకాని జీవితంలో భాగం కాదు. క్రైస్తవ వలసవాద దృష్టినుంచి వచ్చిన గిల్టీ ఫీలింగ్ వారిని వెంటాడుతూ వుంటుంది.

అందుకే వారు పురాణ కథలని పట్టుకుని వేళ్లాడ్తారేకాని పురాణ కథలకి వ్యాఖ్యానం చేయడానికి సిద్ధపడరు. వారికి పురాణం గతం మాత్రమే. వర్తమాన జీవితం కాదు. ఎందుకంటే వ్యాఖ్యానాలు వివాదాస్పద వ్యాఖ్యలుగా పరిణమిస్తాయని భయపడ్డారు. యీ భయంతో అసలు వ్యాఖ్యానాలకే దూరంగా వుండిపోయారు. కథలు చెప్పుకుని బతికేవారుగా మిగిలిపోయారు

సీరియస్ ఫిలాసఫీ లేకపోవడం వల్లనే వీరిస్నేహం చివరివరకు శాసనంలా నిలిచిపోయింది.

వీరి శిష్యప్రశిష్యులు కూడా జీవిత చిత్రణచేసే కథకులుగా మిగిలిపోయింది యిందువల్లే. జీవితతత్వం అనవసరం. జీవితాన్ని చిత్రించాలి అంతే. అందుకే అమాయక బాల్యాన్ని చిత్రించే కథల దగ్గరే నిలిచిపొమ్మని శిష్యుల్ని శపించారు. యిట్టి శాపగ్రస్తుడే నామిని సుబ్రహ్మణ్యం, భీమేశ్వర లింగానికి మేకుకొట్టి యెదగకుండా చేసినట్లు కథారచయితల్ని బాల్యానికి బందీలుగా మార్చారు బాపూరమణలు. యిందుకు వీరి పొగడ్తలు తోడ్పడ్డాయి.

తర్కాన్ని కొసకంటా లాగి తత్వంలో పర్యవసింపజేసిన భారతీయమేధని మసకబార్చింది ఆధునికత.

భారతీయ కథా రీతుల్ని వట్టి జీవిత సంఘటనలుగా మిగిల్చేసింది అమెరికనిజం. ఎంతో స్వేచ్ఛగా విశాలంగా ఆలోచిస్తున్నామనుకొనే ఆధునికులు చాలాసార్లు తాత్వికమైన డొల్లతనానికి ప్రతీకలుగా నిలిచిపోతారు.

అదే అమెరికనిజం.



# అర్థం వ్యర్థం

అర్థమనర్థం భావయ నిత్యం

అర్థాన్ని అనర్థంగా భావించు. అర్థాన్ని అధ్వాన్నపుటడవిలో వదిలేసెయ్ అని భాష్యం చెప్పాడు మిత్రుడు నరహరి

వేదం వల్లెవేసే వారికి వినేవారికి వేదార్థంతో పనిలేదు. పక్షుల కలకూజితాలకు స్పందించడానికి పక్షుల భాష తెలియనక్కరలేదు. అవ్యక్తధ్వనే యీ విశ్వానికి మూలం అదే శబ్దబ్రహ్మ

***యత్రార్థః శబ్దోవా***
***తమర్థ ముపసర్జనీకృతస్వార్థౌ***
***వ్యంక్తః కావ్యవిశేషః***
***సధ్వనిరితి సూరిభిః కథితః***

శబ్దమూ అర్థమూ తమ స్వార్థాన్ని విడిచిపెట్టేస్తాయి. అంటే తమను తాము త్యాగం చేసుకుంటాయి. కొవ్వొత్తిలా కరిగిపోతాయి. అలా శబ్దార్థాలు కరిగిపోతూ వ్యంగ్యానికి జన్మనిస్తాయి. అదే ధ్వని

అసలు ధ్వని అనేపదానికి సాధారణ అర్థం ఏమిటి? అర్థంతో పనిలేని రకరకాల అవ్యక్త శబ్దాలని మనం లోకంలో ధ్వని అంటుంటాం.

అర్థం వెంట వెర్రిగా పరిగెత్తద్దని సనాతనులు హెచ్చరిస్తూ వచ్చారు. అంతకన్న శబ్దం యొక్క స్వరాలని ఉచ్చరించడంలో శ్రద్ధ వహించమన్నారు. ఉదాత్త అనుదాత్త స్వరితాలనే పేరుతో స్వరాలని మూడుగా విభజించారు వేదంలో. స్వరం తప్పితే మరణం ప్రాప్తిస్తుందని హెచ్చరించారు.

అంటే అర్థం మీద కాదు. శబ్దంమీద సర్వేంద్రియాలను కేంద్రీకరించాలి. అందుకే సంస్కృత అభ్యాసంలో శబ్ద మంజరికి అంతటి ప్రాధాన్యం వచ్చివుండవచ్చునంటాడు మిత్రుడు నరహరి.

శబ్ద ఉచ్చారణ సక్రమంగా లేకపోతే ఏమవుతుంది. తీవ్రమైన అనర్థం ప్రాప్తిస్తుంది. మృత్యువే గతి కావచ్చు.

***మంత్రోహీనః స్వరతో వర్ణతోవా***
***మిథ్యాప్రయుక్తో న తమర్థమాహ***
***స వాగ్వజ్రో యజమానం హినస్తి***
***యథేంద్రశత్రుః స్వరతోపరాధాత్***

వృత్రాసురుడు తన శత్రువైన ఇంద్రుని వినాశనాన్ని కోరి ఒక యజ్ఞాన్ని చేయదలచాడు. దానికి కావలసిన రుత్విజులను పిలిచాడు. యజ్ఞంలో ప్రధాన మంత్రం ఇంద్రశత్రుర్వర్ధస్వ. ఇంద్రునియొక్క శత్రువు వర్థిల్లాలి. ఇంద్రుడు నశించాలి అని దీని పిండితార్థం. రుత్విక్కులు ఉచ్చారణలోని అజాగ్రత్తవల్ల యీ మంత్రం వృత్రాసురునికే చావుని తెచ్చిపెట్టింది. ఇంద్రుడు వర్థిల్లాలని, ఇంద్రుని శత్రువైన వృత్రాసురుడు నశించాలనే అర్థం ప్రాప్తించింది.

ఇక్కడ ఉచ్చారణకి చాలా ప్రాధాన్యం వుంది. వాక్కే వజ్రాయుధం. స్వరంలోనూ వర్ణ ఉచ్చారణలోనూ చిన్నతేడా వల్ల ఉచ్చరించిన వాడికే నాశనం వస్తుంది.

అందుకే శ్రుతికీ లేఖనానికీ సంబంధంలేదు. అలాగే శబ్దానికీ అర్థానికీ సంబంధం లేదు. ఉచ్చరించే వ్యక్తీ, ఉచ్చరించిన సందర్భం, కాలం, సంస్కృతీ యిలాంటి వెన్నో కలిసి శబ్దానికి వొక అర్థాన్ని కల్పిస్తున్నాయి. అందుకే గీతకి అన్ని భాష్యాలు, మార్క్సిజానికి అన్ని వ్యాఖ్యానాలు

మరి శబ్దానికి వైయాకరణులు ఇచ్చిన అర్థం ఏమిటి? శబ్దం బ్రహ్మస్వరూపం. అది నిర్వికల్పం. ఉనికి మాత్రమే దాని అర్థం. గోత్వం, మానవత్వం, వస్తుత్వం యిలా అన్నిట్లోనూ దాగిన 'త్వం' అనేదే శబ్ద పరమార్థం. అన్నిట్లోనూ ఏక రూపంగా వున్న వునికే సత్యం. ఐతే అది అగోచరం, అవ్యక్తం.

సముద్రంలో అలలు రేగినట్లు యీ అర్థాలన్నీ ఆ అవ్యక్త శబ్దంలోంచి వచ్చే బాహిరవ్యక్తీకరణలు. వాటికి నిజమైన స్థితిలేదు. తత్త్వం అసి అనే ఉపనిషత్

వాక్యం అదీ నీవు రెండూ వేరువేరుగా లేవు అని చెప్తోంది. అంటే మూలపు ఉనికిలోకి ప్రయాణం కమ్మంటోంది.

మూలం శబ్దమే కాని అర్థం కాదు. అర్థం దిగజారుడుతనం మాత్రమే. అందుకే భాష భాష్యాలకి లోనౌతూపోతుంది. భాష్యాల మధ్య అగాధాన్ని సృష్టిస్తుంది. చివరికి కమ్యూనికేషన్‌ని అసాధ్యం చేస్తుంది. పరిష్కారాన్ని పరిష్కారాలుగా మార్చి పరిష్కారం లేకుండా చేస్తుంది. అర్థాన్ని నానార్థాలుగా మార్చి చివరికి వ్యర్థమౌతుంది. అదే సమయంలో ఒకే అర్థం కోసం ప్రయాస పట్టుదల నియంతృత్వంగా ఫాసిజంగా ఘనీభవిస్తుంది. ఒకే అర్థం కోసం ప్రయత్నం నుంచే హిట్లరూ, స్టాలినూ పుట్టుకొచ్చారు.

సెర్చ్ ఫర్ మీనింగ్ అనేది ఆధునిక యుగంలోని భయంకరమైన విషాదం. జీవితానికి అర్థం ఏమిటి? ప్రకృతికి అర్థం ఏమిటి? మనిషికి అర్థం ఏమిటి? జంతుజాలానికి అర్థం ఏమిటి?

అర్థం అంటే ఉపయోగం, వినియోగానికి అర్హమైనది. ప్రకృతి మనిషి కి ఉపయోగపడాలి. అందలి లోహాల్నీ, మణుల్నీ, రత్నాల్నీ, వజ్రాల్నీ అన్నిటినీ బయటికి లాగి వుపయోగించుకోవాలి. ఉపయోగమే దాని అర్థం, పరమార్థం.

మనిషి కూడా ఏదో ఉత్పత్తిచేయాలి. తనని తాను వ్యక్తీకరించుకోవాలి. అప్పుడే మనుషులు మానవ వనరులుగా మారతారు.

పాశ్చాత్యతాత్విక పరిభాషలో చెప్పాలంటే బీయింగ్ ఇన్ ఇట్‌సెల్ఫ్‌గా యేదీ వుండకూడదు. బియింగ్ ఫర్ ఇట్ సెల్ఫ్‌గా మారిపోవాలి. అంటే తనలో తానుగా మిగిలి పోకూడదు. తనకోసం, పరులకోసం పరిణమించాలి.

తనలో తాను కూనిరాగాలు తీయకూడదు. అవ్యక్త వూహల్లో అవ్యక్త ప్రపంచంలో మంత్రనగరిలో సంచరించకూడదు. వొకవేళ సంచరించినా దాని వెలుగుని యితరులకి ప్రత్యక్షం చేసినపుడే వ్యక్తీకరించినపుడే సార్థకమౌతుంది. లేకపోతే నిరర్థకం. టీవీలో కనబడి పాడినపుడే అది పాట అవుతుంది. నీలో నీవు పాడుకునేది సంగీతమే కాదు.

అవ్యక్త ధ్వనులూ కలకూజితాలూ వ్యర్థం. శబ్దంగా మిగిలిపోయిన వేదాన్ని కూడా స్పష్టమైన అర్థంలోకి యీడ్చుకురావాలి. ఆధునికులైన దయానంద సరస్వతి, అరవింద స్వామి వేదానికి పాశ్చాత్య చోదిత అర్థాల్ని సమకూర్చారు. శ్రుతిని శ్రుతిగా మిగల్చకూడదనే ఆధునిక బుద్ధే దీనికి మూలం.

శబ్దం బ్రహ్మమనే తత్వం ఆధునికులకి గిట్టదు. ప్రతీదానికీ అర్థం కావాలి. పరమాత్ముని కోసం పాడే సుప్రభాతం కూడా తెలుగులో వుండాలి. దానిలోకూడా మనుషులకి సంబంధించిన నీతులూ, గవర్నమెంట్ పాలసీలూ, జీవోలూ వుండాలి. శృంగారం అసలే వుండకూడదు. ఎందుకంటే అవి తమ క్రైస్తవ విద్యా విధానానికి విరుద్ధం. క్రైస్తవ మర్యాదకి భంగకరం. నీతులకంటె బూతులు శ్రేష్ఠమైనవనే సత్యాన్ని కత్తి పద్మారావు గారిలాంటి దళిత వాదులు తెలుసుకోవాలి. అప్పుడే సృష్టిరహస్యం అవగతమౌతుంది.

విషయ సుఖాల్లో కూడా బ్రహ్మానందం దాగివుందని అన్నారు సనాతనులు. అందుకే సుప్రభాతాల్లో జేర్చారు. ప్రభాతమంటే పునస్సృష్టే కదా. జీవసృష్టే కాని దైవసృష్టి లేదన్నారు అద్వైతులు. జీవుడే మెలకువలోయీ విశ్వాన్ని సృష్టించుకొంటున్నాడు. నిద్రలో ఉపసంహరించుకొంటున్నాడు. దీనికొక అర్థాన్ని జీవుడే కల్పిస్తున్నాడు. అర్థం కల్పితం మాత్రమే. అంటే సృష్టి కల్పితమే. యీ అద్భుతమైన సృష్టికన్న గొప్ప కల్పన వేరేలేదు.

స్పష్టమైన అర్థంకోసం అన్వేషణ కల్పనకిగల విస్తృతిని తిరస్కరించడమే. అంతిమంగా కాల్పనికతకి ద్వారాలు మూసి వేయడమే. ఆధునిక యాంత్రిక నాగరికతలోకి యిమిడిపోయి అంతరించాలంటే యిదే మార్గం. వాస్తవికతావాదానికి మూలమిదే. అర్థం కోసం అన్వేషణ.

ఆధునిక కాలంలో నిఘంటువుల పుట్టుక అర్థం సుసాధ్యమనే భావాన్ని బలపరిచింది. ప్రాచీన కాలంలో అమరకోశాది సంస్కృత నిఘంటువులు కంఠస్థం చేయడానికి వీలుగా వుండేవి. అవి శబ్దాల నిధులు అంతేకాని నిఘంటువులు కాదు. ఆధునిక నిఘంటువు పరమార్థం మాత్రం పూర్తిగా అర్థాల్ని స్థిరీకరించడం. యీ నిఘంటువులు గ్రంథాల్ని లేఖనాలుగా స్థిరపరిచాయి. శృతికిగల ప్రాధాన్యాన్ని తగ్గించివేశాయి. పఠన లేఖనాలకి ప్రాధాన్యాన్ని పెంచాయి.

శృతికి ప్రాధాన్యం తగ్గిపోవడం వినికిడికి ప్రాధాన్యం తగ్గిపోవడం ఇంద్రియాల ప్రాధాన్యాన్ని తగ్గించివేసింది. పుస్తకం ప్రాముఖ్యత పెరిగింది. పుస్తకాన్ని వొంటరిగా చదువుకోవచ్చు. పదాలకి అర్థం తెలియకపోతే నిఘంటువులని ఆశ్రయించవచ్చు. దాంతో ముఖతః వెలువడే వాక్కు అదృశ్యమైంది.

ప్రకృతితో మనిషికిగల అనాది అనుబంధంలోంచి భాష పుట్టింది. కాని యిప్పుడు భాష శూన్యంలోకి నెట్టివేయబడింది. అనంత విశ్వంతోగల సంబంధం నుంచి విడదీయబడింది. మానవ పరిణామంతో ముడిపెట్టబడింది. అసలు సత్‌తో ఉనికితో సంబంధం గల శబ్దబ్రహ్మ భాషాశాస్త్ర పరిభాషలోకి కుదించబడింది. విశాల తాత్వికత నుంచి విడదీయబడింది. చిన్న శాస్త్రశాఖగా కుదించబడింది.

ఇట్టి సంకుచిత పరిస్థితుల్లో భాషకి అర్థమే ప్రధానం. అది కమ్యూనికేషన్ సాధనం మాత్రమే. భాషలో యింతటి సౌందర్యం, నిగూఢత, ధ్వని యెలావచ్చాయనేది అసలు ప్రశ్న. భాష పుట్టుక విశ్వం పుట్టుక అంత నిగూఢమైందన్న సత్యం విస్మరించబడింది.

ప్రతీదాన్నీ వ్యక్తీకరించవచ్చు. అర్థాన్ని లాగవచ్చుననే ఆధునిక అహంవల్ల నిజానికి వ్యక్తీకరణ అనేదే పలచబడి మసకబారి అంతర్ధానమైపోయింది.

తానుచూస్తున్న ప్రపంచానికి స్పష్టమైన అర్థం యివ్వాలనే అజ్ఞానం నుంచే దేవుడు పుట్టాడు. మతం పుట్టింది. సైన్సుకూడా పుట్టింది. మతమూ సైన్సూ ద్వంద్వాలు అంటే పరస్పరాశ్రితాలు. విరుద్ధంగా కనబడినప్పటికీ రెండూ వొకటే. వాటిమధ్య ఘర్షణ వైరభక్తి మాత్రమే.

నిజానికి భారతీయ తత్వశాస్త్రంలో దేవుడు లేడు. కార్యకారణపౌర్వాపర్యం వున్నపుడే దేవుడికి స్థానం వుంటుంది. కారణం ముందు కార్యం తర్వాత. యిదే కార్యకారణ పౌర్వాపర్యం. యీ సిద్ధాంతం నుంచే ప్రతీదానికీ కారణం ఏమిటి అనే ప్రశ్న పుడ్తుంది.

దేవుడు వున్నాడు. అతడే ఈ విశ్వాన్ని సృష్టించాడు. దీనిలో ఒక క్రమం వుంది. కార్యకారణ పౌర్వాపర్యం వుంది. యిదే కార్యకారణ సంబంధం.

భారతదేశంలో దేవుడికి స్థానంలేదు. దేవుళ్లు వున్నారు. వాళ్లు మన జనాభాకన్న యెన్నోరెట్లు యెక్కువ. చార్వాకులు అసలు సృష్టికర్త లేడన్నారు. చార్వాకులు వేద నిందకులు. కాని వేదాన్ని ప్రమాణంగా భావించే మీమాంసకులు కూడా యీశ్వరుడు లేడన్నారు.

అందుకే చార్వాకులూ మీమాంసకులూ దొందూదొందేనని జైనులు స్పష్టం చేశారు. చార్వాకులు నాస్తికులైతే, మీమాంసకులు ప్రచ్ఛన్న నాస్తికులు అన్నారు. వొకరు వేద ప్రామాణ్యాన్ని అంగీకరిస్తారు, మరొకరు అంగీకరించరు. అంతకుమించి తేడా లేదన్నారు. వేదాంతులూ, పౌరాణికులూ భగవంతుడే జగత్తు, జగత్తే భగవంతుడు అన్నారు. భగవంతుడికీ, జగత్తుకీ కార్యకారణ సంబంధాన్ని కార్యకారణక్రమాన్ని యెవరూ స్థాపించలేదు.

భగవంతుడే జగత్తు అన్న పాంథీయిజం ప్రచ్ఛన్న నాస్తికత్వమేనంటాడు రిచర్డ్ డాకిన్స్. గాడ్‌డెల్యూజన్ అనే గ్రంథంలో యీమాట అంటాడు.

జగత్తుకంటే భగవంతుడు వేరుగా వున్నాడన్న భావనే థీయిజం అని నిర్వచించాడు.

కాని ఆధునిక యుగంలో దయానంద సరస్వతి, రాజారామమోహనరాయ్ వంటి సంస్కర్తలు ఏకేశ్వరోపాసన పేరుతో దేవుడిని వెతికిపట్టుకోవడానికి ప్రయత్నించారు. యీ జగత్తుకీ, జీవితానికీ స్పష్టమైన నిఘంటుపరమైన అర్థాన్ని కల్పించాలంటే దేవుడు అవసరం. దేవుడొకడువుండి యీ ప్రపంచాన్ని సృష్టించాడనడం మరీ అవసరం. అంటే కార్యకారణ సంబంధం అవసరం. యీ కార్యకారణ సంబంధమే క్రైస్తవానికీ క్రైస్తవ సైన్సుకీ మూలం.

పాశ్చాత్య దేశాల్లో సైన్సుకీ మతానికీ మధ్య తీవ్రమైన ఘర్షణలే జరిగాయి. యీ విశ్వాన్ని దేవుడు కొన్ని రోజుల్లో సృష్టించాడని మతవాదులు అన్నారు. దేవుడితో పనిలేదు. విశ్వంలోని కార్యకారణ సంబంధం వల్ల పరిణామం జరుగుతోందని సైన్సువాదులు అన్నారు. వీరిమధ్య తీవ్ర ఘర్షణ జరిగింది. నీషే అనే జర్మన్ తత్వవేత్త దేవుడు మరణించాడన్నాడు.

భారతదేశంలో యిట్టి ఘర్షణకి అవకాశంలేదు. యెందుకంటే దేవుడు జన్మించనే లేదు. కార్యకారణ సంబంధం పుట్టనేలేదు. కార్యకారణాల మధ్య అభేదం మాత్రమే భారతీయ తత్వసారం, భారతీయ మనస్తత్వం.

పరమార్థమే విశ్వం. అంతే కాని విశ్వానికొక అర్థంలేదు. వాచ్యార్థం లేదు. ధ్వని వుంది. అదే మోక్షం. మోక్షాన్ని మనం నిర్వచించలేం. మోక్షానికి నిఘంటు అర్థం లేదు. నిర్వచనం లేదు. నేతి, నేతి అదికాదు, అదికాదు అని చెప్పవచ్చు. ఫలానా అని వాచ్యంగా చెప్పలేం. వాచ్యాన్ని త్యజించి ధ్వనిలోకి ప్రయాణించాలి.

యీకారణం వల్లనే శైవమూ వైష్ణవమూ యెంత తీవ్రమైన రూపంలో చెలరేగి నప్పటికీ భారతదేశంలో మతం పుట్టలేదు. వొకే ప్రవక్త, వొకే గ్రంథం వొకే దేవుడు అనే భావన స్థిరపడలేదు. పరమేశ్వరుడు జగన్నాటక సూత్రధారేకాని జగన్నాటక కర్తకాదు. కర్త లేదు. యెందుకంటే ద్రష్ట దృశ్యము రెండుగా లేవు.

అందుకే అలంకార శాస్త్రం కూడా తన్మయీ భావాన్నే రసంగా పేర్కొంది.

యిట్టిచోట దేవుడూ మతం పుట్టే అవకాశం లేదు. వాచ్యార్థం ధ్వనిలో కరిగిపోయే చోట, సహృదయుడు నాటకంలో కరిగి అదృశ్యమయ్యేచోట, భగవంతుడు విశ్వంలో విశ్వం భగవంతునిలోనూ లీనమయ్యేచోట యీ విశ్వానికీ జీవితానికీ నిఘంటుపరమైన అర్థంలేదు. వాచ్యార్థం లేదు. కనబడే ప్రయోజనం లేదు.

అర్థంలేని చోట అభివృద్ధిలేదు.

ఆధునిక అభివృద్ధితోపాటు దేవుడి అవసరం కూడా పెరుగుతోంది. ఆధునిక అభివృద్ధి తర్క విరుద్ధం. దేవుడు కూడా తర్క విరుద్ధుడే. అనంతమైన విశ్వానికి క్రమాన్ని యేర్పరచడం, యీ అనంతమైన ప్రవాహంలో కార్యకారణ శృంఖలని వెతికి పట్టుకోవడం కూడా తర్క విరుద్ధమే. రక్షణ కోసం మితిమీరి తపనపడ్తూ ప్రళయంవైపు ప్రయాణిస్తున్న ఆధునిక అభివృద్ధి పూర్తిగా తర్క విరుద్ధం.

తర్కానికీ ఊహకీ తలుపులు మూసివేయడాన్నే ఆధునికులు స్వేచ్ఛ అంటారు. స్వేచ్ఛాచింతన అంటారు. లిబరలిజం అంటారు.

**తర్కం లేదు ఊహలేదు**
**కల్పనలేదు, పౌరాణిక కల్పనలేదు**
**తత్వం లేదు**
**నిస్సారమైన స్వేచ్ఛ వుంది**

క్రైస్తవం తీసుకువచ్చిన దేవుడు మతముకూడా పూర్తిగా మార్కెట్‌లో కరిగిపోతారు. దేవుడి బదులు సరుకుల్ని ఆరాధిస్తాం. దేవుడు కూడా సరుకుగా మారిపోతాడు. సరుకులు దేవుడి స్థానాన్ని ఆక్రమిస్తాయి రెండూ బాహ్యమైనవే. అదే యూరప్‌నుంచి  అమెరికనిజానికి ప్రయాణం.



# అపజయోస్తు

భారతీయులు యెందువల్ల సాంకేతిక ఆవిష్కరణలు చేయలేదు. యెంతో ప్రతిభావంతులైన భారతీయ రుషులు ఉద్దేశ్య పూర్వకంగానే అటువంటి పరిశోధనలకి దూరంగా వున్నారా అని ప్రశ్నించారు మిత్రులు పిన్నమనేని మృత్యుంజయరావు గారు. యీ ప్రశ్నవేసి కొన్ని సంవత్సరాల కాలం గడిచింది.

మనం చూసే దృష్టినిబట్టి మన ఆవిష్కరణలు వుంటాయి. దృష్టే సృష్టి. భారతీయులు ప్రకృతిని యెలా చూశారు. వ్యక్త అవ్యక్త సంచారంగా చూశారు. సూక్ష్మ స్థూలాలుగా చూశారు. స్థావరజంగమాలుగా చూశారు. మంత్ర శక్తిగా చూశారు. శబ్దబ్రహ్మగా చూశారు. సర్వవ్యాప్తమైన పరమాత్మగా చూశారు. పరణామశీలమైనదిగా చూడలేదు. నీచ-ఉన్నత స్థితులుగా కాక వొకే స్థితిగా చూశారు. స్థితి భేదాలు కల్పితాలు అన్నారు.

అందుకే సాపేక్ష స్థితిని దాటి పూర్ణ స్థితిని అంతర్దృష్టితో వీక్షించారు. గణితంలోనూ పౌరాణిక కల్పనల్లోనూ అనంతాన్ని ఆవిష్కరించారు. అనంతం అనే భావనని విప్లవంగా అభివర్ణిస్తాడు హెగెల్ యిది పంతొమ్మిదవ శతాబ్ది విప్లవంగా అభివర్ణిస్తాడు. కాని భారతీయులకి అనాదిగా జీర్ణమైపోయిన దృక్పథం అనంతం.

అనంతంలో కొలతలు సాధ్యం కావు. భౌతిక పరిశీలనలు నిలిచిపోతాయి. ఖగోళపరిశోధన నిర్దుష్టంగా కదలడం కష్టం. యీ విషయాన్ని స్పష్టంగానే గుర్తించాడు స్టీఫెన్ హాకింగ్, కాలం కథ పుస్తకంలో.

ప్రపంచాన్ని వ్యక్తమధ్యమమైనదిగా భగవద్గీత వర్ణిస్తుంది. ఆద్యంతాలు అవ్యక్తాలేనంటుంది. మృత్యువే జీవులకి సహజ స్థితి. జీవితం క్షణకాలం మెరిసేది మాత్రమేనంటాడు కాళిదాసు.

అవ్యక్తం, మృత్యువు, అనిర్వచనీయస్థితి, ఆకాశం వీటికి విశ్వంలో కొలవ లేనంత స్థలముంది. పదార్థాన్ని మాత్రమే మనం చూడగలం. భావాన్ని మాత్రమే మనం చూడగలం. అభావాన్నికూడా వొక పదార్థంలాగే వివిధ అభావాలుగా విశ్లేషించారు నైయాయికులు. ప్రాగభావం, ప్రధ్వంసాభావం అత్యంతాభావం, అన్యోన్యాభావం యిత్యాదిగా అభివర్ణించారు.

గుణాలపై కాదు నిర్గుణంపై దృష్టి నిలిపారు. సవికల్పాన్ని కాదు నిర్వికల్పాన్ని అధికంగా స్మరించారు. కొలతలపై కాదు అనంతం గురించి తమ గణిత మేధని వుపయోగించారు. పూర్ణాన్ని అందుకోవాలని చూశారు. కాలాన్ని కాదు. కాలాతీత స్థితిని అపేక్షిస్తూ పౌరాణిక ప్రపంచంలో విహారం చేశారు.

భారతీయుల గురించి ఆల్‌బిరుని అనే మధ్యయుగాల అరబ్ పండితుడు ఒక విమర్శ చేశాడు. భారతీయులు మణులకీ, రాళ్ళకీ తేడాని తెలుసుకోలేక పోతున్నారు. రెండింటినీ వేరుచేయలేనంతగా కలిపేస్తున్నారు అని విమర్శించాడు.

నిజానికి భారతీయ తత్వంలో మణులకీ రాళ్ళకీ తేడాలేదు. కల్పనకీ వాస్తవానికీ దూరంలేదు. అట్టి వేర్పాటుకి సరైన ప్రాతిపదికలేదని వారు గుర్తించారు. మణులు కూడా రాళ్ళేనని వాటి విలువ మానవ ఆపాదితమేనని భారతీయులు గుర్తించారు. యిదేవారి గొప్ప ఆవిష్కరణ.

క్రైస్తవ వలసవాద ప్రభావానికి లోనైన కోశాంబి అనే చరిత్రకారుడు భారతీయులకి గొప్ప తత్వవేత్తలు లేరన్నాడు. తమ్మినిబమ్మి చేసే శంకరాచార్యుని వంటి వేదాంతి తప్ప, అరిస్టాటిల్ లాంటి తత్వవేత్త లేడన్నాడు. ప్రతిదాన్నీ ముక్కలుచేసి విడివిడి భాగాలుగా చూడడాన్ని విశ్లేషణ అంటాం. యీ విశ్లేషణాత్మక దృష్టి అరిస్టాటిల్‌లో కనబడ్తుంది. ముక్కలుగా చూడడం అనేది పూర్ణాన్ని చూడడం కాదు. పూరేకులుని చూడడం, పుష్పాన్ని సంపూర్ణంగా చూడడం వొకటికాదు ఋషులు పూర్ణస్థితి కోసం అన్వేషించారు.

పూర్ణస్థితిలో ముందు వెనుకలు, ఉచ్చనీచాలు వుండవు. అవి వట్టి అజ్ఞాన జనితాలు. అందుకే భారతీయుల కాలం కూడా ముందుకి కదలదు. నిరంతరం

చక్రాకృతిలో భ్రమిస్తుంది. దేనికీ మొదలూ తుదీలేదు. యిదే జన్మ సిద్ధాంతానికి మూలం. అనాది అనంతంగా జన్మ పరంపర కొనసాగుతుంది. కాలం కూడా ఆద్యంతాలు లేకుండా చక్రాకృతిలో భ్రమిస్తూంటుంది. సంవత్సరాలు అరవై. అవి తిరిగి తిరిగి చక్రంలా భ్రమిస్తుంటాయి.

యీ చక్రభ్రమణంలో కాలం కదలిక లేకుండా స్తబ్ధంగా నిలిచిపోయిందని కోశాంబి విమర్శించాడు. కాలాన్ని చక్రంలా కాక బాణంలా ముందుకు దూసుకు పోయేదిగా చూడాలి. గతి శీలమైనదిగా పురోగమన శీలమైనదిగా చూడాలి అని ఆయన దృక్పథం.

కోశాంబి దృక్పథానికి మూలం పాశ్చాత్య దేశాల ఆలోచనా విధానంలో వుంది. సెమిటిక్ మతాల ప్రాపంచిక దృక్పథంలో వుంది. సైన్స్‌ఫిక్షన్ రచయిత హెచ్.జి. వెల్స్ అంటాడు. యూదు క్రైస్తవ మతాలు కాలాన్ని బాణంలా ముందుకు దూసుకు వెళ్లేదిగా చూస్తాయి. బుద్ధుడు సమకాలీన భారతీయ దృక్పథంలోని లోపం వల్ల కాలాన్ని చక్రభ్రమణంగా అనంతమైన పునరావృత్తిగా భ్రమించాడు. అది తప్పు అంటాడు హెచ్.జి. వెల్స్. కాని గ్రీకుల జినో పేరడాక్స్ బాణం కదలికనే ప్రశ్నించింది. యెప్పుడూ యెక్కడో ఒక స్థలంలో నిలిచి వుంటోంది బాణం అంతేకాని కదలడంలేదు అని గమనాన్ని అభావం చేసివేసింది. అసలు గమనాన్నే సందేహించింది.

అది సోక్రటీస్‌కి ముందు స్థితి అనుకోండి. సోక్రటీస్ తర్వాత జరిగిన తాత్త్విక ప్రస్థానం అంతర్ముఖంగా కాక బహిర్ముఖంగా సాగింది. యిదే హేతుబుద్ధివైపు పయనించింది.

భారతీయుల దృష్టిలో హేతువుయొక్క ప్రయోజనం హేతువుని నిరాకరించడమే. వజ్రాన్ని వజ్రంతో కోయడమంటే యిదే. ఉష్ణం ఉష్ణేన శీతలమన్నా అదే.

కాని పాశ్చాత్య తత్వశాస్త్రం హేతుబుద్ధిని సానబెట్టడాన్ని దానికదే పరమ ప్రయోజనంగా భావించింది. అందుకే గొప్పగా వాదించి ధనార్జన చేసే వాదనా

చతురులైనవారు కూడా తత్వవేత్తలుగా గుర్తింపు పొందారు గ్రీసులో. వీరే సోఫిస్టులు.

చివరికి పాశ్చాత్యుల హేతుబుద్ధి నుంచి మతం పుట్టింది. ప్రపంచానికి వొక గమ్యాన్ని లక్ష్యాన్ని నిర్దేశించింది అదే దేవుడు, దేవుని తీర్పు.

హేతువు ఘనీభవించడం వల్ల యిలా జరిగింది. హేతుబుద్ధి తీవ్రస్థాయికి జేరినపుడు అహాన్ని నశింపజేస్తుంది. దేన్నైనా తెలుసుకోవడంకాక, తెలుసుకోవడం అనేది అసాధ్యం అని హేతువు గుర్తించి తనని తానే రద్దు చేసుకొంటుంది.

అక్కడ ఫిలాసఫీ తత్వంగా మారుతుంది. తత్‌త్వం అంటే అదే నీవు అని అర్థం. తెలుసుకొనేది తెలుసుకొనబడేది అనే ద్వంద్వస్థితి నశిస్తుంది.

ఆ ద్వంద్వాన్ని కొనసాగించడమే పాశ్చాత్య హేతుబుద్ధి లక్షణం. ఆ హేతుబుద్ధి నుంచే మతం ఆవిర్భవించింది. ఇహమూ పరమూ అనే స్పష్టమైన భేదం ఆవిర్భవించింది.

కాని భారతతత్వంలో యిహపరాలు పారమార్థికంగా వొకటి అయిపోతాయి అదే జీవన్ముక్తి.

ఇహమూ పరమూ, లోపల బయట యీ ద్వంద్వాలు స్పష్టంగా నిలిచి వున్నపుడే మతం పుడుతుంది. ఆ మతం నుంచి సైన్సు పుడుతుంది. భారత తత్వంలో ఈ రెండూ అసాధ్యం.

అందుకే  బహిరంగంగా యిదిగో యిది అని చెప్పబడే వస్తుజాలాన్ని భారతీయులు కనుగొన్నట్లు కనబడదు. కనీసం చైనీయులతో పోల్చినపుడు అలాంటిదేదీ కనబడదు. భారతీయులు కనుగొన్నది జీరో మాత్రమేననే నానుడి వారి స్వభావాన్ని స్పష్టంగా వివరిస్తుంది. గణితం, చదరంగ క్రీడ, ఖగోళ పరిశీలనలు వారి అంతర్ముఖీనమైన ఆవిష్కరణలనే తెలియజేస్తాయి. మార్క్సుకూడా భారతీయుల గణితమేధని మెచ్చుకుంటాడు.

నిజానికి భారతదేశంలో గణితం జామెట్రీలకు సంబంధించిన ఆవిష్క్రణలన్నీ రకరకాల యజ్ఞ వేదికల నిర్మాణం నుంచి అభివృద్ధి చెందుతూ వచ్చాయి. యీ

యజ్ఞ వేదికలు శాశ్వత నిర్మాణాలు కావు. తాత్కాలిక నిర్మాణాలు మాత్రమే. అందుకే శాశ్వత నిర్మాణాలు, దృశ్యమాన ఆవిష్కరణల పట్ల భారతీయులకి ఆసక్తి లేకుండాపోయింది. చివరికి ఉపనిషత్తులు యజ్ఞాన్ని మనోయజ్ఞంగా మార్చి వేశాయి. భౌతిక రూపాల్ని అసలుకే అభావం చేసివేశాయి. సూక్ష్మ రూపంలోకి మార్చాయి.

యిట్టి సంస్కృతిలో ఆలయానికే దిక్కులేదు. యింక భౌతిక ఆవిష్కరణలకి ఆస్కారం యెక్కడ?

కాని భారతదేశంతో పోలిస్తే చైనాలో స్పష్టమైన దృష్టి గోచరమయ్యే ఆవిష్కరణలు కనిపిస్తాయి. ఆధునిక నాగరికత ఆవిర్భావానికి మూలమైన ఆవిష్కరణలన్నీ చైనానుండే వచ్చాయి. కాని యీ ఆవిష్కరణల్ని మార్కెట్టుగా మార్చడంలోనే యూరోపియన్ నాగరికత వుంది. యిందుకు ప్రాచ్య పాశ్చాత్య దృష్టి భేదమే కారణం.

పాశ్చాత్యం నూతనంగా కనుగొన్నది మార్కెట్ ఎకానమీని మాత్రమే. సర్వాన్నీ మార్కెట్ దృష్టితో చూడడం. మార్కెట్‌నే పరమగమ్యంగా భావించడం యిదీ యూరప్ ప్రపంచానికిచ్చినది. సరుకులని కనుగొన్నది పాశ్చాత్యం.

చైనా సంగతే చూడండి. మొట్టమొదట ముద్రణాయంత్రం, గడియారం, కలం, గన్‌పౌడర్... యిలా చైనా వస్తుజాలం చాలా వుంది. మొట్టమొదట పెద్ద ఓడని నిర్మించి సుదూర తీరాలకి వెళ్ళివచ్చినది చైనావారే.

ప్రకృతిని ఆరాధించే చైనావారు తాము కనుగొన్న వస్తు జాలాన్నంతటినీ ప్రకృతిలో భాగంగానే చూశారు. చిత్రకళలో ప్రకృతికి ప్రాధాన్యం యివ్వడం, మనిషిని చిన్న అణువుగా మార్చి ప్రకృతిలో కలిపివేయడం చైనావారి తత్వం. అదే టావో తత్వం. టావోయిజం ప్రకృతిలో జోక్యాన్ని నిరాకరిస్తుంది. నిష్క్రియా పరత్వాన్ని బోధిస్తుంది. లూషన్ అనే ఆధునిక కమ్యూనిస్టు రచయిత చైనా వారి మనస్తత్వం టావోయిజమేనంటాడు. బౌద్ధం నుంచి కన్ఫ్యూషియస్ తత్వం నుంచి దూరం చెయ్యవచ్చుకాని టావోయిజం నుంచి దూరం చేయడం అసాధ్యమంటాడు.

టావోయిజంలోనే చైనావారి తత్వం దాగివుంది. అదే నిష్కామ్యకర్మ. కోరికలను నెరవేర్చుకోవడానికి వారు వస్తుజాలాన్ని సృష్టించలేదు. చెట్లు పళ్లు కాసినంత సహజంగా సృజనలో భాగంగా వారు వస్తుజాలాన్ని సృజించారు. భారతీయులైతే అసలు వస్తుజాలాన్ని సృజించడానికి నిరాకరించారు. దానికిబదులు అనంతమైన పురాణాల్నీ కావ్యాల్నీ, భాష్యాల్నీ, వాఙ్మయాన్నీ సృజించారు. అంతర్జగత్తుని విస్తరించుకుంటూ బాహ్య జగత్తులో నిరాడంబరంగా జీవించారు. భావాల్ని సృజిస్తూ వస్తువుల్ని సృజించడానికి నిరాకరించారు. హృదయంలోనే యీశ్వరుడు వున్నాడు. విష్ణు హృదయంలోనే లక్ష్మి వుంది. ఆమెని నేలమీద దింపడం అనవసరం. ఆత్మ లోకంలో దివాళాతీయకూడదు. అందుకోసం భౌతికంగా నిర్లిప్తంగా జీవించాలి. ఆత్మ లోకంలో విహరించాలికాని భౌతికంగా విస్తరించ కూడదు. ఊహల్లో సంచరించాలి. కల్పనల్లో విస్తరించాలి. జీవితాన్నే ఒక కథగా కల్పనగా దర్శించాలి. ప్రపంచంలో కథలు వున్నాయి అనేది దర్శనం కాదు. ప్రపంచమే కథ, స్వప్నం. స్వప్నంలోని వస్తుజాలం క్షణికం.

ప్రకృతికి కూడా భారతీయులు తీవ్ర ప్రాధాన్యం యివ్వలేదు. కారణం భౌతిక ప్రకృతి వాస్తవంకాదు. ప్రకృతి సూక్ష్మాతి సూక్ష్మం, అవ్యక్తం, అగోచరం, నిమీలిత నేత్రులై సూక్ష్మంలోకి ప్రయాణించాలి.

మనం చూస్తున్న మనిషి దేహం కూడా స్థూల దేహమే. సూక్ష్మ దేహం అగోచరం, పంచభూతాలలో సూక్ష్మమైనది ఆకాశం. నిజానికి అసలు ప్రకృతి ఆకాశం. అది అవ్యక్తం. దానినుంచే సృష్టి జరిగింది.

చైనీయులు ప్రకృతిలో అంతర్లీనంగా మనిషిని చూశారు. భారతీయులు ప్రకృతిని కూడా చూడడానికి నిరాకరించారు. ప్రకృతి యొక్క మూలంలో లయం కావాలని అదే మోక్షమన్నారు. అందుకే చైనీయులకి వున్న ప్రాపంచిక దృష్టి కూడా భారతీయులలో కనబడదు. కన్‌ఫ్యూషియస్ సామాజిక తత్వవేత్తగా చైనాలో అవతరించాడు.

భారతతత్వంలో సమాజమే లేదు. విరాట్ స్వరూపం వుంది. అంటే యీ విశ్వం ఒకే ఒక పూర్ణం. ఆ విశ్వం యొక్క సూక్ష్మ రూపమే, సూక్ష్మ ప్రతిబింబమే

జీవుడు. సమాజానికీ సంఘానికీ స్థానంలేదు.విశ్వంనుంచి సమాజాన్ని పూర్తిగా విడదీసి తత్వాన్ని ప్రవచించడం అసాధ్యం.

ఐతే ధర్మం అనేది వొకటి వుంది. వస్తు ధర్మంలాగే ప్రకృతి ధర్మంలాగే జీవ ధర్మం కూడా వుంది. ఈ విశ్వాన్ని నిలిపేదే ధర్మం. మానవధర్మం నాలుగు పురుషార్థాల రూపంలో వుంది. అవే ధర్మార్థ కామమోక్షాలు. వాటిని వివరించే శాస్త్రాలు కూడా అవతరించాయి. కాని మనిషి స్వస్థితిని చేరుకునే మార్గాన్ని బోధించేవే తత్వాలు, దర్శనాలు, ధర్మార్థకామాలని బోధించేవి తత్వాలు కావు దర్శనాల స్థాయి వాటికి లేదు. యెందుకంటే జీవి యొక్క స్వస్థితి సూక్ష్మస్థితి, అవ్యక్త స్థితి సహజ స్థితి. అది మాత్రమే పరమసత్యం. మిగిలినదంతా ఆభాస. సూర్యుడిని కప్పివేసిన మేఘం. ఆ మేఘాన్ని గురించి వివరణ దర్శనం కాలేదు. తత్వం కాలేదు.

దర్శనంవైపు తత్వంవైపు ప్రయాణం భారతీయుల కర్మకి అర్థాన్నే మార్చేసింది. బృహత్ నిర్మాణాలు కాదు. అసలు దేనినీ నిర్మించకపోవడమే మంచిదన్న స్థితికి భారతీయులు చేరారు. ఊరుకోవడమంత ఉత్తమం లేదు. బోడిగుండంత సుఖం లేదు అన్న స్థితికి చేరారు.

భారతీయులది సింబాలిక్ యాక్షన్ అంటాడు వి.ఎస్.నైపాల్ నిజమైన కర్మకాదంటాడు. సాంకేతిక కర్మ అసలు క్రియకంటె గొప్పదనేదే భారతీయులు ప్రపంచానికి యిచ్చిన సందేశం. తంత్రమూ, యజ్ఞమూ సాంకేతిక కర్మలే. అంతేకాదు ఆధునిక కాలంలో గాంధీ ఉప్పుసత్యాగ్రహం సింబాలిక్ యాక్షన్-సాంకేతిక కర్మే. దాని ప్రభావం అపారం.

యజ్ఞం కూడా మనోయజ్ఞంగా మారినపుడే ఉపనిషత్తత్వం అవుతుంది. అపుడు తాత్కాలికమైన యజ్ఞవేదిక కూడా కనబడదు. హృదయమే వేదిక.

కనబడేదాని నుంచి కనబడని దానికి స్థూలం నుంచి సూక్ష్మానికి ప్రయాణమే భారతీయతత్వం. అందువల్ల క్రియకూడా ఊహా మాత్రమైన క్రియగా మారిపోతుంది.

చైనా ప్రకృతిని ఆరాధించడం వల్ల ప్రకృతిలోని డిఫెన్సు మెకానిజాన్ని కూడా అరువుతెచ్చుకొంది. కాని భారతదేశం ప్రకృతినికూడా గుర్తించలేదు. దానినికూడా కనబడని దాని వ్యక్తీకరణగానే చూసింది. అందుకే ఓటమిగెలుపుల తేడాని గుర్తించలేదు. దాని ఓటమిలోనే విజయాన్ని పొందింది. ఆ విజయం ఏమిటంటే జయించిన అనేక జాతుల్ని తనలో లయం చేసుకొంది వారి సంస్కృతుల్ని కూడా లీనం చేసుకొంది.

నిరంతరం ఓటమి చెందే దేశంగా మార్క్స్ భారతదేశాన్ని వర్ణించాడు. ఓడిపోవడమే నిజమైన విజయం అన్న సత్యాన్ని భారతదేశం ప్రపంచానికి యిచ్చింది.

సాంకేతికంగా, అణు శాస్త్రపరంగా, సముద్రయానపరంగా యింకా భారతదేశం మరింతగా ఓటమి చెందాలని నేను కోరుకుంటున్నాను. ఓటమి ఓటమి మరింత ఓటమి యిది భారత దేశానికి శ్రీరామరక్ష. ఆ నిరంతర ఓటమిలో మాత్రమే అభివృద్ధి యంత్ర రాక్షసి బారిన పడకుండా జాలర్లు గంగమ్మతల్లిని ఆరాధించుకుంటూ జీవిస్తారు. గిరిజనులు వనదేవతల్ని ఆరాధిస్తూ జీవిస్తారు. ఈశ్వరుని చిద్విలాసమైన ప్రకృతి మనగలుగుతుంది. ప్రకృతి ఒడిలో మనిషి పరవశిస్తాడు. అందుకోసం భారతభూమి నిరంతరం అపజయానికి గురికావాలని పరమేశ్వరుడిని ప్రార్థిస్తున్నాను.

పోఖ్రాన్ అణు పరీక్షలు సఫలమయ్యాయని హిందూ ప్రభుత్వం ఎగిరి గంతేసి చాలాకాలమైంది. హిందూవాదులు అణుశక్తిని శ్రీరాముని కంటె అధికంగా ఆరాధించారు.

కాని భారతీయ అణుపరీక్షలు విఫలమయ్యాయని కొందరు అణుశాస్త్ర వేత్తలు ప్రకటించారు. ఇది సంతోషించదగ్గ విషయం. మాజీ రాష్ట్రపతి అబ్దుల్‌కలాం అణుపరీక్షలు విఫలంకాలేదని ప్రకటించారు. దానికి సమాధానంగా ఒక అణుశాస్త్రవేత్త అబ్దుల్ కలాంకి అణుపరీక్షల గురించి ఓనమాలు తెలియవని ప్రతిస్పందించారు. భారతదేశానికి శక్తివంతమైన అణ్వాయుధాల్ని తయారుచేసే శక్తి లేదని ప్రకటించారు కొందరు అణు శాస్త్రవేత్తలు.

అటువంటి శక్తి భారతదేశానికి కొరవడితే కొంపలు మునిగేదేమీలేదు. అది ఆసురీ శక్తి. అట్టి శక్తి లేకపోవడం భారతదేశానికి బలహీతనకాదు, బలమే. అణుశక్తి వున్నా యితరులనుంచి వచ్చే రక్షణయేమీ లేదు. అణ్వాస్త్రాల వల్ల యెవరూ విజయం చెందలేరు. నిజానికి అది భస్మాసురహస్తం.

అబ్దుల్ కలాం లాంటివారి సాంకేతిక ఆరాధన భారతదేశాన్ని నైతికంగా దిగజార్చింది. భారతదేశపు ధార్మిక శక్తిని బలహీనపరచింది. అబ్దుల్ కలాంలాంటి వారి మాటలు విని సాంకేతికతని ఆరాధించే బదులు ప్రకృతిలో సర్వాంతర్యామి యైన శ్రీరామచంద్రుణ్ణి వీక్షించడం భారత దేశానికి శ్రీరామరక్ష.

హిందూవాదులు శ్రీరాముడిని క్రీస్తువంటి దేవుడిగా ఆరాధించేవారు. వారు క్రమేపీ ప్రచ్ఛన్న క్రైస్తవమైన హిందూ మతం నుంచి అమెరికనిజం వైపు ప్రయాణించారు. ఆ ప్రయాణానికి సూచనే అణుపరీక్షలు.

అణుపరీక్షల వైఫల్యం అమెరికనిజానికి వైఫల్యం మాత్రమే. అది భారత దేశపు వైఫల్యంకాదు. అది శుభసూచన విశ్వకళ్యాణానికి ప్రాతిపదిక. తప్పుదారిలో ప్రయాణించినపుడు భగవంతుడు శిక్షిస్తాడు. అటువంటి శిక్షే యిది.

భారతీయులు ఉద్దేశ్యపూర్వకంగా అణుపరీక్షలని త్యజించినపుడు వారి ధార్మిక శక్తి బలపడుతుంది. ధర్మోరక్షతి రక్షితః అణుఅస్త్రాలు కాదు, ధర్మమే మనని రక్షిస్తుంది.

భూమాత శాశ్వతంగా చిరంజీవిగా వర్ధిల్లడానికి యిటువంటి అధర్మ చర్యల్ని త్యజించడమే శ్రేష్ఠం. అదే భారతీయ సనాతన ధర్మం.

విజయమంటే శంకర విజయం మాత్రమే. అంటే స్వస్థితిని తెలుసుకోవడమే నిజమైన విజయం. అంతేకాని నూతనత్వం కోసం వెంపర్లాడి వినాశనాన్ని కొనితెచ్చుకోవడం కాదు.

శంకరాచార్యులవారు దేనినీ భూమిపై స్థాపించలేదు. ఉన్నవాటినే వాటి స్వచ్ఛతలో నిలపాలనుకొన్నారు. షణ్మత స్థాపన పరుడు అని వారికి బిరుదు. అంటే యేమి సూర్యారాధన, గణపతి ఆరాధన, శివారాధన ఆదిగా ఆరు విధములైన ఆరాధనా పద్ధతులు భారతఖండంలో యింకా చెప్పాలంటే విశ్వమంతా

మౌలిక స్థితిలో విరాజిల్లుతున్నాయి. ఈజిప్టులోనూ, గ్రీసులోనూ కూడా యిటువంటి ఆరాధనా పద్ధతులు వర్థిల్లాయి. మౌలికమైన ఆరాధనా విధానాల్ని సంస్కరించి స్వచ్ఛంగా నిలపాలని శంకరాచార్యులు ప్రయత్నించారు. అంతేకాదు కాశ్మీరులో శంకరులు చేసినదేమిటి? అక్కడ విరాజిల్లుతున్న వివిధ దర్శనాల్ని ఆయా దర్శన అనుయాయులకి వివరించి చెప్పారు. వారి సిద్ధాంతాలు వారికే అర్థంకాక దారితప్పి చరిస్తున్నపుడు - యిదిగో సాంఖ్యం అంటేయిది, యోగం అంటే యిది, న్యాయం అంటే యిది అంటూ వారికే దర్శింపజేశారు. అంతేకాని ఒకే మార్గాన్ని ఆయన స్థాపించలేదు. అద్వైతం స్వస్థితి మాత్రమే. కాని అది మార్గమూ కాదు, మతమూ కాదు, సిద్ధాంతము కాదు. దానికోసం చేయవలసిన విజయ యాత్రయేమీలేదు.

అద్వైత స్థాపన అంటూ యేదీ లేదు. అది స్థాపించబడేది కాదు. అది సహజ స్థితి మాత్రమే. మరి శంకరుని విజయయాత్ర దేనికోసం. ధర్మ స్థాపనకోసం, ధర్మం వర్థిల్లడానికి అవసరమైన శాంతి స్థాపనకోసం అందుకే వివిధ మతాలనీ, అభిమతాలనీ, దర్శనాలనీ సమన్వయ దృష్టితో పరిశీలించి స్వచ్ఛస్థితిలో కొనసాగడానికి దారియేర్పరిచారు. అదే శంకర విజయం.

యిప్పుడు మనకి కావలసినది శంకర విజయం. భారతీయ బహుళత్వాన్నీ బహుళ సంస్కృతుల్నీ బహుళ జీవావరణాన్నీ నిలిపివుంచే శాంతి మార్గం. అంతేకాని అబ్దుల్ కలాంగారు విజయంగా చాటే అణు విస్ఫోటనాలు కానేకాదు. అది రాక్షస సమరం. కొన్ని పాశ్చాత్య దేశాలు కూడా స్వచ్ఛందంగా అణుపరీక్షలు నిలిపివేశాయి. ఇటువంటి పరిస్థితుల్లో ఒక హిందూ ప్రభుత్వం అణుపరీక్షలు జరపడం ఆలోచించదగ్గ విషయం. యీ విషయంలో అమెరికాతో హిందూ ప్రభుత్వం హెచ్చరికలకు కూడా గురైనమాట నిజమే. తన దుష్ట మార్గంలో పోటీదారుగా నిలిచినందుకే అమెరికా హిందూ ప్రభుత్వంతో విభేదించింది. తనంత దుష్టుడు మరొకడు భూమిమీద అవతరించకూడదనేదే అమెరికా పన్నాగం.

ముస్లింలు భారతీయ సంస్కృతికి యెంతో దోహదం చేశారు. అద్వైతాన్ని సూఫీ వేదాంతంగా యిస్లామీకరించారు. వీరు శంకరాచార్యుని వారసులు. ముస్లిం

మతస్థుడైన అబ్దుల్ కలాంనే యీ అణుపరీక్షల కోసం పావుగా వాడుకోవడం మనవేలితోనే మనకంట్లో పొడవడం వంటిది. రాముణ్ణి కాక అమెరికాని హృదయంలో నిలుపుకున్న హిందూవాదులు యిట్టి దుర్మార్గానికి పాల్పడ్డారు. ఈశ్వర్ అల్లా తేరానామ్ అన్న సత్యాన్ని మరుగు పరచడానికి యిట్టి దుర్మార్గానికి తలపడ్డారు. మన సైన్యాన్ని అమెరికన్ సైన్యంతో కలిపి కవాతు తొక్కించిన విదేశీ భక్తులే హిందూవాదులు.

భారతీయులు శక్తిని ఆరాధిస్తారు నిజమే కాని అణుశక్తిని కాదు. భస్మాసుర హస్తాన్నికాదు. అణుశక్తి వరమైతే కావచ్చు కాని అది ఆత్మ విధ్వంసకమైన వరం. ఆత్మహత్యా సదృశ్యమైన విజయం.

తపస్సులో అరిషడ్వర్గాలపై విజయం చెందాలనే భారతీయ శక్తి తత్వానికి యీ అణుపరీక్షలు విరుద్ధమైనవి. అంతకన్న అట్టి దుష్ట పరీక్షలలో అపజయమే నిజమైన విజయం. అణు ఒప్పందాలు అమెరికనిజంయొక్క విజయపతాకాలు మాత్రమే.

కంచి పరమాచార్యులవారి విశాల హృదయాన్ని పొగిడిన అబ్దుల్‌కలాం గారు యింత సంకుచిత హృదయులు కావడం భారతజాతి దురదృష్టం.

ఇది రాసిన కొద్ది రోజులకే జపాన్ అణువిద్యుత్ కేంద్రం పేలిపోయింది. ప్రపంచం రేడియేషన్ ప్రభావాన్ని గురించి విలవిలలాడింది. యీ విస్ఫోటనాన్ని అణ్వస్త్ర పూజారియైన అబ్దుల్‌కలాం గారికే అంకితం చేయాలి.

భారతీయులు భస్మాసురుణ్ణికాక మోహాన్నే భస్మంచేసిన ముక్కంటిని ఆరాధించాలి. లయకారకుని విశ్వతాండవంలోని అద్వైతతత్వాన్ని ఆరాధించి తరించాలి. అణోరణీయాన్ మహతోమహీయాన్ అనే సత్యాన్ని ఆవాహనచేయాలి.

ఓం శాంతి శ్శాంతి ః



# అద్వైత ఆభాస

భాగవతంలో జడ భరతుని కథ వుంది. పైకి జడంగా కనబడే మనుషుల్లో దాగిన చైతన్యాన్ని గురించి స్పష్టం చేస్తుంది ఈ కథ. స్థావర జంగమాల్లో అన్నిటిలో ఆత్మ చైతన్యం దాగివుందని బోధిస్తుంది భారతీయ తత్వం,

జడంలోనూ చైతన్యాన్ని దర్శిస్తుంది భారతీయ తత్వం. చైతన్యాన్ని జడంగా మారుస్తుంది అమెరికనిజం. ఇది తలకిందులు అద్వైతం.

వాడు మరీ అద్వైతం అనే వాడుకవుంది. దీని అర్థం వాడికేమీ తెలియదని, అయోమయం అని, మూర్ఖుడని తాత్పర్యం. దేవానాం ప్రియః అనేది బౌద్ధుల వ్యవహారం లోనిది. ఈ పదానికి దేవతలకి ప్రియమైనవాడు అని అర్థం. క్రమేపీ ఈ పదం మూర్ఖుడనే అర్థంలో స్థిరపడింది.

అర్థాలు అపార్థాలని సంతరించుకోవడం శబ్దాలు అపశబ్దాలుగా పతనం కావడం అనాదిగావున్నదే. పూర్తిగా విరుద్ధమైన అంశాలు ఒకేలా కనబడడమే యీ భ్రాంతికి కారణం.

జ్ఞానిని పిచ్చివాడితో పోలుస్తారు సనాతనులు. కాని పిచ్చివాడల్లా జ్ఞానికాదు. మహాజ్ఞాని, అజ్ఞానిలా కనబడతాడు. కాని అజ్ఞాని జ్ఞాని కాలేడు. ముని మౌనవ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మతత్వంగా రాణిస్తాడు. కాని మౌనంగా గంభీరంగా కనబడే మూర్ఖుడు ముని కానేరడు.

ఇంతకీ చెప్పొచ్చేదేమిటంటే అమెరికనిజం తీసుకువచ్చిన నిర్లిప్తత, స్తబ్ధత, జడత్వం అద్వైతం కానేరవు. రెండు పక్షాలు అనేవి లేకుండా కార్పొరేటీకరణ తీసుకువచ్చే కృత్రిమ ఏకశిలా సదృశ స్థితి అద్వైతం యేమాత్రం కాదు. అమెరికాలో రెండు పార్టీలు వుంటాయి. విస్తృతమైన మీడియా వుంటుంది. అంతులేని స్వేచ్ఛ వుంటుంది. యిదంతా అమెరికా వ్యాపార విస్తరణ కోసమే వుంటుంది. ప్రపంచ

వ్యాప్తంగా ప్రజాస్వామ్యాన్ని వ్యాపింపజేయడం, యితర దేశాల్లో తిరుగుబాట్లకి మద్దతునివ్వడం యిదంతా అమెరికా వ్యాపార స్వార్థంలోకి యిమిడిపోతుంది. చాలా వైవిధ్యాన్ని బహుళత్వాన్ని అంగీకరిస్తున్నట్లు కనబడే అమెరికనిజం, అమెరికా బిలియనీర్ల స్వార్థం తప్ప మరేమీకాదు. అమెరికనిజంలో ద్వంద్వాతీత స్థితిలా కనబడేది నిజానికి ద్వంద్వాతీత స్థితికాదు. అమెరికా కేంద్రక స్థితే అది. తీవ్రమైన సంకుచితత్వం విశాలత్వంగా భాసించడమే యిక్కడి విషాదం. యాంత్రిక జడత్వం అద్వైతంలా భాసించడమే అమెరికనిజంలోని ట్రాజెడీ.

కొందరు భారతీయ ఆధ్యాత్మిక గురువులుకూడా అద్వైతాన్ని కాలటిలో కాక కాలిఫోర్నియాలో వెతుక్కుంటున్నారు. శృంగేరిలో కాక చికాగోలో దర్శిస్తున్నారు.

ఆధునిక వేదాంతుల స్మృతి పథంలో చికాగోలో జరిగిన అంతర్జాతీయ మత సభ, దానిలో వివేకానంద చేసిన వుపన్యాసము పదిలంగా వుంటుంది. అదే సందర్భంలో వివేకానంద అమెరికాని వేనోళ్ళకొనియాడాడు. అమెరికన్ జీవన శైలిలో అద్వైతం వుంది అన్నాడు. అమెరికన్లు ప్రాక్టికల్ వేదాంతిన్స్ = అనుష్ఠాన వేదాంతులు. ఎక్కడెక్కడినుంచో వివిధ జాతులవారు అమెరికాకి వచ్చి స్థిరపడుతున్నారు. వ్యక్తిత్వ వికాసాన్ని పొందుతున్నారు. సముద్రంలో నదులన్నీ కలిసినట్లుగా కలిసిపోతున్నారు. పరమాత్మలో ఆత్మలా కలిసిపోతున్నారు. యిదే అద్వైతం అని తలచాడు. ఈ ఏకత్వమే ఏకం సత్ విప్రా బహుధావదంతి సారాంశమని భావించాడు. కాని జడత్వం ఏకత్వం కాదు. ప్రత్యేకతల్ని కోల్పోవడం విశాలత్వం కాదు. కార్పొరేటీకరణ తీసుకువచ్చే స్తబ్ధత ఆత్మచైతన్యం కాదు. బడా కంపెనీల ముందు మోకరిల్లడం అహంకార విముక్తి కాదు. సామ్రాజ్యవాదం అమ్మే స్వేచ్ఛ విముక్తికాదు. ఆధునిక వేదాంతులు అమెరికన్ సామ్రాజ్యవాదంలో మోక్షాన్ని వెతుక్కొంటున్నారు. అదీ విషాదం.

మొట్టమొదట క్రైస్తవంలో వేదాంతాన్ని చూశారు ఆధునిక విద్యావంతులు. తర్వాత అమెరికనిజంలో అద్వైతాన్ని కలగన్నారు. వివేకానందలో యీ రెండు దశలూ కనబడ్డాయి. ఇది యూరోపియన్ల దృష్టి కోణం నుంచి అమెరికన్ కార్పొరేట్ అరాచకత్వంలోకి పతనం తప్ప వేదాంతమూకాదు భారతీయ తత్వమూకాదు.

అంతిమంగా యిది స్వేచ్ఛపేరుతో ప్రజాస్వామ్య వ్యాప్తి మిషతో అమెరికన్ సామ్రాజ్యవాదం చేస్తున్న విస్తరణకి ఆధ్యాత్మిక ముసుగు కప్పడమే. భారతీయమేధ స్వధర్మం నుంచి మొదట క్రైస్తవ వలసవాదంలోకి, తర్వాతి దశలో అమెరిక నిజంలోకి పతనమైంది . ఇవి ప్రచ్ఛన్న క్రైస్తవంలోని రెండు దశలు. సనాతన ధర్మం నుంచి పరాయీకరణ చెందడంలోని రెండు దశలు.

ఈ పరిణామ క్రమాన్ని అర్థం చేసుకుంటేనే అమెరికనిజాన్నే అద్వైతంగా భ్రమపడే స్థితికి భారతీయులు యేవిధంగా పతనమయ్యారో అర్థమౌతుంది. అమెరికనిజపు అత్యాధునిక మాయావాదం అవగతమౌతుంది.

పాశ్చాత్య దేశాల్లో క్రైస్తవమత సంస్కరణలతో ఆధునికత మొదలైంది. వలస క్రైస్తవులు ఆక్రమించిన భారతదేశంలో క్రైస్తవ అనుకరణ అనుసరణలే ఆధునికతకి బీజాలు.

జర్మనీలో ప్రారంభమైన ప్రొటెస్టెంట్ క్రైస్తవం గ్రంథానికి ప్రాధాన్యం యిచ్చింది. క్రైస్తవ పూజారి వర్గాన్ని పక్కకి తొలగించింది.

ఇది భారతదేశంలో విద్యా విధానంలో మార్పుకి కారణమైంది. శ్రుతికి ప్రాధాన్యం తగ్గి గ్రంథ ప్రాధాన్యం పెరిగింది. లేఖనం కళగాకాక విద్యగా మారింది. వైదిక సంస్కృతి పక్కకు నెట్టబడింది. అంతక్రితం లేఖకులంటే గ్రామాల్లో నియోగి బ్రాహ్మణులే. సుమతీ శతకంలో ఈ విషయం స్పష్టంగా వుంది.

నియోగులు, క్రైస్తవుల యొక్క దుబాసీలుగా అవతరించారు. వారి లేఖన కళ క్రైస్తవ విద్యా విధానానికి ఆలంబనగా మారిపోయింది. వైదిక సంస్కృతిని తిరస్కరించడానికి నియోగుల లేఖన నైపుణ్యం ఉపయోగించబడింది. గురజాడ, కందుకూరి లాంటి సంస్కర్తలు అవతరించారు. క్రైస్తవులు ప్రవేశపెడ్తున్న ఆధునికతకు వైతాళికులుగా మారారు. వారిని ధర్మ ప్రభువులుగా కీర్తించారు.

క్రైస్తవ ఆధునికత వ్యవసాయంలో కూడా తీవ్ర మార్పుకి కారణమైంది. నీటి వనరులమీద ఆధారపడే వ్యవసాయానికి ప్రాధాన్యత పెరిగింది. కాటన్‌లాంటి దొరలు నీటిమీద ఆధారపడిన అభివృద్ధిని ప్రారంభించారు. దీనివల్ల మెట్ట ప్రాంతపు వ్యవసాయం మెట్ట ప్రాంతపు ఆహార పంటలు అంతరించిపోవడం మొదలైంది. ఎక్కువ భాగం నీటిని స్వాధీనం చేసుకున్న ప్రాంతాలు అభివృద్ధి చెందిన ప్రాంతాలుగా అవతరించాయి. దాంతో ఇతర ప్రాంతాలు తెలంగాణాలా వెనకబడి వివక్షకు గురయ్యాయి. క్రైస్తవ అభివృద్ధి నమూనాలో ఈ అసమానతలు అనివార్యం. ఈ వ్యవసాయ విధానాన్ని విమర్శించింది సంస్కర్తలు కాదు. సంస్కర్తలు బ్రిటీష్ తొత్తులు. విశ్వనాథ సత్యనారాయణ అనే వైదిక బ్రహ్మణుడు ఈ వ్యవసాయ విధానాన్ని విధ్వంసకరమైందిగా అభివర్ణించాడు వేయిపడగలు నవలలో. పసరిక అనే పాత్రను సృష్టించాడు. ప్రకృతిలో మమేకమై జీవించే పాములాంటి మానవుడే పసరిక. అతడు శూద్ర స్త్రీకి, బ్రాహ్మణుడికి పుట్టినవాడు. వ్యవసాయంలో వచ్చిన మార్పువల్ల నిలువనీడలేక మరణిస్తాడు. ఈ అభివృద్ధిని తీవ్ర ప్రకృతి విధ్వంసంగా చూశారు విశ్వనాథ. అలాగే శూద్రకులాల వినాశనంగాకూడా హెచ్చరించాడు.

కాటన్ నీటిపై పెద్ద ఆనకట్టల నిర్మాణాన్ని క్రైస్తవ వ్యాప్తిగా వక్కాణించాడు. ఈ ఆనకట్టలు భారతీయులకి ప్రకృతితో గల సంబంధంలో తీవ్ర మార్పుని తీసుకువచ్చాయి. ప్రకృతి దేవతకాదు. తల్లి కాదు. అవ్యక్తం కాదు. సూక్ష్మం కాదు. అది మనిషి అధీనం చేసుకోగల బానిస. మనిషి కోసం దేవుడు సృష్టించిన యంత్రం. ఇది క్రైస్తవ భావనే. ఈ భావనకి బాహిర రూపమే పెద్ద ఆనకట్టలు. నెహ్రూ ఆనకట్టలని ఆధునిక ఆలయాలుగా వర్ణించడం సరిగా అతికింది. ఆధునిక ఆలయాలంటే క్రైస్తవ చర్చిలేకదా.

క్రైస్తవ కోస్తాలో ఇటువంటి వ్యవసాయ విధానం కొనసాగి చెరువులు అంతరించాయి. మెట్ట వ్యవసాయం బలహీనపడింది. వరి సర్వవ్యాప్తమైంది. తెల్లని గింజలే శ్రేష్ఠమనే భావన బలపడింది. ముస్లింలు పాలించిన తెలంగాణాలో మాత్రం చెరువులు, మెట్టపంటలూ సురక్షితంగా వున్నాయి.

ఈలోగా కోస్తా ప్రాంతపు వ్యవసాయం నెమ్మదిగా వ్యాపారంగా మారిపోయింది. యిటువంటి క్రైస్తవ అభివృద్ధి నమూనా మానసికంగా కూడా దూరాల్ని బాగా పెంచింది. అభివృద్ధి అంటే నీరు, నీటిపై భారీ ఆనకట్టలు అనే అభిప్రాయం బలపడింది. ప్రకృతికి వ్యవసాయమూ మనిషీ శాశ్వతంగా దూరం కావాలి. అదే అభివృద్ధి. ఇదీ క్రైస్తవం మనలో తెచ్చిన మార్పు.

దీనివల్ల పంచభూతాల గురించి మన దృక్పథంలో తీవ్రమైన మార్పు చోటుచేసుకొంది.



# విశ్వరూపం - దృష్టి దోషం

మన దేహమనే కమండలంలో ఈ సముద్రం మొత్తం ఇమిడి పోయింది. పంచభూతాల కూడలి మనదేహం అన్నారు న్యాయశాస్త్ర ఆచార్యులు సుబ్రహ్మణ్యం గారు. విశాఖ సముద్ర తీరంలో నిలబడి యీ వేద వాక్కు పలికారు. పంచభూతాలు కలుషితం కావడం, అణుధూళితో పారిశ్రామిక వ్యర్థాలతో నిండిపోవడం గురించి ప్రస్తావించారు. యిదంతా మనలోపల జరుగుతోంది. యీ విధ్వంసమంతా మన ఆంతరంగికం. అసలు కాలుష్యం మానసిక కాలుష్యమేనంటాడు యూజీ.

మన యింద్రియాలన్నీ పంచభూతాలతో ఏర్పడ్డాయి. హిమాలయాల్లో మంచు గడ్డ కట్టి శివలింగ ఆకృతి యేర్పడినట్లు యీ పంచభూతాలతో దైవికంగా మనదేహం యేర్పడింది. విశ్వమనే విరాట్ రూపానికి సూక్ష్మ ప్రతిబింబమే మన దేహం. అందువల్లనే గ్రహాల చలనం మనని శాసిస్తుందన్న విశ్వాసం పుట్టింది.

ఇప్పుడు పంచభూతాలను పట్టి నిర్జీవ మూలకాలుగా ముక్కలుచేసి మరీ చూస్తున్నారు సైంటిస్టులు. సనాతన దృష్టి ఇందుకు విరుద్ధం.

పృథ్వి ఒక దేవత. దాని గుణం గంధం. వాసన పసిగట్టే మన ఘ్రాణేంద్రియం దానినుంచే యేర్పడింది. జలాన్ని అమృతం అనికూడా పిలుస్తారు. నదీతీరాల్ని తీర్థ క్షేత్రాలుగా భావించి తరించారు పూర్వీకులు. పుష్కరాల పేరుతో ప్రతి పన్నెండు సంవత్సరాలకి ఆరాధిస్తారు భారతీయులు. అందుకే వీరిని తీర్థకులు అని పిలిచారు బౌద్ధులు. ఆకాశం శబ్దానికి పుట్టినిల్లు, పరమాత్మ స్వరూపం. మన హృదయం ఆకాశ స్వరూపమే. అంటే మన లోపల బయట ఒకే విధమైన చలనం జరుగుతోంది. మనలోపల విధ్వంసం మొదలైనపుడే అణువిధ్వంసం మొదలైంది. మన మానసిక కాలుష్యం నుంచే పర్యావరణ కాలుష్యం ప్రారంభమైంది.

అందుకే ప్రపంచాన్ని మనం అర్థం చేసుకున్న రీతిలోనే ప్రపంచం వుంటుంది. పంచభూతాల మీద ఆధునిక మానవుడు పగబట్టాడు. సృష్టిని సంఘర్షణ నిలయంగా నిర్వచించాడు. అందుకే యుద్ధ సమయాల్లోనే ఆధునిక సాంకేతికత అభివృద్ధి చెందింది. ప్రకృతిపైన, పంటలపైన, తోటి మనిషిపైన నిరంతర యుద్ధమే నేటి విజ్ఞానం. తనకి దేహాన్ని ఇచ్చిన పంచభూతాలపైన సమరం ప్రారంభించాడు ఆధునిక మానవుడు.

ప్రకృతి ఎవరిమీదా పగబట్టదు. తనలో సమతౌల్యం కోసం భూకంపాల్ని, తుఫానుల్ని సృష్టిస్తుంది. అందుకే యెంతగా విజృంభిస్తుందో అంతగా వెనక్కు తగ్గుతుంది. మళ్ళీ జీవుల మనుగడకి అవకాశం కల్పిస్తుంది. ప్రకృతికి విజృంభణ, శాంతి రెండూ తెలుసు.

ఆధునిక పాశ్చాత్య దృష్టి వేరు. అది ప్రకృతిపై పగ, విజయం కోసం నిర్దాక్షిణ్యమైన వెంపర్లాట. మానవుడే గొప్పవాడన్న అహంభావం. కాని భారతీయ దృష్టివేరు. యీ విశ్వమంతా విరాట్ పురుషుని దేహం. దానిలో జననమరణ చక్రం అనంతంగా పరిభ్రమిస్తుంటుంది. శ్రీకృష్ణుని విశ్వరూపం అదే. పునరపి జననం పునరపి మరణం అనేది అనాది అనంతంగా జరుగుతోందన్న భావాన్ని యీ విశ్వరూపం తెలియజేస్తుంది. దీనిలో మానవుడు నిమిత్త మాత్రుడు. మానవుడి ప్రమేయం స్వల్పం. అందుకే అతడు తామరాకుమీద నీటిబొట్టులా నిమిత్త మాత్రంగా జీవించాలి.

కాని యీ విశ్వరూపాన్ని పాశ్చాత్యులు చూసిన దృష్టి వేరు. రెండో ప్రపంచ యుద్ధ సమయంలో అమెరికాలో అణు పరీక్షలు జరిపారు మొదటిసారి. అణువిస్ఫోటనాన్ని ప్రత్యక్షంగా చూసిన సైంటిస్టు దానిలో శ్రీకృష్ణ విశ్వరూపాన్ని దర్శించాడు. యిక్కడ విశ్వరూపాన్ని పాశ్చాత్య శాస్త్రజ్ఞుడు విధ్వంసంగా చూశాడు. గొప్ప వినాశనంగా చూశాడు. భయంకరంగా చూశాడు. భీభత్సంగా భావించాడు.

కాని విశ్వరూపమంటే వినాశనం కాదు అది అనంత జనన మరణ చక్రం. ఈ రెండూ విడదీయదగినవి కాదు. రెండూ కలగలసిపోయి వుంటాయి. నిరంతర

ప్రళయం సంభవిస్తూనే వుందని పురాణాలు వ్యాఖ్యానించాయి. దీనిని నిత్య ప్రళయం అన్నాయి. వ్యక్త అవ్యక్తాలు జీవన మృత్యువులు విడదీయరాని ద్వంద్వాలు. అందుకే బొందితో కైలాసం అనే భావన వచ్చింది. జీవన్ముక్తి సాధ్యమైంది. ఇహమూ పరమూ కలగలసి పోయాయి.

పాశ్చాత్యులు జీవితమూ మృత్యువూ పూర్తిగా విరుద్ధమైనవని భావించారు. ఇహలోకం, పరలోకం వేరు వేరు అన్నారు. అందుకే వారు మృత్యువునో, జీవితాన్నో విడివిడిగా చూడగలరు. కాని రెండింటి సమన్వయాన్ని కాదు.

అందుకే విశ్వరూపంలోని సమన్వయ దృష్టిని విస్మరించి, విశ్వరూపాన్ని ఆధునిక విధ్వంస కాండతోపోల్చారు. వారు మృత్యుంజయులు కావాలనుకొన్నారు. అందుకోసం మృత్యువుని ఇతరుల మీదికి యెక్కుపెట్టి తాము చిరంజీవులు కావాలనుకొన్నారు.

కాని మృత్యుంజయుడైన శివుడు శిరస్సుపైన అమృతమని పిలవబడే గంగని ధరించాడు. విరాట్ రూపుడు విశ్వరూపుడు అయిన విష్ణువు పాదమందే గంగ పుట్టింది. జీవనం పుట్టింది. నీటికి పర్యాయపదం జీవనం.

కనుక మృత్యు భయంకరత్వంలోనూ జీవన చిద్విలాసం వుందని సనాతన ధర్మం చెప్తోంది. రుద్రసూక్తమే చూడండి. ప్రళయ భీకరుడైన రుద్రునిలోనూ జీవన లయని చూసింది వేదం. సకల వృత్తులనీ చివరికి చౌర్య వృత్తిని కూడా రుద్రరూపంగా స్తుతించింది రుద్రసూక్తం. అదీ భారతీయ ధర్మం... అదీ విశ్వరూపం...

కాని అణు విస్ఫోటనాన్ని విశ్వరూపంగా చూసిన పాశ్చాత్యుడు భగవద్గీతలోని శాంతరసాన్ని మరుగుపరచాడు. యీ జనన మరణ విశ్వక్రీడ వెనుక దాగిన అపారశాంతిని అందుకోవాలన్న ఉపనిషత్ జ్ఞానాన్ని పూర్తిగా విస్మరించాడు.

బ్రహ్మాస్త్రాన్ని ఉపసంహరించడం కూడా అసాధ్యమని భారతం చెప్తోంది. యుద్ధం యెవరికీ శాంతిని మిగల్చదని భారత సారాంశం. దీనిలో అంతస్సూత్రంగా వైరాగ్యమే ప్రధానం. యీ వైరాగ్యం హింస యొక్క వైఫల్యాన్ని తెలియజేస్తోంది.

క్రైస్తవం హింసని మరుగుపరచి, కరుణని బోధించింది. శాంతిని బోధించింది. ఇక్కడ మరుగుపరచబడిన హింస దైవ పర ఏకత్వమనే మహాహింసగా మత హింసగా పరిణమించింది. తోటివాడిని నీలాగే ప్రేమించు అనే సూక్తి పక్కవాడిని నీలాగే మార్చెయ్యి వాడి ప్రత్యేకతని రూపుమాపమనే యుద్ధ ఆదేశంగా పరిణమించింది.

క్రైస్తవం తీసుకువచ్చిన మానవ ప్రేమ సందేశం జంతువుల్ని తుదముట్టించి వాటిమీద ఆధారపడిన మానవులకి ముప్పుగా పరిణమించింది. అమెరికాలో తెల్ల క్రైస్తవులు బర్రెల్ని రూపుమాపడంతో వాటిమీద ఆధారపడిన రెడ్ ఇండియన్ తెగలు అంతరించాయి. క్రైస్తవుల ప్రత్యక్ష హింసకన్న ఈ జంతు మారణకాండ ఎక్కువ ముప్పుతెచ్చి పెట్టింది అమెరికాలో.

క్రైస్తవుల మానవ ప్రేమ మృత్యు కౌగిలిగా మారి అనేక జాతులకి ముప్పుగా పరిణమించింది. ఆస్ట్రేలియన్లని ఉద్ధరించడం కోసం పిల్లల్ని దొంగలి. ) క్రైస్తవ విద్యని నేర్పేవారు. వారిని శాశ్వతంగా అనాగరికులుగా భావించబడిన తల్లి దండ్రులనుంచి దూరం చేసేవారు. అలాగే మానవజాతిని ఉద్ధరించడం కోసం వారిని నాగరికులు చేసి క్రైస్తవులుగా మార్చడం కోసం ప్రపంచాన్ని అంతటినీ ఆక్రమించారు క్రైస్తవులు. అందువల్ల కరుణ పేరుతో, ప్రేమ పేరుతో మరుగు పరచబడిన హింస మరీ భయంకరమైనది.

కత్తులతో పొడుచుకొనే అనాగరిక క్రూరత్వాన్ని తెల్ల క్రైస్తవుడు కళ్ళతో చూడలేడు. శిలువ వేయడాన్ని భరించలేడు. అందుకే అణ్వస్త్రాన్ని సృష్టించాడు. దానిని దూరం నుంచే విసిరి ఒక సాంకేతిక అద్భుతంగా వీక్షించాడు. అపార విధ్వంసాన్ని నిర్లిప్తంగా చూడవచ్చు. ఇది క్రైస్తవ మానవ ప్రేమనుంచి పుట్టింది.

పంచభూతాలు దేవతలు. యీ అనంత విశ్వం విష్ణువు విశ్వరూపం. మానవుడు అణురూపుడు. అతడు ఈ విశ్వంలో భాగం. ఈ సృష్టి స్థితి లయలలో అతడు అనంతంగా చలిస్తుంటాడు. అన్ని జీవుల్లాగే అతడు కూడా ఒక జీవి. అతడు అన్ని జీవులని ప్రేమించాలి. చెట్లనీ, జంతువులని కూడా ప్రేమించాలి. మనుషుల్ని మాత్రమే కాదు.

యీ దృష్టి వల్లనే చిప్కో ఉద్యమం వచ్చింది. చెట్లని రక్షించడం కోసం ప్రాణాలను వదిలారు గిరిజనులు.

చెట్లనీ, కొండలనీ ధ్వంసం చేసి యురేనియం నిల్వల్ని వెతకడం దుర్మార్గం. యీ పాప ఫలితాన్ని మానవదేహమే భరించక తప్పదు. ఎందుకంటే మానవ దేహం పంచభూత నిర్మితమే. అందువల్ల తోటి మానవుణ్ణే కాదు జంతువుల్ని ప్రేమించాలి. కొండల్ని, అడవుల్నీ ప్రేమించాలి. అప్పుడే మనిషి మిగులుతాడు. దేవుడు మరణిస్తాడు. ఎందుకంటే దేవుణ్ణి తెచ్చింది క్రైస్తవుడు. మానవుడు అనే భావనని తెచ్చిందీ క్రైస్తవుడే జీవో దేవః సనాతనః అని ఆర్ష సందేశం.

జీవుడినీ దేవుడినీ ఏకం చేసింది

మతాన్నీ మానవతావాదాన్నీ రెండింటినీ రద్దుపరిచింది సనాతన ధర్మం.

యూరోపియన్ దృక్పథం మతం దేవుడు లేని భారతదేశంలోకి మతాన్ని దేవుణ్ణీ మానవుణ్ణీ మానవతా వాదాన్నీ బట్వాడా చేసింది. అటువంటి దృష్టిని అలవర్చింది. అమెరికా మౌలికంగా యీ దృష్టిని ఛేదించివేసింది. అణు విస్ఫోటనానికీ, మహా విధ్వంసానికీ విశ్వరూపాన్ని ఆపాదించింది. సరికొత్త విధ్వంసకర రూపకాలంకారాన్ని సృష్టించింది. అన్నిరకాల అస్తిత్వాల ఆలోచనల భావాల సమూల నిర్మూలనే ముక్తిగా ప్రవచించింది, గీతాసారాన్ని నిర్మూలించింది. నిర్మూలనే స్వేచ్ఛ, అదే ముక్తి, అదే విశ్వరూపం.

ఇదీ భారతీయ అమెరికనిజం



# దౌర్జన్యమే స్వేచ్ఛ

ఆనాడు ఉన్నవి యీనాడు లేవు. ఈనాడు ఉన్నవి ఆనాడు లేవు అన్నాడొక విద్యార్థి. గత వంద సంవత్సరాలలో జరిగిన ప్రపంచ పరిణామాన్ని అంతకు ముందు పరిస్థితుల్నీ బేరీజు వేస్తూ నేను విశ్లేషిస్తున్నాను. ఆ సందర్భంలో సూత్ర ప్రాయమైన యీమాట అన్నాడు పదవ తరగతి విద్యార్థి అశోక్

ఆనాడు ఉన్నవి యీనాడు లేవు. అంటే రకరకాల పశుపక్ష్యాదులు మహా వృక్షాలు అన్నీ కనుమరుగైపోయాయి. ఆనాడులేనివి ఈనాడు యెన్నో వచ్చాయి. అవన్నీ మానవ నిర్మితమైన వస్తువులు. సెల్‌ఫోన్లు, కంప్యూటర్లు, టీవీలు, వీడియోలు, మహాభవనాలు యింకా ఎన్నెన్నో... సహజసిద్ధమైనవి అన్నీ అంతరిస్తున్నాయి. గొప్ప ఛాయను ప్రసరించే మర్రిచెట్లు దారివారనవుండేవి. రోడ్డు వెడల్పు కోసం వాటిని కొట్టేశారు.

నా చిన్నతనంలో పెద్దపెద్ద రెక్కలతో రాబందులు కనబడేవి. ఇప్పుడు అవిలేవు. శవాలని పక్షులకి ఆహారంగా వేసే పార్శీలకి సమస్య యెదురవుతోంది

ప్రపంచంలో వైవిధ్య భరితమైన జీవుల కదలిక తగ్గిపోతోంది.

సృష్టికర్త స్థానాన్ని మానవుడు ఆక్రమిస్తున్నాడు. మానవుడే సృష్టికర్త అంటారు కమ్యూనిస్టులు. అతని శ్రమలోంచే యీ ప్రపంచం రూపుదిద్దుకొన్నదంటారు. శ్రమలోంచి మానవుడి చేతులు రూపుదిద్దుకొన్నాయి. మానవుడి చేతులనుంచి అతని దైహిక బౌద్ధిక శ్రమల సమన్వయం నుంచి ఒక కొత్త ప్రపంచం రూపుదిద్దుకుంది అంటారు ప్రగతిశీల మేధావులు. వంద సంవత్సరాల క్రితం వూహించని అద్భుతమైన ప్రపంచాన్ని మానవుడు రూపకల్పనచేశాడు. జిగేల్మనే వెల్తురు, అద్భుతమైన వైద్యం, తరిగిపోతున్న దూరం.... యిలా మానవుడి విజయాలెన్నో యీ విజయాలని కీర్తిస్తూ గడిపారు మేధావులు.

క్రమేపీ మానవుడు నిర్మించిన దృశ్య ప్రపంచం వెనుక కరిగిపోతున్న సహజ ప్రపంచం తన ప్రతాపాన్ని చూపించడం మొదలు పెట్టింది.

కరిగిపోతున్న మంచుకొండలు, అంతరించిపోతున్న అడవులు, నిష్క్రమిస్తున్న జీవజాతులు, యిలా యెన్నో... అనాదిగా కొనసాగుతున్న పరంపర అంతరించి పోవడం మొదలైంది.

పోతేపోనీ అవన్నీ పోయినందుకు యెందుకు ఏడవాలి! చెట్లు అంతరించిపోనీ పక్షులు రాలిపోనీ, నదులు యింకి పోనీ హిమనగాలు కరిగిపోనీ పోనీ పోనీ పోనీ.

దానిబదులు మానవుడి శ్రమనుంచి పెద్దపెద్ద భవంతులు, విమానాలు, రాకెట్లు అణుకేంద్రాలు మానవుడి విజయకేతనాలు ఎగరనీ.

ఒక సైంటిస్టు అన్నాడు డైనోసార్లవంటి భారీ జంతుజాలమే అంతరించి పోయింది. అయ్యో ఇంత పెద్ద జంతుజాతి కనబడకుండా పోతోందని ప్లేకార్డులు పట్టుకుని తిరిగేవాళ్లు ఆనాడు ఎవరూ లేరు. ఇప్పుడు ఈ గోలంతా ఎందుకు?

నిజమే. సైన్సు పరంగా ఈ గోలకి అర్థం లేదు. తీవ్రమైన ప్రతికూల పరిస్థితుల్లో కూడా జీవించే జీవులు వున్నాయి. సూక్ష్మక్రిములు ఉన్నాయి. భూమండల మంతా అణుబాంబులు పేలినా సూక్ష్మక్రిములు మాత్రం అంతరించవు. అందువల్ల జీవశాస్త్రపరంగా ప్రకృతిలో వస్తున్న విపరీత మార్పులకి పెద్ద ప్రాధాన్యం లేదు అంటున్నారు కొందరు జీవశాస్త్రజ్ఞులు.

మానవుడు యెంచుకొన్న అభివృద్ధి క్రమం వల్ల ప్రకృతి విలయం సంభవించి మనిషి అంతరిస్తాడు. అదొకటే ప్రమాదం. కాని జీవానికి మొత్తంగా ముప్పేమీలేదు.

అంటే అభివృద్ధిని కీర్తించినపుడు మనిషి మానవకేంద్రక బుద్ధితో కీర్తించాడు. ఈనాడు అభివృద్ధివల్ల వచ్చే ముప్పుని కూడా మానవ కేంద్రక బుద్ధితో గుర్తిస్తున్నాడు, హెచ్చరిస్తున్నాడు. అంతేకాని ఆధునిక మానవుడికి ప్రకృతిమీద మక్కువ లేదు.

ఆధునిక మానవుడు గోమాతని ఆరాధించలేడు. రావిచెట్టుకీ, వేపచెట్టుకీ పెళ్ళిచేసి సంతోషించలేడు. అతని హేతుబుద్ధికి ఇది విరుద్ధం. మానవుని హేతుబుద్ధే కార్యకారణ సంబంధం పట్ల అతని మక్కువే అతని అసలు రోగం. దానికి మందులేదు.

మానవచర్యలవల్ల ప్రళయం సంభవించవచ్చని అనాదిగా పురాణగాధలు హెచ్చరిస్తూనే వచ్చాయి. మానవుడి విపరీతమైన పరుగు అతన్ని అగాధంలోకి నెట్టే ప్రమాదం వుందని ప్రాచీన రుషులు హెచ్చరిస్తూ వచ్చారు. అందువల్ల కోరికల్ని తగ్గించుకోమని హెచ్చరించారు. శిబి చక్రవర్తి వలె పశుపక్ష్యాదులకి కూడా మానవుడు రక్త మాంసాలని అర్పించాలని బోధించారు.

మానవుడి కోసం శిలువనెక్కడంలో కాదు, పశుపక్ష్యాదుల కోసం ప్రాణాలు అర్పించే పురాణగాధలలో మానవుడికి రక్షణ వుంది.

మానవుడు అనే భావనకి బలాన్ని యిచ్చి ఎరువులు వేసి పోషించి అతనికొక చరిత్ర క్రమాన్ని సృష్టించింది క్రైస్తవ పాశ్చాత్యం. జంతువుకి యెలా చరిత్రలేదో మనిషికీ చరిత్ర లేదు. అనంత విశ్వ పరిభ్రమణంలో జననమరణ పరంపరలో మానవుడు కూడా అన్ని జీవుల్లాగే మొదలూ తుదీ లేకుండా పరిభ్రమిస్తున్నాడు. అతని జన్మ తిథికి ప్రాధాన్యం యివ్వవలసిన అవసరంలేదు. అటువంటి ప్రాధాన్యం యివ్వడం మనిషిని అంతులేని విషవలయంలోకి నెట్టింది.

మానవుడికొక చరిత్రని సృష్టించినపుడే మానవుడు అంతరిస్తాడేమోనన్న భయమూ పుట్టింది. అతడు సృష్టించిన అద్భుతమైన నాగరికత అంతరిస్తుందేమో నన్న భయమూ పుట్టింది. మానవతా వాదమూ, మానవ చరిత్ర, మానవ నాగరికతలాంటి భావనలు నిజానికి హేతు విరుద్ధమైనవి. సముద్రపు వొడ్డున పిల్లలు ఇసుక గూళ్లు కట్టుకొంటారు. మనిషి చేసిందికూడా అంతే. అతని నాగరికత కూడా అంతే భద్రం. కాని అతని బౌద్ధిక ఉత్పత్తియైన చారిత్రక భావన మానవుడికి మితిమీరిన ప్రాధాన్యం యిచ్చింది. ఆ భావన ఒక మత విశ్వాసం మాత్రమే.

అంతులేని మానవ ప్రగతి అనే మత విశ్వాసాన్ని శిఖరస్థాయికి తీసుకు వెళ్ళిన సోవియట్ సోషలిస్టు రష్యా సాంకేతిక అభివృద్ధికి చిరునామాగా మారింది. చెర్నోబిల్ అణుప్రమాదం మానవ అభివృద్ధిపై ప్రకృతి రచించిన గొప్ప ప్రహసనం. యీ ప్రహసనాన్ని కప్పిపుచ్చడం ద్వారా సోషలిస్టు రష్యా మానవ అభివృద్ధి నమూనాపై భ్రమల్ని రక్షించడానికి ప్రయత్నించింది. ఇలా వాస్తవాల్ని కప్పిపుచ్చడం ప్రగతి శీలులకీ వాస్తవికతా వాదులకీ అనివార్యమైన కార్యక్రమంగా మారింది. ఇది వాస్తవికతావాదం కొత్త తరహా భ్రమలపై నిర్మించబడిందనే సత్యాన్ని బహిర్గతం చేసింది.

ఇప్పుడు పాశ్చాత్య ఆధునికత ప్రవచించిన విలువలన్నీ సంక్షోభంలో పడిపోయాయి. మానవుడి అనివార్య పురోగతి, శిఖరానికి చేరుకునే మానవ చరిత్ర, సోషలిస్టు వ్యవస్థవైపు ప్రయాణం, సమానత్వం, సౌభ్రాతృత్వం స్వేచ్ఛ వీటన్నిటినీ ప్రవచించిన పాశ్చాత్యమే వీటిని అభాసుపాలు చేసింది. వీటిని నిర్మించిన పాశ్యాత్యమే వీటి పునాదుల్ని కూల్చేసింది.

మానవ పురోగతికి మానవుడి దుందుడుకుతనమే ముఖ్య కారణం అన్నాడు స్టీఫెన్ హాకింగ్ అనే ప్రముఖ భౌతిక శాస్త్రవేత్త. పాశ్చాత్య ఆధునికత సృష్టించిన ఆదర్శవంతమైన పదజాలాన్ని మొత్తంగా పక్కకి నెట్టేశాడు హాకింగ్. దుందుడుకు తనం, దౌర్జన్య ప్రవృత్తి యివే మానవ ప్రేరణలని తేల్చేశాడు. దుందుడుకు తనం వల్ల భూమికే ప్రమాదం వస్తే ఏం చెయ్యాలి? మరింత దుందుడుకు తనమే దుందుడుకుతనం వల్ల వచ్చే తీవ్ర విపరిణామాలకి విరుగుడు. మానవుడి చర్యలవల్ల ఈ గ్రహం చెడిపోతే, మరో గ్రహాన్ని వెతుక్కోవాలి. ఆ గ్రహం చెడిపోతే మరో గ్రహాన్ని మళ్ళీ వెతుక్కోవాలి.

ఇంకా మన తెలుగు మేధావులు పాశ్చాత్య ఆధునికతని కీర్తిస్తూనే వున్నారు. భూమండలంమీద సోషలిజం కోసం వెతుకుతూనే వున్నారు. కాని అసలుకే ముప్పు వచ్చేసిందని పాశ్చాత్య శాస్త్రవేత్తలు ప్రకటించేశారు. భూమి నివాసయోగ్యం కాదు అన్నాడు హాకింగ్. హాకింగ్ ప్రవచిస్తున్న దుందుడుకు తనమే అమెరికనిజం.

# స్వేచ్ఛ విస్ఫోటనం

పర్యావరణ పరిరక్షణ అనేది ధనికవర్గాల హాబీగా మారింది. దాన్ని గురించి మాట్లాడ్డం ఫ్యాషన్‌గా మారింది. పర్యావరణానికి తీవ్రంగా ముప్పుతెచ్చిన పాశ్చాత్య దేశాలనుంచే ఈ వాదం దిగుమతైంది.

జంతు ప్రేమనే చూడండి. బాగా డబ్బు సంపాదించి యేం చెయ్యాలో తెలియని సినీ తారలకు, రాజకీయ నాయకులకు ధనికులకు ఆసక్తికరమైన అంశం యిది. జంతువులు చేయలేని చేష్టలు ప్రారంభమయ్యాయి. మోడల్స్ నగ్న దేహాల మీద బొమ్మలు గీయించుకొని ప్రదర్శనలు చేసి జంతు ప్రేమని చాటుకున్నారు కాని ఈ పేరుతో వీరికి తెరవెనక చాలా డబ్బు ముడ్తోంది. ఇదీ ఒక వ్యాపారంగా మారింది.

ఈలోగా శాకాహార వాదం విజృంభించింది. జంతువుల్ని హింసించి భుజించడం అమానవీయం. చెట్లు మొక్కల నుంచి మాత్రమే ఆహారం స్వీకరించడం ధర్మం, ఆరోగ్యకరం అనేవాదం ప్రచారంలోకి వచ్చింది.

ఈ శాకాహార వాదానికి మూలాలు వలసవాద కాలంలో లభిస్తాయి. బ్రిటీషువారు గొడ్డు మాంసం తినడంవల్లనే బలాన్నీ, బుద్ధినీ కలిగివున్నారు. వారు మాంసాహారులు కావడం వల్లనే భారతీయుల్ని జయించారు అన్న నమ్మకం వుండేది. అందువల్లనే వివేకానంద స్వామి యువకులకి గొడ్డు మాంసం తిని కండలు పెంచమని సందేశం యిచ్చారు. ఇటువంటి అభిప్రాయాలకి ప్రభావితుడైన గాంధీ బాల్యంలో రహస్యంగా మాంసాన్ని స్వీకరించారు. తదనంతర దశలో శాకాహారవాదిగా మారాడు. గాంధీ శాకాహారవాదం వెనుక క్రైస్తవ వలస వాద వ్యతిరేకతే ప్రధానం.

ఐతే సనాతన బ్రహ్మణులు శాకాహార వాదానికి విరోధులు. ఎందుకంటే శాకాహార ప్రచారం వర్ణవ్యవస్థకి విరోధి. అందరూ శాకాహారమే తీసుకోవాలనడం, ఒకే ఆచారాన్ని ఒకే రకమైన ఆహార పద్ధతినీ, ఒకే రకమైన పూజా విధానాన్ని నిర్దేశించడం వర్ణాశ్రమ ధర్మ విరుద్ధం. అందువల్లనే కంచి పరమాచార్యుల వారు గాంధీ ప్రతిపాదించిన శాకాహార వాదాన్ని అంగీకరించలేదు. నిజానికి గాంధీ మహాత్ముడు కూడా పూర్తి శాకాహారవాది కాదని వాదించారు కంచి శంకరా చార్యులు. తద్వారా శాకాహార వాదానికి లభిస్తున్న మద్దతుని తగ్గించడానికి ప్రయత్నించారు అందరూ శాకాహారులు కావడం కాని, అందరూ మాంసాహారులు కావడంకాని వర్ణధర్మ విరుద్ధం, సనాతన ధర్మ వ్యతిరేకం.

ఆరోగ్యంపట్ల మితిమీరిన శ్రద్ధ పెరిగింది. ఒకప్పుడు అందరూ ఎరువులు వాడని ఆహారాన్నే స్వీకరించేవారు. ఇప్పుడు అటువంటి ఆహారం అధిక ధరలకి లభిస్తోంది. ఆర్గానిక్ ఫుడ్ పేరుతో వ్యాపారం మొదలైంది. అంటే సహజత్వం కూడా ఖరీదైన వ్యాపారంగా మారింది. నీరుకూడా వ్యాపారంగా మారింది. క్రమేపీ మంచి గాలి కూడా వ్యాపార వస్తువుగా మారే సూచనలు కనబడుతున్నాయి. ఇలా పంచభూతాలు పరాయివిగా మారిపోతున్నాయి.

ఇదే సమయంలో పతంజలి యోగసూత్రాలు, సినీతారల సౌందర్య రహస్యాలుగా, ఆరోగ్య సూత్రాలుగా మారాయి. యోగః చిత్తవృత్తి నిరోధః అనే సూత్రం కాస్తా వ్యాపార సూత్రంగా మారింది. ఆధునిక కాలుష్యం తీసుకువస్తున్న వ్యాధులనుంచి ఉపశమనాన్ని యిచ్చేదిగా యోగం భావించబడ్తోంది. అందలి యమ నియమాలకి ప్రాధాన్యం తగ్గిపోయింది. వైరాగ్య భావన మచ్చుకైనా లేదు. మోక్ష సాధన మృగ్యమైంది.

శాంతికోసం ప్రయత్నం నిలిచిపోయి ఆధునిక అశాంతి నుంచి తాత్కాలిక ఉపశమనంగా యోగం మారిపోయింది. కార్పొరేట్ సోపానాల్ని అధిరోహించ డానికి మెట్టుగా భావించబడ్తోంది.

ఆయుర్వేదం ప్రకృతి సహజమైనది. నీటికి చల్లదనం, నిప్పుకు వేడిమి సహజమైనట్లే ప్రకృతిలోనే సహజంగా ఆయుర్వేద సూత్రాలు వున్నాయని చరక సంహిత బోధించింది. చిత్త శాంతిని కలిగించే ఆధ్యాత్మిక జ్ఞానాన్ని కూడా ఔషధంగా సుశ్రుతసంహిత భావించింది.

ఇప్పుడు ఆరోగ్యం పూర్తి వ్యాపార మార్గంగా మారిపోయింది. మనశ్శాంతి మనో వైద్యుల వృత్తిగా మారింది. ఆధ్యాత్మికత ఆధునిక వాణిజ్యంగా అభివృద్ధి చెందింది. అందువల్ల ప్రకృతి సహజమైనదంటూ యేదీ లేకుండా పోయింది. దేవీ గీతకూడా దేవికి శక్తి సహజమైనదని బోధిస్తోంది. నీటికి చల్లదనం, నిప్పుకి వేడివలె దేవికి శక్తి సహజమైన స్వభావమని దేవీగీత వర్ణించింది.

నీరూ, నిప్పు, గాలీ సహజ స్వభావాన్ని కోల్పోయినపుడు శక్తీ లేదు ఆరోగ్యమూ లేదు. పంచభూతాలపట్ల మనిషి చేసిన అపరాధం అతన్ని మహాపాపమై వెంటాడ్తోంది. పంచభూతాలలోని శక్తినీ దైవత్వాన్ని ఔషధతత్వాన్నీ విస్మరించింది పాశ్చాత్య విజ్ఞానం. వాటిని వట్టి మూలకాలుగా చూసింది. ముక్కలు చేసి విశ్లేషించింది.

యీ విశ్లేషణలో భాగంగా మనిషి పాంచభౌతిక ప్రకృతి నుంచి పూర్తిగా వేరైపోయాడు. ఆ ప్రకృతిపై సార్వభౌముడిగా అవతరించాడు.

ప్రకృతి జయించదగినదిగా కొల్లగొట్టదగినదిగా భావించబడింది. ఫలితంగా ప్రకృతి ఎదురు తిరిగి పంచభూతాలు ఎదురుతిరిగి మానవుడు నిశ్చేష్టుడై నిలబడ్డాడు. యీ సందర్భంలో పర్యావరణ వాదం రంగ ప్రవేశం చేసింది.

మార్కెట్టు వల్ల వచ్చిన సమస్యలు మార్కెట్టులోని సంస్కరణవల్లే రూపుమాప బడ్తాయని కొందరు పర్యావరణ వాదులు భావించారు. పర్యావరణ అనుకూల ఉత్పత్తులు (ఎకోఫ్రెండ్లీ ప్రొడెక్ట్స్) అనే పదం సృష్టించబడింది. ఐతే ఇప్పుడు ప్రకృతి సిద్ధంగా సహజంగా జీవించడానికి చాలా ధనం అవసరం. సహజత్వం అరుదైన సరుకుగా మారింది. అందువల్ల అది సహజత్వం కాకుండా పోయింది.

ఆయుర్వేదం కీర్తించింది సహజత్వాన్నే. భారతీయ తత్వం కీర్తించింది సహజత్వాన్నే.

సహజత్వం అంటే పూర్ణంలో పూర్ణంగా జీవించడం. ద్రష్టనీ, దృశ్యాన్నీ పూర్తిగా వేరుపరచడం పాశ్చాత్య విజ్ఞానమైతే, రెండింటినీ వేరు పరచకపోవడం, పూర్ణంగా చూడడం భారతీయ విజ్ఞానం. ఆయుర్వేదం బోధించిన ప్రకృతి సహజ సూత్రం అదే.

ప్రకృతిని జయించడం కాదు అనుసరించడం వల్లే ఆరోగ్యం లభిస్తుందని ఆయుర్వేదం చెప్తుంది.

భారతీయ విజ్ఞానం యజ్ఞంలో దాగి వుంది. యజ్ఞం అంటే ప్రకృతి చక్రభ్రమణం. యజ్ఞం వల్ల మేఘం, మేఘం వల్ల వర్షం, వర్షం వల్ల జీవజాలం వృద్ధి చెందుతున్నాయి. యీ చక్రం అనంతంగా తిరుగుతూ వుంటుంది.

కాళిదాసు రాజ్యాన్ని కూడా చక్రభ్రమణంతోనే పోల్చాడు. సముద్రం నుంచి మేఘం నీటిని స్వీకరించేది వర్షించడానికే. అలాగే రాజు పన్నుల్ని స్వీకరించేది ప్రజలకోసమేనని రఘు వంశ మహాకావ్యం బోధిస్తోంది. జీవులు కూడా ఒక దానిమీద మరొకటి ఆధారపడి ఒక జీవనచక్రాన్ని యేర్పరచుకొన్నాయి. జన్మ పరంపరకూడా ఒక అనంత చక్రభ్రమణమే.

రుతుచక్రం, కాలచక్రం యిలా అన్నిటినీ చక్రంతో పోల్చారు. స్థలకాలాల్ని చక్రంగానే భావించారు. జీవేమ శరదశ్శతం అన్నారు. వందశరదృతువులు జీవించాలన్నారు. అంటే రుతుచక్రమే జీవన చక్రం. గమనం కాదు. చక్రభ్రమణమే జీవితం. ప్రతీదీ పరస్పరాధారితం.

అంటే భారతీయ దృష్టి ప్రాకృతిక దృష్టి, పాంచభౌతిక దృష్టి. పంచభూతాలలో ఆకాశం అతి సూక్ష్మమైనది. ఆకాశాన్నికూడా జయించాననుకోవడం మనిషి అహంకారానికి పరాకాష్ఠ. ఖగోళంపైన ఆధిపత్యం అనే భావన కూడా ఆధునిక కాలంలో ప్రబలింది.

అహం నుంచే సృష్టి ఏర్పడ్తోందని రుషులు బోధించారు. అహమే యీ ప్రపంచాన్ని సృష్టిస్తోంది. అహంకారాన్ని జయించాలని కాక, అహంకారాన్ని బలపరచుకోవడానికే ఆధునిక మానవుడు కృషి చేస్తున్నాడు. యీ అహంకారాన్ని బలపరచుకోవడానికే భారతీయ శాస్త్రాల్నికూడా యెరువుగా వాడుకొంటున్నాడు. నిజానికి ఆ శాస్త్రాలు బోధించింది అహంకారాన్ని జయించమని మాత్రమే.

ఆధునిక మానవుడి అహంకారం విస్తరించి స్వేచ్ఛగా పేరుమార్చుకుంది. స్వేచ్ఛ అహంకారంతో కూడిన దుందుడుకుతనానికి దౌర్జన్యానికి ప్రతీకగా మారింది.

సరిహద్దులులేని విస్తరణకోసం దౌర్జన్యానికి పాల్పడడమే స్వేచ్ఛ. అదే అమెరికనిజం. దానికి ముసుగే పర్యావరణ వాదం.

అందుకే ఒకవైపు నదీనదాల్నీ, గిరివన దేవతల్నీ ధ్వంసం చేస్తుంటారు. మరోవైపు కుక్కల్ని పెంచడం, శాకాహారం భుజించడం, యూకలిప్టస్ చెట్లని పెంచడం పర్యావరణ పరిరక్షణగా ప్రచారం జరుగుతుంటుంది.

చమురు నిక్షేపాలకోసం భూమినంతా తవ్విపోస్తున్న అమెరికాయే పర్యావరణ రక్షకుడిగా ప్రపంచ వేదికపై నటిస్తుంది. దాని అర్థం నేను దుందుడుకుగా ప్రకృతినంతా భక్షిస్తాను. నాతో ఎవరూ పోటీరాకండి అని చెప్పడమే.

అంతర్ముఖంగా ఉండడం, తనలో తానుగా వుండడం, ఒక చక్రంవలె తనలో తానే భ్రమిస్తూండడం అనే ప్రాకృతిక సూత్రం భారతీయమైనది. అది ఉనికికి ప్రాధాన్యం ఇస్తుంది. స్థితిని మరిచిన గతిని నిరాకరిస్తుంది. భూతత్వాన్ని జలతత్వాన్ని పంచభూత తత్వాన్ని ఆరాధిస్తుంది సనాతన ధర్మం.

స్థితిని పూర్తిగా నిరాకరించిన గతియే పాశ్చాత్య ఆధునికత సూత్రం. దుందుడుకుతనాన్ని, దౌర్జన్యాన్ని గతి సూత్రంగా మార్చివేసింది అమెరికా. నిజానికి ఆ గతికి కొన్ని ధర్మాలు అవసరం లేదంది.

ధరించేది ధర్మం. ప్రకృతినీ మనిషినీ విశ్వాన్నీ నిలిపేది ధర్మం.

సర్వధర్మాల్ని నిరాకరించేది అమెరికనిజం. దౌర్జన్యంలోనైనా, దుందుడుకు తనంలో నైనా ముందుకు పరిగెత్తడమే. పరుగు మాత్రమే సత్యం. పరుగెత్తేవాడు లేడు.

స్వేచ్ఛ మాత్రమే సత్యం

సూపర్‌మాన్‌ని కలగన్నాడు నీషే.

ప్రజలూ ప్రపంచమంతా అధిమానవుడి పురోగతికోసమే నన్నాడు నీషే. అధిమానవుడు లేడు. మానవుడూ లేడు.

పురోగతివైపు ప్రజల్ని నడిపే అధినాయకత్వం అవసరం అన్నారు కమ్యూనిస్టులు. ప్రజలు లేరు. మానవులు లేరు. అధిమానవులు లేరు. అధినాయకులు లేరు. నడిపేవారు లేరు. పరుగు మాత్రమే వుంది. అమెరికనిజం అంటే విడుదలచేయబడిన స్వేచ్ఛ.

చివరికి ఆ స్వేచ్ఛ చెర్నోబిల్ అణు ప్రమాదం జపాన్ అణుకార్మాగార విస్ఫోటం, భోపాల్ గ్యాస్‌లీక్ వలె వట్టి యాదృచ్ఛికమైన దౌర్జన్య ప్రవృత్తిగా మారిపోయింది. మొదట అణు విస్ఫోటనం చేసింది అమెరికాయే.

కాని ఇప్పుడు అణువిస్ఫోటనం ఎవరూ చెయ్యనక్కరలేదు. అదంతటదే జరిగిపోతుంది. దౌర్జన్యం చేసేవాడు లేడు. దౌర్జన్యం వుంది.

మార్కెట్ స్వేచ్ఛ తనకు తానుగా చలిస్తుంది. అదే అమెరికనిజం. మార్కెట్టు స్వేచ్ఛని అమెరికాకూడా నియంత్రించలేదు. అదే అమెరికనిజం. అమెరికా కన్న కలే అమెరికా చేతినుంచి జారిపోయింది. అమెరికన్ కల వుంది. అమెరికాలేదు.



# తత్వం కనబడుటలేదు

యజ్ఞ ధ్వంసమే అమెరికనిజం. రాక్షసుడు లేని రాక్షసత్వం అది. యజ్ఞం యొక్క పరమ ప్రయోజనం పునరుత్పత్తి.

మార్కెట్ ఉత్పత్తుల్ని పెంచడం మీద శ్రద్ధ పెరుగుతోంది. పునరుత్పత్తి నిరాకరించబడ్తోంది. పుత్రకామేష్ఠియాగం నిలిచిపోయింది. ఆడపిల్లలు కోట్లాదిగా గర్భంలోనే అదృశ్యమవుతున్నారు.

అమెరికనిజం జీవనానికి విరోధి. ప్రపంచమంతటా వృద్ధులు పెరిగిపోతున్నారు. భవిష్యత్తులో యంత్రాలు మనుషులని వెతుక్కుంటూ తిరిగే కాలం రాబోతోంది.

యంత్రాలు పెరిగి మనుషులు తరిగిపోతుండడంతో మానవ వనరులు అనే పదం సార్థకమైంది.

ఆధునిక గర్భనిరోధక పద్ధతులు పెరగడం స్త్రీకి విముక్తినిస్తుందని స్త్రీ వాదులు భావించారు. కాని స్త్రీ జాతి అంతరించిపోవడమే స్త్రీ విముక్తిగా నిర్వచించింది ఆధునికత.

మానవుడు సుఖదుఃఖాలు అనుభవించడానికి అనుభూతి చెందడానికి కాలం లేదు. కాలం అపహరించబడింది. తారుమారు చేయబడింది. దివారాత్రాలు తలకిందులు అయ్యాయి. కృత్రిమ వెలుతురే మిగిలింది. చీకటి పూర్తిగా అపహరించబడింది. ఏకాంతం అదృశ్యమైంది. ఋతువులు దివారాత్రాలు లాంటి ప్రాకృతిక విభజన ముగిసిపోయింది. కాలం యాంత్రికంగా మారిపోయింది.

యంత్ర నాగరికత కోసం మనిషి తన పునరుత్పత్తి శక్తినీ పునరుత్పత్తి కాలాన్నీ బలిపెడ్తున్నాడు. సంభోగానికి సమయంలేదు. సమయం వున్నా పునరుత్పత్తి పట్ల ఆసక్తిలేదు. దీంతో అభివృద్ధి చెందిన దేశాల్లో గత తరమే మిగులుతోంది.

బౌద్ధం సన్యాసాన్ని బోధించింది. వ్యాపారానికి ప్రాధాన్యత నిచ్చింది. సర్వం క్షణికం అంది. క్షణికత్వం, సన్యాసం, వ్యాపారం కలగలసిన నాగరికత పాశ్చాత్యంలో అవతరించింది. సర్వం అనాత్మ అనే సిద్ధాంతం అమెరికనిజంలో వికృతరూపం ధరించింది. ఉనికి నిరాకరించబడింది

కర్తలేదు పని వుంది

ఆలోచించేవాడు లేడు ఆలోచన వుంది. ఇలా వునికిని మౌలికంగా తిరస్కరించింది బౌద్ధం. కాని బౌద్ధం అహంకారంపై విజయాన్ని ప్రధానంగా భావించింది. అహంకార విముక్తికోసం ఆత్మనికూడా నిరాకరించింది. కాని అమెరికనిజంలో దిగజారిన బౌద్ధం కనబడ్తుంది. బుద్ధి వికాసం అహంకారాన్ని బలపరిచింది. సృష్టికి మూలమైన అహంకారం ముదిరిముదిరి సర్వధర్మాల్నీ నశింపజేసి, సృష్టికే ముప్పుగా పరిణమించింది.

అహంకారం కూడా తన స్వభావాన్ని పూర్తిగా కోల్పోయి మాన్యుఫేక్చర్డ్ అహంగా పరిణమించింది. మార్కెట్టు వ్యక్తిత్వ వికాసం పేరుతో అహాన్ని మార్కెట్ ఉత్పత్తిగా మార్చింది. అసలు వ్యక్తిత్వ వికాసం అనేదే తప్పుడు పదం.

వ్యక్తిత్వంలోని త్వం అనేది వునికిని సూచిస్తుంది. ఉనికికి వికాసం లేదు. స్వభావం మాత్రమే వుంది. కదిలిన ఉనికి ఉనికి కాకుండా పోతుంది. వికసించేది ఉనికి కాదు.

అందువల్ల వ్యక్తిత్వం లేదు. వికాసం మాత్రమే వుంది. మార్కెట్టు కోసమే ఆ వికాసం.

అద్వైతంలోనూ, బౌద్ధంలోనూ కనబడిన సర్వ నిరాకరణ అమెరికనిజంలో కనబడుతుంది. అలాగే అహమును నిరాకరించడంకూడా అమెరికనిజంలో కనబడ్తుంది. అది మరో రూపంలో కనబడ్తుంది. వికృత రూపంలో కనబడుతుంది. చరిత్రలేదు. సిద్ధాంతంలేదు. మానవుడు లేడు. మతం లేదు.

యూరప్ సృష్టించిన వీటినన్నిటినీ అమెరికా రద్దుచేసింది.

పైగా భారతీయులు సృష్టించిన శాస్త్రాల సారాన్ని పిండేసి, మార్కెట్టు వస్తువులుగా మార్చింది.

కామానికి స్థలకాలాలు లేవు. కామం వుంది. వైరాగ్యానికి చోటు లేదు. ఆధ్యాత్మికత వుంది. శాంతికి స్థానం లేదు. యోగసూత్రానికి మార్కెట్టు వుంది. ఇవన్నీ మార్కెట్టు పరుగుకి అనుసంధానించబడ్డాయి.

గోవులోని గోత్వాన్నీ, వృక్షంలోని వృక్షత్వాన్నీ, మానవుడిలోని మానవత్వాన్నీ యిలా తత్వాన్ని రద్దు చేయడమే అమెరికనిజం. అదే అమెరికన్ స్వేచ్ఛ.

తత్వాన్ని నిరాకరించడమే అసలు హింస. మనిషిలోని తత్వాన్ని తొలగించి యంత్రంగా మార్చడం, స్వేచ్ఛగా నిర్వచించబడ్తోంది. మనిషిలోని తత్వం అపహరించబడ్తోంది. స్వభావం అపహరించబడ్తోంది. అతని పునరుత్పత్తి శక్తి ఇంద్రియానుభూతి, ఏకాంతమూ రద్దు చేయబడ్తోంది. అదే అమెరికనిజం.



# శత్రువు కావలెను

అమెరికనిజమ్ కొనసాగాలంటే దానికొక శత్రువు అవసరం.

అందుకే అమెరికా ముఖద్వారం మీద ఒక బోర్డు వేళ్ళాడుత్తూ వుంటుంది. ఒక శత్రువుకావలెను అని ఆ ఫలకం మీద స్పష్టంగా రాసి వుంటుంది.

అమెరికా కృత్రిమంగా సృష్టించబడిన దేశం అమెరికాకి అనాదితనం లేదు సంప్రదాయపరంపరలేదు. మిడిమేలంగా పుట్టుకొచ్చిన దుందుడుకు బిడ్డ అమెరికా.

యూరప్ వలసవాదం వెనుక అనాగరిక దేశాలని ఉద్ధరించాలనే ఆదర్శం వుంది. క్రైస్తవ మత వ్యాప్తి అనే లక్ష్యం వుంది.

అమెరికాకి అదికూడా లేదు. అది అనేక జాతులకూడలి. అదొక అద్వైతం. వివేకానంద స్వామి చెప్పిందదే.

కాని అది మార్కెట్టు అద్వైతం. స్వస్వరూపజ్ఞానం పొందదానికి అమెరికాకి ఆత్మలేదు. మార్కెట్టే దాని ఆత్మ.

ఆ మార్కెట్టులో చప్పన్నారు జాతుల వాళ్ళనీ కలిపేయడమే దానిపని.

ఇతరులు ఉన్నారు కనుక నేను ఉన్నాను అని చాటుకుంటుంది అమెరికా. దాని అస్తిత్వం శత్రువు అస్తిత్వంమీద ఆధారపడి వుంటుంది. ఇతరం మీద దాని ఉనికి ఆధారపడింది. అందువల్ల నిరంతరం శత్రువుని సృష్టించుకొనే పనిలో వుంటుంది అమెరికా.

ప్రపంచమంతా క్రైస్తవ మత వ్యాప్తి చెయ్యాలని పాశ్చాత్యులు భావించారు. పోర్చుగీసువారు ఇస్లాం నుంచి భారతదేశాన్ని విముక్తి చేసి క్రైస్తవాన్ని వ్యాప్తి చెయ్యాలని దీక్ష బూనారు. ఇదే లక్ష్యాన్ని ఆంగ్లేయులూ కొనసాగించారు. వీరు ముస్లింలని శత్రువులుగా భావించారు. దానికి కారణం క్రైస్తవ వ్యాప్తికి ఆటంకంగా

నిలవడమే. అదే సమయంలో బ్రాహ్మణుల్నీ శత్రువులుగా భావించారు. ఇస్లాం మతాన్ని నిర్మూలించాలి. బ్రాహ్మణులకి మతం లేదు కనుక బ్రాహ్మణ సనాతన ధర్మాన్ని పునర్నిర్వచించాలి. ఆ నిర్వచించడంలో భాగంగా క్రైస్తవానికి ముందున్న యూదు మతంతో పేగనిజంతో, హెలెనిజంతో సనాతన ధర్మాన్ని పోల్చారు. బ్రాహ్మణులు, మూర్ఖులు, కాలం చెల్లినవారు. వారి స్థానంలో క్రైస్తవాన్ని స్థాపించాలి. అది కుదరని పక్షంలో క్రైస్తవ సాపేక్షంగా సనాతన ధర్మాన్ని పునర్నిర్వచించాలి. ముస్లిములైతే కరుణలేని వారుగా, అనాగరికులుగా నిర్వచించబడ్డారు. అంతిమంగా బ్రాహ్మణులూ, ముస్లిములూ, సంస్కరించబడవలసిన వారుగా భావించబడ్డారు. వారిని సంస్కరించి వారి యిద్దరి ఆలోచనల్నీ, భావాల్నీ నిర్మూలించి, క్రైస్తవాన్ని కాని క్రైస్తవ సమానమైన భావజాలాన్ని కాని భారతదేశంలో ప్రవేశపెట్టాలని క్రైస్తవ వలసవాదులు భావించారు.

ఈ కుట్రని మొదట ధార్మికులూ సాధు సన్యాసులూ గుర్తించారు. అందువల్లనే వారు వలస క్రైస్తవులనే ప్రమాదకరమైనవారుగా భావించారు.

18వ శతాబ్దికి చెందిన కైవారం నారాయణ తాత అనే శూద్ర సాధువు ప్రవచించిన కాలజ్ఞానాన్ని పరిశీలిస్తే ఈ సంగతి అర్థమౌతుంది. నారాయణ తాత పోర్చుగీసు, ఇంగ్లాండు మొదలైన వివిధ దేశాలకు చెందిన వలన క్రైస్తవులు తమలో తాము సంఘర్షించుకొని అంతరిస్తారని జోస్యం చెప్పాడు. అంతేకాదు. తిరిగి మొగల్, ముస్లిం ప్రభువులు భారతదేశాన్ని ధర్మబద్ధంగా పరిపాలిస్తారని భవిష్యత్తుని కలగన్నాడు. ముస్లిం పాలనని కాంక్షించాడు. నారాయణతాత ప్రత్యక్ష ఇంగ్లీషు పరిపాలనకు ముందువాడు.

ఇంగ్లీషు పరిపాలనా కాలంలో జీవించిన శృంగేరీ శంకరాచార్యులు శ్రీచంద్రశేఖర భారతీ స్వామి వారు ముస్లింలని దుర్మార్గులుగా చిత్రిస్తున్న క్రైస్తవ చరిత్రని ఖండించారు. ముస్లింల పరిపాలనా కాలమే ధర్మబద్ధమన్నారు.

క్రైస్తవులు తమ మత వ్యాప్తిలో భాగంగా ప్రపంచంలోని క్రైస్తవేతరమైన ప్రతిదాన్నీ నిర్మూలించడం, లేదా సంస్కరణ పేరుతో తమకి అనుకూలంగా క్రైస్తవ

ప్రతిబింబంగా మార్చెయ్యాలనికాని సంకల్పించారు. క్రైస్తవుల పాదాలకింద చాలా వ్యవస్థలు చితికిపోయాయి. రూపుమార్చుకొన్నాయి. బిక్కుబిక్కుమంటూ జీవించడం మొదలుపెట్టాయి. క్రైస్తవులతో పోల్చుకొని సిగ్గుపడే పరిస్థితికి దిగజారాయి. క్రైస్తవ విద్యావంతులైన సంస్కర్తలు ఆత్మ న్యూనతను పొంది క్రైస్తవ అనుకరణలోకి అడుగుపెట్టారు. స్వస్వరూపాన్ని విస్మరించడం వలన క్రైస్తవ వ్యతిరేకతలో కూడా వారి అనుకరణే కొనసాగింది. ఇదంతా ప్రచ్ఛన్న క్రైస్తవమైన హిందూమత ఆవిర్భావానికి దారితీసింది.

హిందుత్వ అనే పదాన్ని సృష్టించిన వీరసావర్కార్ చరిత్రనే చూడండి. ఆయన తన మరణానంతరం కర్మకాండ జరపవద్దని వీలునామాలో రాశాడు. తన శవాన్ని మోసి తీసుకువెళ్ళవద్దని అంబులెన్స్‌లో తీసుకు వెళ్ళమనీ రాశాడు. అంతేకాదు తన శవాన్ని దహనం చేసే పద్ధతిని కూడా స్పష్టంగా పేర్కొన్నాడు. ఎలక్ట్రిక్ యంత్రం ద్వారా శవ దహనం పూర్తి చెయ్యమని సూచించాడు. (హిందూత్వ - జ్యోతిర్మయశర్మ)

వీరసావర్కార్ వీలునామాలో పితృదేవతారాధనని పూర్తిగా వ్యతిరేకించాడు. పితృదేవతారాధన సనాతన ధర్మంలో చాలా ప్రధానమైనది. శ్రాద్ధం అంటే శ్రద్ధతో చేసేది. పెళ్ళిలో కూడా శ్రాద్ధం వుంటుంది. అనేక తరాల పితృదేవలని స్మరించడం, పూర్వీకులని స్మరించడం శ్రద్ధతో చెయ్యవలసిన పని. దేనినైనా క్షమిస్తారు కాని పితృదేవతారాధననీ, కర్మకాండనీ నిరాకరించడం భ్రష్టత్వంగా భావించబడ్తుంది భారతదేశంలో. అందుకే విప్లవరచయిత కాళీపట్నం రామారావు గారు తమ తండ్రికి కర్మ చేయడం కోసం విరసం అధ్యక్ష పదవికే రాజీనామా చేశారంటారు. అంత అనుల్లంఘనీయమైనది కర్మకాండ. స్మృతికి అంత ప్రాధాన్యం వుంది సనాతన ధర్మంలో. స్మృతియే లేకపోతే మనిషేలేడు. స్నేహాలూ, బంధాలూ జన్మాంతరాల నుంచి మనలో స్థిరపడిన స్మృతుల కొనసాగింపేనంటాడు కాళిదాసు. భావ స్థిరాణి జననాంతర సౌహృదాని.

ఈ స్మృతిని బద్దలు చేశాడు క్రైస్తవుడు. గత స్మృతులనుంచి విముక్తం చేసి భారతీయ గతాన్ని పరంపరనీ నిర్మూలించాడు. దానినుంచే హైందవం పుట్టింది.

ఇక్కడి నుంచి భారతదేశానికి చరిత్ర పుట్టింది. చరిత్ర అంటే క్రైస్తవమే. అనాది అనంతమైన సృష్టి పరంపరకి ఆద్యంతాలని కల్పించడమే చరిత్ర. చరిత్ర క్రీస్తు పుట్టుకతో ప్రారంభమౌతుంది. కాదంటే రాముని పుట్టుకతో ప్రారంభమౌతుంది. పితృదేవతలు విస్మరించబడ్డారు. అంటే పరంపర విసిరివేయబడ్తుంది. ఆ విచ్ఛిన్నం లోంచి పగుళ్ళలోంచి స్థలకాల పరిమితులతో కూడిన హిందూ రాజకీయాలు ప్రారంభమౌతాయి.

ఇదంతా క్రైస్తవ చరిత్ర. కాని అమెరికనిజానికి చరిత్రలేదు. ఎందుకంటే అమెరికా స్థల కాలబద్ధం కాదు. అదొక మాయ. మాయ అంటే అనిర్వచనీయం అని అర్థం. అది తన నిర్వచనం కోసం వైరస్ వలె ఇతరుల మీద ఆధారపడ్తుంది. అమెరికా ఏదికాదో చెప్పవచ్చు. కాని ఏమిటో చెప్పలేం. అందుకే అది నిరంతరం శత్రువుని సృష్టించుకొంటూనే వుంటుంది.

క్రైస్తవ యూరప్ తాను కానిదాన్ని సంస్కరించాలని చూసింది. అమెరికా తానుకాని దానిలోనే వుంటుంది. తన ఉనికిని కలిగివుంటుంది. ఎందుకంటే అమెరికాకి తాను అనేది లేదు. అదే దాని లిబరలిజం. మార్కెట్ స్వేచ్ఛ మాత్రమే దాని వునికి. మతం, భావం, భాష ఇవేవీ ముఖ్యం కాదు. వాటినన్నిటినీ మార్కెట్ స్వేచ్ఛకి బలిపెట్టడమే అమెరికనిజం. అదే అమెరికన్ స్వేచ్ఛ.



# మూర్ఖత్వమే మీడియా

అమెరికాకి వ్యక్తీకరణ లేదు. వ్యక్తీకరణని మరుగుపరచడమే అమెరికన్ వ్యక్తీకరణ. అదే అమెరికన్ వాక్ స్వాతంత్ర్యం.

యూరప్ ప్రపంచంలోని మౌనాన్ని బద్దలుచేసి స్పష్టమైన వ్యక్తీకరణని ప్రోత్సహించింది. తమలో తాముగా వున్న విభిన్న సంస్కృతులని వ్యక్తీకరించుకోమని ప్రోత్సహించింది. ఐతే అవన్నీ తమ ఆత్మ న్యూనతని తప్పక ప్రకటించుకోవాలని ఆదేశించింది.

భాషలు, సంస్కృతులు, సిద్ధాంతాలు అన్నీ క్రైస్తవం వెలుగులో తమని వ్యక్తీకరించుకోవడం మొదలు పెట్టాయి. క్రైస్తవులు చూపిన పద్ధతిలో వ్యక్తీకరించుకోవడం మొదలు పెట్టాయి. ప్రచురణ, గ్రంథస్థీకరణ పెరిగింది. వార్తా పత్రికలు వెలిశాయి. వాస్తవాల్ని తెలుసుకోవాలి. తెలుసుకోబడినదే వాస్తవం అనే ధోరణి ప్రబలింది. కన్నుగానని వస్తుతత్వము కాంచగల్గుదురింగిలీజులు అని వలస క్రైస్తవుల్ని సంస్కర్తలు కీర్తించారు.

తనలో తానుగా యేదీ నిలిచి పోకూడదు. స్పష్టమైన వ్యక్తీకరణ రూపాన్ని పొందాలి. దాన్ని మనం కంటితో చూడగలిగి వుండాలి. మార్మికత పనికి మాలినది. ఇటువంటి దృష్టి వాస్తవికతావాదానికి దారితీసింది. ఈ వాస్తవికతావాదంలో భాగంగా అనేక విలువలు రూపుదిద్దుకున్నాయి. వార్తా పత్రికలద్వారా పుస్తకాల ద్వారా ప్రతీ వ్యక్తీ ప్రతీ విషయాన్ని తెలుసుకోవాలి. విశ్లేషణా పద్ధతుల్ని నేర్చుకోవాలి. ఇదంతా క్రైస్తవ విద్యా విధానంలో భాగంగా మారింది.

మనం తెలుసుకొనే విషయాల్ని ఏవిధంగా తెలుసుకోవాలో ఏవిధంగా అర్థం చేసుకోవాలో ఎటువంటి కళ్ళజోళ్ళలోంచి చూడాలో వలస క్రైస్తవులు నిర్దేశిస్తూ వచ్చారు. మనదేశ కాలాల్లోంచి మన పరంపరలోంచి మన దేశాన్ని అర్థం చేసుకోవడం అనాగరికం, అది కుసంస్కారం.

మన జీవితాన్నీ, సంస్కృతినీ మన వాతావరణం నుంచి పూర్తిగా వేరుపరచి వాక్యూమ్‌లో వుంచి పరిశీలించడమే వైజ్ఞానిక పద్ధతి అని క్రైస్తవ మేధావులు నిర్వచించారు. పరిశోధనా శాలలో కృత్రిమంగా ఏర్పరచబడిన వాతావరణంలో పరిశీలించినట్లే పాలిత సంస్కృతుల్ని పరిశీలించాలని వారు భావించారు. అందువల్ల భారతీయుల జీవిత విధానాన్ని పక్కనబెట్టి వారి సంస్కృతినీ, తాత్వికతనీ గతకాలపు శిలాజంలా పరిశీలించాలని క్రైస్తవ మేధావులు తలచారు.

ఒక చిన్న ఉదాహరణతో ఈ విషయాన్ని స్పష్టం చేస్తాను. ఒక పక్షి ఈకనీ, రాయినీ పైనుంచి పడవేసినపుడు బరువైనదే ముందు కిందపడ్తుందని అరిస్టాటిల్ నిర్ధారించాడు. కాని ఆధునిక సైంటిస్టులు ప్రయోగశాలలో పూర్తి వాక్యూమ్‌ని కల్పించి చూస్తే రెండూ ఒకేసారే కిందపడ్తాయని నిర్ధారించారు. వాతావరణం నుంచి, పరిసరాలనుంచి పూర్తిగా వేరుపరచి కృత్రిమ వాతావరణంలో నిర్ధారించబడే వాటినే సత్యాలుగా, వాస్తవాలుగా నిర్ధారించడం మొదలుపెట్టారు క్రైస్తవ మేధావులు.

అందుకే వేదాలకి ఆంగ్లంలో విమర్శ రచించిన మేక్స్‌ముల్లర్ భారతదేశానికి చుట్టపు చూపుగానైనా రాలేదు. బౌద్ధాన్ని నాస్తిక మతంగా నిర్ధారించిన రైస్‌డేవిడ్స్‌ని ఆర్థర్‌లిల్లీ అనే మేధావి ఖండిస్తాడు. నాస్తికత్వం, ఆస్తికత్వం అనే భావనల్నీ, మరే భావనల్నియైనా భారతదేశంలో పర్యటించి భారత ప్రజల జీవనశైలిని చూసి నిర్ధారించాలంటాడు. అప్పుడే భారతదేశంలో పుట్టిన వివిధ తాత్వికతలు అవగతమౌతాయంటాడు.

కాని చాలామంది వలస క్రైస్తవ మేధావులకి భారతీయ జీవన శైలిపట్ల ఆసక్తి లేదు. భారతీయులు క్రైస్తవంతో పోల్చినపుడు క్రైస్తవ పూర్వ సమాజాలకి సంబంధించిన అంతరించిపోయేతరం. అందువల్ల వారి గ్రంథాల్నీ, సంస్కృతుల్నీ సంప్రదాయాల్నీ ఆలోచనాధారనీ వాక్యూమ్‌లో పరిశీలించాలి. వాటిని గతానికి సంబంధించిన పరిశోధనా వస్తువులుగా మాత్రమే చూడాలి. అంటే అవి పూర్తిగా గతం తప్ప మరేమీ కావు.

భారతీయులు మౌఖిక సంప్రదాయానికి ఇచ్చిన ప్రాచుర్యం అవివేక జనితం. బ్రాహ్మణుల ఆధిపత్య ధోరణికి వ్యక్తీకరణ. భారతీయుల అధ్యయన పద్ధతులు పూర్తిగా కాలం చెల్లినవి. ఆధిపత్య ధోరణితోకూడుకున్నవి, మూఢవిశ్వాసాలు అని కూడా అనవచ్చు.

దీనిని అధిగమించడం కోసం క్రైస్తవులు ప్రచురణని వేగవంతం చేశారు. ప్రచురించబడి వస్తురూపం ధరించిన పుస్తకాల నుంచి మాత్రమే వేమన, వీరబ్రహ్మం, శంకరాచార్య మరెవరైనా సరే వాస్తవంగా సాక్షాత్కరిస్తారు. నాలుకలమీద నిలిచినది గాలిలో కలిసిపోతుంది. అందువల్ల అది వాస్తవం కాదు. అందువల్ల లేఖనానికి గ్రంధస్థీకరణకి అంతిమంగా ప్రచురణకి తీవ్ర ప్రాధాన్యం వచ్చింది. ఇది వలస క్రైస్తవుడు నేర్పిన వాస్తవిక దృష్టి. మరోరకంగా చెప్పాలంటే వలస క్రైస్తవుడు సృష్టించిన వాస్తవం.

మార్మికంగా యేదీ నిలవకూడదు. వ్యాఖ్యానించబడాలి హేతుబద్ధంగా వ్యాఖ్యానించబడాలి. ప్రతీదానికీ కార్యకారణ సంబంధాన్ని వెంటనే వెతికి పట్టుకోవాలి. రోజువారీ విషయాలని కూడా తెలుసుకోవాలి. తెలుసుకుంటూ వుండడానికి ఎక్కడలేని ప్రాధాన్యం పెరిగింది. మౌనానికీ ధ్యానానికీ సమయం వ్యర్థపుచ్చుకూడదు. ఎందుకంటే వ్యక్తీకరించబడినదే సత్యం. ఈ దృష్టితోనే వార్తా పత్రికలు మొదలయ్యాయి. వార్తా వ్యాఖ్యలు మొదలయ్యాయి.

దేవుడు వలె సత్యం అనేది మనకంటే వేరుగా నిలిచివుంటుందనే క్రైస్తవ దృక్పథమే దీనికి మూలం. ఈ వాస్తవికతను తెలుసుకోవడమనే దానికి మూలం. క్రైస్తవులకి దేవుడు, భారతీయ సంస్కృతి... ప్రతీదీ బాహిరమే. సూఫీతత్వం వల్ల ముస్లింలు అంతర్ముఖులైపోయారు. కాని క్రైస్తవ వలస వాదులు ఎల్లప్పుడూ పాలితుల్ని పాలితుల జీవితాన్నీ బాహిరంగా పరిశోధనార్హమైనదానిగా నిలిపి వలస వాదులుగా మారారు.

క్రైస్తవ వలప వాదులకి వున్న వైట్‌మేన్స్‌బర్డెన్ అమెరికన్లకి లేదు. అమెరికన్లు రెడ్‌ఇండియన్ తెగల్ని ఉద్ధరించబడవలసిన వారుగా చూడలేదు. వారిని

పాలించడం కాక తరిమివేసి చంపివేసి అమెరికాని ఆవాసయోగ్యంగా చేసుకో దలచుకొన్నారు యూరోపియన్ వలసవాద దృష్టిని వదిలించుకొన్నారు. యూరోపీయ వలస వాద దృష్టిలో మతం, కరుణ ఉన్నాయి. పాలితులు అధములని వారిని ఉద్ధరించాలనే తపన వుంది. అమెరికనిజం అటువంటి భావాలని ముగించి వేసింది.

అది స్వేచ్ఛ అనే భావాన్ని వాడుకలోకి తెచ్చింది. స్వేచ్ఛ అంటే దుందుడుకు తనమే. మరో మాటలో చెప్పాలంటే నిర్మూలనే స్వేచ్ఛ. తీవ్రమైన సంక్షోభాన్ని సృష్టించే నిర్మూలన.

మొదట రెడ్ ఇండియన్స్‌ని నిర్మూలించారు అమెరికన్లు. ఇరాక్, లాటిన్ అమెరికా, వియత్నాం, ఇవన్నీ చూడండి. పరిపాలించడం మా వుద్దేశ్యంకాదు. మాకు నచ్చని వ్యవస్థల్ని నిర్మూలించడమే మా వుద్దేశ్యం. మా ప్రయోజనాలకి వుపకరించని దానిని నిర్మూలించడమే మా లక్ష్యం. ఇదీ అమెరికనిజం. అందుకే అమెరికన్లు మాయ నాగరికతకు సంబంధించిన గ్రంథాల్ని తగలబెట్టేశారు. అంతేకాని తమకి అనుకూలంగా వ్యాఖ్యానించలేదు.

అమెరికా విషయంలో అది యెంత విస్తరించినది అనికాదు. అమెరికా ఎంతటి గొప్ప సాంకేతికతతో యుద్ధం చేసింది, నిర్మూలన చేసిందీ అనేది ముఖ్యం. ఎందుకంటే యూరప్ మానవ ముఖాన్ని ధరించింది. మానవుడనే భావంలేని చోట, మానవ చరిత్ర అనే ప్రత్యేకమైన పద్ధతిలేనిచోట వాటిని ప్రవేశపెట్టింది. దాంతోపాటు మానవుని విముక్తి, స్వేచ్ఛ అనే భావాల్ని తెచ్చింది.

కాని అమెరికా మానవుణ్ణికూడా అంతరింపజేసింది. దేవుడితో పాటు మానవుణ్ణీ హతమార్చింది. గొప్ప యాంత్రికమైన స్వేచ్ఛని ప్రవేశపెట్టింది.

అందువల్ల యూరప్ ప్రవేశపెట్టిన వాస్తవాల్ని తెలుసుకోవడం అనేదికూడా అమెరికనిజంలో ముగిసిపోయింది.

వాస్తవాలనుంచి విముక్తి అంటే వాస్తవాల నిర్మూలన మాత్రమేననే నిజం అమెరిక నిజంలో మనకు సాక్షాత్కరిస్తుంది. అమెరికన్ మీడియాలో వాస్తవాలు

మరుగు పరచబడ్డాయి. కొన్ని విషయాల్ని చెప్పడం మరికొన్ని విషయాల్ని స్తబ్ధ స్థితిలోకి నెట్టివేయడానికే. కొన్ని జన్యువులు విజృంభించినపుడు మరికొన్ని జన్యువులు మరుగున పడిపోతాయి. అమెరికన్ మీడియాచేసేదదే.

ఒక ఉదాహరణ చెప్తాను. ఇరాక్ అధ్యక్షులు సద్దాం హుస్సేన్‌తో అమెరికా స్నేహం చేస్తున్న రోజులవి. సద్దాం హుస్సేన్ వల్ల హింసని భరించలేక ప్రతిపక్ష నాయకులు విదేశాలకి పారిపోయారు. తమ గోడు వెళ్ళబోసుకున్నారు. కాని అమెరికన్ మీడియా ఒక్క వాక్యంకూడా రాయలేదు. తర్వాత సద్దాం హుస్సేన్ అమెరికాకి శత్రువుగా మారాక మానవ హక్కుల ఉల్లంఘన గురించి రాయడం మొదలుపెట్టింది. అతని వద్ద జీవరసాయన ఆయుధాలు వున్నాయని అబద్ధాలు కూడా ప్రచారంలోకి తెచ్చింది. మీడియా కంట్రోల్ అనే గ్రంథంలో నోమ్‌చామ్‌స్కీ అనే అమెరికన్ మేధావియేమంటాడంటే – యూరప్ పత్రికల్లో కొంతైనా వాస్తవాలు వస్తుంటాయి కాని అమెరికా మీడియా ఎప్పుడూ తన ప్రయోజనాలకి అవసరమైన వాస్తవాలనే బయటపెట్టి వాటికింద మిగిలిన వాటిని మరుగుపరుస్తుంది. అంటే యేమిటి మనకి వాస్తవాలుగా కనబడేవి నిజమైన వాస్తవాలకి ముసుగు మాత్రమే. అంటే అమెరికన్ వాక్ స్వాతంత్ర్యం చేసేపని ఏమిటంటే వాస్తవాల్ని నిర్మూలించడం.

అందుకే అమెరికన్లు వాస్తవాల గురించి తక్కువ జ్ఞానం కలిగివుంటారని ప్రతీతి. గొప్ప వైజ్ఞానిక ఆవిష్కరణలకి నిలయం అమెరికా. ప్రపంచంలోనే గొప్ప సాంకేతికతకి నిలయం అమెరికా. ఖగోళ శాస్త్రంలో విజ్ఞాన ఖని అమెరికా.

అమెరికన్లు సుదూర నక్షత్రాల్ని, గెలాక్సీల్ని స్పష్టంగా చూడగలరు. కాని తమ ప్రభుత్వాలు చేస్తున్న పనుల గురించి వారికి తెలియదు. తమ పక్కన జరుగుతున్న సంగతులు వారికి తెలియవు. తెలిసినవి అనుకొన్నవి మరుగుపరచేవి మాత్రమే. రాజకీయంగా, సామాజికంగా, మతపరంగా ఆంతరంగికంగా అంధుల్ని చేస్తుంది, స్తబ్ధుల్ని చేస్తుంది అమెరికనిజం. ఆ అంధత్వంలోంచి, స్తబ్ధతలోంచి సాంకేతిక ఆవిష్కరణలకి దారులు యేర్పరుస్తుంది. ఆ విజ్ఞానమంతా గొప్ప

అజ్ఞానానికి ముసుగు. ఆ స్వేచ్ఛ అంతా నియంతృత్వానికి తొడుగు. ఆ చైతన్య మంతా స్తబ్ధతకి అవరణ.

దీంతో తెలుసుకోవడానికి, తెలుసుకోక పోవడానికి, జ్ఞానానికీ అజ్ఞానానికీ మధ్య దూరాన్ని చెరిపేసింది అమెరికనిజం. దానివల్ల ఒక స్తబ్ధతనీ, నిర్లిప్తతనీ వ్యాపింపజేసింది. ఆ స్తబ్ధత, నిర్లిప్తత వస్తు వ్యామోహంగా మారుతోంది. అది మార్కెట్‌ని కల్పిస్తోంది.

భాష, భావం, ఆలోచన వీటిపట్ల నిర్లక్ష్యం, నిర్లిప్తత మార్కెట్ స్వేచ్ఛకు ఉపకరిస్తున్నాయి. అంతరంగంలో దివాళా బాహిర విజృంభణకి ఉపకరిస్తోంది.

భారతీయులు కూడా వార్తా సేకరణ పట్ల నిర్లిప్తత వహించారు. కాని ఆ నిర్లిప్తత అంతర్ముఖీనత వల్ల వచ్చింది. అమెరికనిజంలోని నిర్లిప్తత బహిర్ముఖీ నమైనది. అది మార్కెట్ వ్యామోహానికి దారి తీస్తోంది.

సమాచార సేకరణ గురించి సనాతన భారతీయ దృక్పథాన్ని ఈ శ్లోకం ద్వారా తెలుసుకోవచ్చు.

**కాకస్య కతివాదంతాః**
**మేషస్యాండం కియత్పలం**
**కా వార్తా సింధుసౌవీరే**
**ష్వేషా మూర్ఖ విచారణా**

కాకికి దంతములెన్ని, గాడిద గుడ్డు బరువెంత, సింధుసౌవీర దేశాల్లోని వార్త లేమిటి ఇదంతా మూర్ఖుల విచారణ మాత్రమే.

వాస్తవం అనేది యూరోపియన్ సృష్టి. వాస్తవ వార్తా కథనాలు కూడా యూరోపియన్ సృష్టే. వాస్తవం బయటవున్నదనే దృష్టి నుంచి ఇవి పుట్టాయి. మనకి పురాణాలు, కథలూ వున్నాయి కాని వార్తల పట్ల ప్రామాణిక బుద్ధిలేదు.

ఉద్వేగము కల్పన వాస్తవంతో కలిసిపోయాయి. కథకీ, వార్తకీ మధ్య దూరం చెరిగిపోతుంది భారతీయులలో.

నిజానికి ద్రష్టకి వేరుగా దృశ్యం లేదు. కనుక వాస్తవ వార్తాకథనం కల్పన మాత్రమే. యూరప్ యిట్టి వాస్తవం సాధ్యమనే భావనని కల్పించింది. వాస్తవం గురించి వెతుకులాటని ప్రోత్సహించింది.

అమెరికనిజం యీ వెతుకులాటని ముగించివేసింది. వార్తలు మార్కెట్ కల్పించే రకరకాల బ్రాండ్ల వినోదవస్తువులు మాత్రమే. వార్తా ఛానళ్లు వినోద ప్రధానమైనవిగా మారిపోయినది అందుకే. అందువల్ల వార్తలు వాస్తవాల్ని మరుగుపరచాలి. మార్కెట్ స్వేచ్ఛకి అనుగుణంగా ప్రజల బుద్ధుల్ని తయారు చెయ్యాలి. అటువంటి సమ్మతిని సృష్టించాలి. అంతే. వాస్తవాలనుంచి పలాయనమే స్వేచ్ఛ. అదే అమెరికనిజం. వాస్తవాల్ని తెలుసుకోడం, వాస్తవాల్ని సృజించడమూ కాదు. వాస్తవాల్ని నిర్మూలించడమే అమెరికనిజం



# ప్రమాదకర బహుళత్వం

బహుళత్వమంటే అమెరికా. అమెరికనిజం అంటే బహుళత్వం అనే అభిప్రాయం ప్రాచుర్యంలో వుంది. ముఖ్యంగా భారతీయ మేధావుల్లో ఈ అభిప్రాయం పాతుకుపోయింది. నిజానికి బహుళత్వానికి సమాధికట్టి ఆ సమాధిపై వృద్ధిచెందింది అమెరికా.

భారతీయ తత్వశాస్త్రం బహుళత్వాన్ని ఆదరిస్తుందని అమెరికాలో ఉపన్యసించిన వివేకానందస్వామి, బహుళత్వానికి ప్రత్యక్ష ఉదాహరణ అమెరికాయేనని ప్రకటించాడు. అంటే భారతదేశాన్ని అమెరికాలో చూశాడు. మాయల ఫకీరు తన ప్రాణాన్ని ఎక్కడో సముద్రాల అవతల ద్వీపంలోని చిలుకలో కనుగొన్నాడు. అలాగే భారతీయ ఆధ్యాత్మిక హృదయాన్ని అమెరికాలో కనుగొన్నాడు అమెరికనిజంలో కనుగొన్నాడు వివేకానందస్వామి. ఇది భారతీయ ఆలోచనా విధానంలో గొప్ప మార్పు.

అమెరికన్ రాజ్యాంగంలో అమెరికన్ జీవిత విధానంలో భారతీయ ఋషులు ప్రవచించిన బహుళత్వం వుందని వివేకానందస్వామి ప్రవచించాడు. కాని రెడ్ ఇండియన్ తెగల వైవిధ్య సంస్కృతినీ, జీవన విధానాల్నీ చివరికి ఆ తెగల్నీ మూలమూలలకి తరిమికొట్టి నిర్మూలించి ఆధునిక అమెరికా ఆవిర్భవించిందన్న సంగతిని ప్రస్తావించనే ప్రస్తావించడు వివేకానంద స్వామి. అలాగే నల్లజాతివారి దుర్గతినీ స్మరించడు. ఈ విస్మృతిలోంచే ఒక నూతన స్మృతిని నిర్మిస్తాడు. అది భారతీయ వైదిక ధర్మాన్ని అమెరికనిజంలో వెతుక్కోవడం, తమ అస్తిత్వామూలాల్ని భారతీయులు అమెరికనిజంలో అన్వేషించడం. భారతీయ సన్యాసి స్వగతం క్రమేపీ భారతీయుల భవిష్యత్ చిత్ర పటంగా రూపుదిద్దుకోవడం మనం గమనించగలం.

తరువాతి కాలంలో ప్రముఖ దళితనాయకుడు అంబేద్కర్ అమెరికాపట్ల ఆదరాభిమానాలు చూపాడు. నెహ్రూ గారి అలీనవిధానాన్ని కాదన్నాడు. మన విదేశాంగ విధానం అమెరికాకి అనుకూలంగా రూపుదిద్దుకోవాలన్నాడు. అంబేద్కర్ మొదట సోషలిస్టు భావాల్ని వ్యక్తం చేశాడు. కాని క్రమేపీ మార్కెట్ ఆర్థిక వ్యవస్థలోనే స్వేచ్ఛా స్వతంత్రాల్ని వెతుక్కున్నాడు. ఆధునిక దళిత మేధావి చంద్రభానుప్రసాద్ మరింత ముందుకు వెళ్ళి అమెరికన్ సామ్రాజ్య వాదాన్ని ప్రపంచానికే, విముక్తి ప్రదాతగా ప్రకటించాడు. ఆఫ్ఘనిస్థాన్‌పై దాడుల్ని సమర్థించాడు. దర్బన్ సమావేశాల్లో దళితవాదులు మొదట పాలస్తీనాకి అనుకూలంగా ప్రవర్తించినా, తర్వాత వెనక్కి తగ్గారు. అమెరికా అనుకూలతే దీనికి కారణం.

నిజానికి దళితవాదం ఆధునిక ఆధ్యాత్మిక వాదమే. అది హిందూవాదానికి ముసుగు. అందుకే వివేకానందస్వామి వారి ఆధ్యాత్మిక అమెరికనిజానికి కొనసాగింపు దళితవాదంలోనే కనబడ్తుంది. అమెరికన్ సామ్రాజ్యవాదాన్ని ముక్తి మార్గంగా విముక్తి సిద్ధాంత బహుళత్వ బోధకంగా విష్ణు సహస్రనామంగా ప్రచారంలోకి తెచ్చిందెవరు? హిందూ ఆధ్యాత్మికవాదులూ, దళితవాదులూ.

బహుళత్వాన్ని ఆహ్వానించడం, ఆదరించడం, చివరికి ఆ బహుళత్వాన్ని తన విస్తరణకి ఆయుధంగా వాడుకోవడంలో అమెరికా ఆరితేరింది. దీనితో బహుళత్వం అనే పదంలోని మంచి హరించబడింది. ప్రజాస్వామ్యం, స్వేచ్ఛ అనే పదాల్ని తీవ్రంగా వాడుకలోకి తెచ్చింది అమెరికాయే. ఆ పదాల ముసుగులో నియంతృత్వాన్నీ, యుద్ధ విధ్వంసాన్ని వ్యాపింపజేసింది అమెరికాయే. మళ్ళీ తన క్రూర చర్యలకి అవే పదాలతో సమ్మతినీ సంపాదించింది. దీనితో బహుళత్వం ఒక జూదంగా మారిపోయింది. సామ్రాజ్యవాదం ఆడే జూదం.

ఈ జూదంలో భాగంగానే తీవ్ర పీడితులైన యూదుజాతినుంచి అరబ్బులని పీడించే ఆధిపత్యవర్గం పుట్టింది.

బహుళత్వం దానికదే పరమపవిత్రమైన విషయం కాదు. వక్రీకరించబడిన బహుళత్వం ప్రమాదకరం. బహుళత్వానికి ఎటువంటి తాత్విక ప్రాతిపదిక వుంది అనేది ముఖ్యం. బహుళత్వం వక్రీకరించబడడానికి డార్వినిజం మూలకారణం.

డార్విన్ సృష్టిలోని బహుళత్వాన్ని చూసి విస్తుపోయాడు. సామాన్యంగా దృష్టి గోచరంకాని జీవుల్నికూడా అన్వేషించి పరిశీలించాడు. వాటి సమాచారాన్ని సేకరించాడు. వాటి జీవనశైలిని విశ్లేషించాడు. జీవం ఎంతో బహుళం అని గుర్తించాడు. అంతేకాదు వీటి అన్నిటిలోనూ సామ్యాన్ని గుర్తించాడు. ఏకత్వాన్ని గుర్తించాడు. మనిషికీ జంతువుకీ మధ్య దూరాన్ని చెరిపేశాడు. క్రైస్తవ ద్వైత ప్రపంచంలో అద్వైతాన్ని స్థాపించాడు. సృష్టిని క్రియగా కాక ప్రక్రియగా చూశాడు. కర్తలేని సృష్టిని ప్రకటించాడు. ఇది వేదాంతానికి దగ్గరిదారే.అందుకే డార్వినిజంలో జైన స్యాద్వాదం కనబడిందంటాడు గాంధీ. స్యాదస్తి, స్యాన్నాస్తి,స్యాదస్తి నాస్తి ... ఇత్యాదిగా చెప్పబడే జైన స్యాద్వాదం అస్తిత్వాన్ని బహుళంగా వ్యాఖ్యానించింది. అస్తిత్వాన్ని స్యాత్ - బహుశా కావచ్చు అని మాత్రమే వ్యాఖ్యానించగలం. బహుళ కాలాల్లో బహుళ దేశాల్లో బహుళ రూపాల్లో వున్న అస్తిత్వాన్ని ఒకే రకంగా ఇదమిద్ధంగా తేల్చెయ్యడం కుదరదు. దాన్ని అనంత వ్యాఖ్యానాల్లో మాత్రమే సాక్షాత్కరించుకోగలం. దీనికి ఆస్తిక వ్యక్తీకరణే రామానుజ విశిష్టాద్వైతం. ఈ సృష్టిలోనే భగవత్తత్వం వుంది. అదే సమయంలో అది వేరుగా వుంది. వేరుగా వుంది కలిసికూడా వుంది. ఇదీ బహుళవ్యాఖ్యానమే. దైవతత్వానికి బహుళ వ్యాఖ్యానం.

దీన్నే డార్విన్ పరిభాషలో చెప్పాలంటే మనిషి ఏకకాలంలో మనిషిగానూ, జంతువుగానూ, సూక్ష్మక్రిమికి పరిణమించిన రూపంగానూ కూడా వుంటాడు. జంతూనాం నరజన్మ దుర్లభం కావచ్చు. కాని మనిషికూడా జంతువే. శివుడు పశుపతి మనిషికూడా పశువుల్లో ఒకడు.

ఇదంతా ఒక అద్వైత స్థితిని బోధిస్తుంది. నిజమే కాని నీచస్థితినుంచి ఉచ్ఛస్థితిలోకి పరిణామమనే అరిస్టాటిల్ సిద్ధాంతానికి, జీవులమధ్య సంఘర్షణని కూడా జోడించాడు డార్విన్. క్రైస్తవంలో కూడా దేవుడుకీ సైతానుకీ మధ్య అంతులేని ఘర్షణ వుంది. ఆ ఘర్షణని జీవుల మధ్యకి బట్వాడా చేశాడు డార్విన్. ఆ ఘర్షణలో యుద్ధంలో జయించిన జీవులే మనగలుగుతాయని చెప్పాడు. దీనినుంచి సోషల్ డార్వినిజం పుట్టింది. డార్విన్ బంధువే దీనికి ప్రవక్త. మనుషుల్లో కూడా

ఘర్షణ వుంది. మానవుల్లో కూడా మనగలిగిన జాతులే నిలుస్తాయి. ఇది జర్మన్ల ఆర్య సిద్ధాంతానికి మూలమైంది. తీవ్ర హింసకి కారణమైంది.

అందువల్ల బహుళత్వానికి ఇచ్చిన దిశానిర్దేశాన్నిబట్టి బహుళత్వం వల్ల మేలు జరుగుతుందా కీడు జరుగుతుందా అనే విషయం ఆధారపడివుంటుంది.

ఆధునిక కాలంలో చాలా దేశాల వారు బహుళత్వాన్ని కీర్తించారు. అదే సమయంలో ఘర్షణయొక్క అనివార్యతనీ కీర్తించారు. పరిణామంలో పురోగతికి అభివృద్ధికి ఘర్షణ అనివార్యమని భావించారు. సిద్ధాంతీకరించారు.

దీనివల్ల జాతుల సమానత్వం జాతుల విముక్తి ముసుగులో చాలా హింస జరిగింది. అలాగే వేయిపూలు వికసించాలంటూనే ఇతరుల భావాలపట్ల అసహనం, అణచివేత జరిగాయి. కమ్యూనిస్టు రష్యాలో, చైనాలో జరిగిందదే. అమెరికాలో జరిగింది కూడా అదే. శాక్కోవాంజెట్టీకేసే ఇందుకు ఉదాహరణ. విదేశీయులు, విజాతీయులు కావడం వల్లే శాక్కోవాంజెట్టీలు తీవ్ర శిక్షకు గురికావలసి వచ్చిందని, వారిమీద ఆరోపణలన్నీ అబద్ధమని తేలింది. ఇంక అమెరికా లాటిన్ అమెరికాలో తృతీయ ప్రపంచ దేశాల్లో క్రూరమైన విధ్వంసకాండ తెలిసిందే. ఈ హింసని హాలీవుడ్ రాంబో - రామబాణంగా వ్యాఖ్యానించింది. నిజానికి హిందూవాదులతత్వం అమెరికనిజమే.

జీవ శాస్త్రానికి సంబంధించిన డార్వినిజం మాత్రమే కాదు, భౌతిక శాస్త్రానికి సంబంధించిన అన్‌సర్టైనిటీ థియరీకూడా బహుళత్వానికి తలుపులుతెరిచింది. ఇదీ స్యాద్వాదాన్నే పోలివుంది. కాని డార్వినిజంలాగే ఈ భౌతిక శాస్త్ర సిద్ధాంతమూ బహుళత్వాన్ని ప్రతిపాదిస్తూనే బహుళత్వ వినాశనాన్ని సిద్ధాంతీకరించడానికి కారణమైంది. అదీ విచిత్రమైన విషాదం.

జర్మన్ శాస్త్రజ్ఞుడు హైజన్‌బర్గ్ అణువుల స్థితిగతులని గురించి వ్యాఖ్యానిస్తూ, అనిశ్చితత్వాన్ని (అన్‌సర్టైనిటీ) సిద్ధాంతంగా ప్రతిపాదించాడు. ఇది తాత్వికంగా బహుళత్వాన్ని ప్రతిపాదించింది. ఆలోచనలలో బహుళత్వం బహుళ ప్రతి పాదనలకి దారితీస్తుంది. ఏ ప్రతిపాదననైనా సత్యంగా నిర్ధారించదు. అన్నీ

సత్యమయ్యే అవకాశం వున్నప్పుడు ఎవ్రీథింగ్ ఈజ్ పర్మిటెడ్. ప్రతిదీ సబబే అనే సిద్ధాంతానికి దారితీస్తుంది. అప్పుడు న్యాయం, ధర్మం అనేవేవీ లేవు. అందుకే ఈ భౌతిక శాస్త్ర సిద్ధాంతం నాజీయిజానికి మద్దతుగా వ్యాఖ్యానించబడింది.

అద్వైతంలోనూ ఇటువంటి అనిశ్చితత్వమే వుంది. బహుళత్వం వుంది. ఆ బహుళత్వం ధర్మాన్ని రద్దు చెయ్యకూడదని హెచ్చరించారు ఋషులు. ముక్తిపొందిన అవధూత కూడ లోకం కోసం ధర్మ బద్ధంగా న్యాయ బద్ధంగా నియమబద్ధంగా వ్యవహరించక తప్పదన్నారు. లోక సంక్షేమం కోసం యిది అవసరమన్నారు. అద్వైతం తెచ్చే అనిశ్చితిని అరాచకంగా మారకుండా జాగ్రత్త వహించారు.

కాని పాశ్చాత్యంలో సాపేక్షవాదం, అన్‌సర్టైనిటీథియరీ, డార్వినిజం వంటి సిద్ధాంతాలు సృష్టించిన అనిశ్చితి తాత్విక అనిశ్చితికి దారితీసింది. బహుళత్వం తత్వంలోనూ, ఆలోచనలోనూ ఆరాచకత్వంగా మారి, చివరికి నియంతృత్వంగా మారింది.

బహుళత్వం ప్రజాస్వామ్యానికి స్వేచ్ఛకీ దారి. బహుళత్వం అరాచకత్వానికి అరాచకత్వం ద్వారా బలపడగలిగిన నియంతృత్వ శక్తులకీ కూడా రహదారి.

బహుళత్వం వల్ల వచ్చిన సమస్యలని నియంతృత్వం ద్వారా పరిష్కరించడానికి ప్రయత్నించింది కమ్యూనిజం.శ్రామిక వర్గ నియంతృత్వం అనే పేరుని వాడుకలోకి తెచ్చింది. ఆ పేరుతో బలపడింది పార్టీ నియంతృత్వం, చివరికి ఏకవ్యక్తి నియంతృత్వం.

భారతదేశంలో బహుళత్వానికి సనాతన ధర్మంలో చాలా స్థానం వుంది. బహుళత్వం సర్వ అసమానతల్ని తొలగించలేదు. బహుళ అస్తిత్వాలు నిలిచివుండ డానికి, కొనసాగడానికి అవకాశాన్ని కల్పిస్తుంది భారతీయ తత్వం. భారతీయ తత్వంలో నిర్లిప్తత ఈ అవకాశాన్ని సుగమం చేస్తుంది. భారతదేశంలోనూ శైవ వైష్ణవ భేదాలు వున్నాయి. జైన బౌద్ధులపై శైవుల దాడులు జరిగాయి. జైన బౌద్ధాలు కూడా రాజ్యాన్ని ఆశ్రయించుకొని విస్తరించాయి. అలాగే ఇస్లాం కూడా.

ఇక్కడ కులపరమైన అహంకారమూ వుంది. కాని భారత దేశంలో అనాది ఆచార వ్యవహారాలూ సిద్ధాంతాలూ, ఆలోచనలూ పూర్తిగా అస్తిత్వాన్ని పోగొట్టుకోకుండా కొనసాగాయని పరిశీలిస్తే తెలుస్తుంది. ఏ పుట్టలో ఏపాముందో, ఎందరో మహానుభావులు వంటి వాక్యాలు, భగవంతుని చేరడానికి బహుళ మార్గాలు వున్నాయన్న దృష్టీ భారతదేశంలో బహుళత్వానికి ఆధారభూమికలుగా పనిచేశాయి. విస్తృతమైన భూభాగం, బహుళ జాతులూ, బహుళ భాషలూ, బహుళ ఆచారాలు, బహుళ పూజా విధానాలూ భారతీయ బహుళత్వం కొనసాగడానికి అవకాశమిచ్చాయి. అంతేకాదు కేంద్రీకృతమైన వ్యవస్థని దేన్నీ భారతీయులు ఏర్పరుచుకోలేదు. అందువల్ల బహుళత్వమూ అదే సందర్భంలో సమన్వయమూ సాధ్యమవుతూ వచ్చాయి. బహుళత్వమే కాక సమన్వయమూ తాత్వికంగా ప్రతిపాదించబడుతూవచ్చింది.

ఈ బహుళత్వాన్ని రద్దుచేసి క్రైస్తవంలాంటి కేంద్రీకృత ఏకీకృత వ్యవస్థనీ ఏర్పరచాలని సంస్కర్తలు చాలా తాపత్రయపడ్డారు. ఆలోచనలోనూ, ఆచరణలోనూ వ్యవస్థీకరణ కోసం వీరు తపించారు.

దేవదాసీ వ్యవస్థని రద్దుపరచాలనడం యిటువంటిదే. వీరేశలింగంగారినే చూడండి. ఆయన స్వయంగా శృంగార భరిత రచనలు చేశాడు. కాని ముద్దుపళని రాధికాసాంత్వనాన్ని నిషేధించాలన్నాడు. కారణం ఏమిటి? దేవుడికీ శృంగారానికీ ముడిపెడ్తూ కావ్యం రాయడం వల్ల మానవుడికీ, దేవుడికీ తేడాలేకుండా పోతుంది. అందువల్ల దేవుడు కేంద్రంగాగల ఒక వ్యవస్థ అసాధ్యమౌతోంది. దేవుడు లేకపోవడం, అంటే రాజులేని రాజ్యమే. పైగా దేవదాసీ వ్యవస్థ మతానికీ, మానవ వుద్వేగాలకీ దూరాన్ని చెరిపేసి దేవుడి పేరుతోనే దేవుడిని రద్దు పరుస్తోంది అందువల్ల దేవదాసీ వ్యవస్థని రద్దుచెయ్యాలని పట్టుబట్టారు సంస్కర్తలు. వారిది శృంగారంపై వ్యతిరేకత కాదు. క్రైస్తవాన్ని పోలిన వ్యవస్థ కోసం సంస్కర్తలు తపించారు. దానిలో భాగంగానే వారి చర్యలు అన్నిటినీ అర్థం చేసుకోవాలి.

విశ్వనాధ సత్యనారాయణ వేయిపడగలలో రాస్తారు. మనకి దేవుళ్ళు వున్నారు. ఒకే దేవుడు లేడు. ఈ దేవుళ్ళందరూ అన్ని జీవుల్లాగే ముందో వెనకో నశించేవారు. దేవుడు, మతం, దైవవాక్కు లేకపోవడం వ్యవస్థని నిరాకరించింది. బహుళత్వానికి మార్గంగా మారింది.

పాశ్చాత్యంలో ప్రాచ్యతత్వాన్ని అభ్యసించడం వల్ల నూతన వైజ్ఞానిక ఆవిష్కరణల వల్ల బహుళత్వం ఏర్పడింది. నిజమే కాని ఆ బహుళత్వం కూడా దేవుడినీ వ్యవస్థనీ ఆశ్రయించినట్లుగా కనిపిస్తుంది. దేవుడు మరణించాడన్న నీషే చివరికి అధిమానవుడి కోసం దారిని సిద్ధం చేశాడు. అంటే నీషేలో దైవం (సూపర్ మేన్) అధి మానవుడిగా రూపాంతరీకరణని పొందింది కానీ మరణించ లేదు. ఇదంతా మధ్యయుగాల క్రైస్తవ చర్చి ఆధిపత్యం వంటిదాన్నే నూతన రూపంలో ఆవిష్కరించింది అదే నాజీయిజం, కమ్యూనిజం.

బహుళత్వ వ్యక్తీకరణకి అవకాశం యివ్వడం చివరికి ఆ వ్యక్తీకరణని అణచివేసి క్రైస్తవ ఏకత్వాన్ని స్థాపించడం అనేది యూరప్‌లో కనబడ్తుంది. దైవపర ఏకత్వం, అంతిమ తీర్పుల పట్ల ఆసక్తి పాశ్చాత్యంలో నశించలేదు. అది నూతన రూపాన్ని ధరించింది అంతే. ప్రాచ్యంతో సంపర్కంవల్ల బహుళత్వం పాశ్చాత్యంలోకి ప్రవేశించింది. అది వైజ్ఞానిక ఆవిష్కరణల్ని కూడా ప్రభావితం చేసింది. కాని అంతిమంగా ప్రాచ్య బహుళత్వానికి పాశ్చాత్య తీర్పునివ్వడం జరిగింది.

కాని అమెరికా ఈ తీర్పుని రద్దు చేసింది. బహుళత్వం వల్ల వచ్చే అరాచకాన్ని మార్కెట్ స్వేచ్ఛ ద్వారా పరిష్కరించదలచింది. బహుళత్వానికి స్వేచ్ఛే గమ్యం. మార్కెట్ స్వేచ్ఛ. సకలాన్నీ అమ్మకపు సరుకులుగా మార్చివేయడం ద్వారా యిట్టి స్వేచ్ఛ సాధ్యం.

ప్రతిదీ వ్యక్తీకరించబడాలి అంది యూరోపియనిజం. వ్యక్తీకరణకి పెద్దపీట వేసింది. బియింగ్ ఇన్‌ఇట్ సెల్ఫ్‌గా తనలో తానుగా ఏదీ నిలిచిపోకూడదు. నిరంతరం వ్యక్తీకరించబడాలి. అంటే మారుతూవుండాలి. అదే సార్థకత. ఏదీ నిరర్థకంగా మిగిలిపోకూడదు.

అంతర్గత శక్తుల్ని బయటికి తీసుకురావడమే విద్య పరమార్థం అంటాడు వివేకానంద. శక్తుల్ని సంపాదించినా వాటిని వ్యక్తం చేయవద్దు. అది ప్రమాదానికి దారితీస్తుంది అంటుంది భారతీయతత్వం. అణిమాది సిద్ధులు సంపాదించినా వాటిని ఉపయోగించవద్దు. వ్యక్తీకరించవద్దు అంటారు ఋషులు. ఈ తత్వానికి విరుద్ధంగా క్రైస్తవ యూరోపియనిజంలో సంగమించారు వివేకానంద.

భారతదేశంలో వలస క్రైస్తవులు స్థాపించిన రైల్వే వ్యవస్థ తనలో తానుగావున్న గ్రామాల్ని ధ్వంసం చేసి వేసింది. ఆహారధాన్యాలు వలసపోవడం మొదలైంది. దీంతోపాటు మనుషులు కూడా గ్రామాల్లో తమలో తాముగా వుండడం అసాధ్యమైంది. శ్రీకాంత్ నవలలో శరత్‌బాబు ఈ మార్పుని గురించి వ్యాఖ్యానిస్తాడు. గ్రామాల్లో పనిలేకుండా గడిపేయువకులకి స్థానం తరిగిపోవడం మొదలైంది. నిర్దుష్టమైన పనిలేకుండా గడిపే వ్యక్తులు గ్రామంలో అందరికీ చేదోడు వాదోడుగా వుండేవారు. పిలిస్తే పలికేవారుగా వుండేవారు. వృద్ధులకి ఆసరాగా వుండేవారు. ఇట్టి యువకులు తరిమివేయబడ్డారు. విసిరివేయడ్డారు. సార్థకతని, ఉపయోగాన్ని తప్పక వెతుక్కోవలసిన పరిస్థితి ఏర్పడింది. సార్ధకత, ఉపయోగం కలిగిన వస్తువులైనా, మనిషైనా మనగలుగుతాడు. అందుకోసం ఘర్షణ తప్పదు. లేకపోతే అంతరించిపోవడమే.

అంటే ప్రతి వ్యక్తీ తన శక్తుల్ని వ్యక్తీకరించుకోవాలి. అంతర్ముఖీనంగా నిలిచిపోకూడదు. పూర్తిగా బహిర్ముఖుడుగా కావాలి. ఈ దృష్టినుంచే సమాజ శాస్త్రం, చరిత్ర వంటివి పుట్టుకొచ్చాయి. వీటన్నిటినీ అమెరికనిజం రద్దుచేసింది. వ్యక్తిత్వ వికాసాన్ని ప్రోత్సహించింది.

వ్యక్తిత్వ వికాసం అంటే తనని తాను రద్దుచేసుకొని సరుకుగా మారిపోవడమే. ఇది జడభరతుని స్థితే. కాని జడభరతుడు తనలో తానుగా నిలిచిన చైతన్యమూర్తి, నిజమైన చైతన్య స్థితి, నిర్వికల్ప స్థితి అది. అది జీవన్ముక్తి.

అమెరికనిజం బోధించేది పూర్తి జడత్వస్థితి. జడంలోనూ చైతన్యాన్ని చూడడం భారతీయ అద్వైతం. చైతన్యాన్ని కూడా జడంగా చూడడం అమెరికనిజం. అంటే

సరకుగా చూడడం. తనలో తానుగా స్వస్థితిలో వుండడంకాదు. తనిని తానే సరుకుగా మార్చేసుకోవడం అమెరికనిజంలోని అద్వైతం.

భారతీయ విద్యార్థుల కాళ్ళకి సంకెళ్ళు వేసి కంప్యూటర్ చిప్స్ తగిలించారు కొన్ని అమెరికా విద్యాసంస్థల వారు. ఎందుకంటె ఆ విద్యార్థులు జడపదార్థాలే, సరుకులే, వాటి గురించి సమాచారం కోసమే యీ పద్ధతులు. వాళ్ళు సరుకులు కనుక సరుకులతో వ్యవహరించినట్లే వ్యవహరించాలి అంటే దీనిలో మానావమానాల ప్రసక్తి లేదు.

యూరప్ తీసుకువచ్చిన సాహిత్యమూ, కళలూ, సామాజిక శాస్త్రాల అవసరం తరిగిపోయింది. భాషలో విశిష్టత వైవిధ్యం అనవసరం. భాష అంటే ఒక అవసరం మాత్రమే. కాల్‌సెంటర్లు ఇదే సత్యాన్ని బోధిస్తాయి. కంప్యూటర్లు కంప్యూటర్లతో సంభాషించుకుంటాయి. యంత్రాలు యంత్రాల్తో మాట్లాడ్తాయి

యూరప్ వ్యక్తీకరణకి, అర్థానికి ప్రాధాన్యం ఇచ్చింది. జ్ఞానానికి ప్రాధాన్యం ఇచ్చింది. ఈ జ్ఞానం హింసేనన్నారు యూరోపియన్ రొమాంటిస్టులు. ఆ హింస కూడా ముగిసిపోయింది, వ్యక్తీకరణ లేదు, జ్ఞానం లేదు. సరుకుగా మారడం మాత్రమే వుంది. అందరూ తొందరగా మార్కెట్ సరుకులుగా మారిపోవాలి.

చిన్నపిల్లలు కూడా సంవత్సరాలు తరబడి నృత్యాభ్యాసం చెయ్యడం కాదు. తమని తాము అర్జెంటుగా మార్కెట్ సరుకుగా ఎంత అధమపద్ధతిలోనైనా పర్వాలేదు. ప్రదర్శించుకోవాలి. వ్యక్తీకరణ కాదు. సరుకుల ప్రదర్శన. ఇదీ అమెరికనిజం తత్వం.

ఇలా అద్వైతం క్షీణ విధానంలో ప్రదర్శించబడింది. అదే అమెరికనిజం.



# గుళ్ళూ - పబ్‌లూ

ఇటీవలి కాలంలో యువకులు పబ్‌లకి వెళ్ళడం, గుళ్ళకి వెళ్ళడం రెండూ పెరిగింది. వాలంటైన్స్‌డేలు దేవుళ్ళ చుట్టూ ప్రదక్షిణలూ బాగా పెరిగాయి. యువకుల కామవాంఛలే కాదు, లెక్కకు మించిన దేవుళ్ళు కూడా మార్కెట్ సరుకులుగా మారే సూచనలు కనబడ్తున్నాయి. దేవుళ్ళలోని బహుళత్వం వివిధ బ్రాండ్ల ఆధ్యాత్మిక సరుకులుగా అమ్మకానికి పెట్టడానికి వీలుగా వుంది.

భారతీయ దేవాలయాలని క్రైస్తవ వలసవాదులు ఆదాయ మార్గాలుగా భావించారు. పూరీ జగన్నాథ స్వామి రథోత్సవాలని బ్రిటీష్‌వారే వైభవంగా జరిపేవారని, దానికి కారణం ఆ ఆలయ ఆదాయంపై కన్నువేయడమేనని మార్క్స్ రాశాడు.

నిజానికి భారతీయ ఆధ్యాత్మికత ఆలయాల్లో కేంద్రీకృతం కాలేదు. గ్రామాల్లో గృహస్థులు చేసే పూజా పునస్కారాలు, సామూహికంగా జరిపే వివిధ ఉత్సవాలు తిరునాళ్లు వుండేవి. ఆలయ ఉత్సవాలు కూడా వుండేవి. ఏకాంతానికీ సామాజికతకీ కూడా ఆస్కారం వుండేది.

ఇప్పుడు ఆధ్యాత్మికత అంటే ఏకాంతమూ కాదు సామాజికమూకాదు. వ్యక్తిగత లాభదాయకం. ఇంకా చెప్పాలంటే అదొక అమ్మకపు సరుకు.

మత సంస్కర్తలు వలస క్రైస్తవాన్ని అనుకరించారు. ఏకేశ్వరోపాసనని ప్రచారం చేశారు. ఒకే మత వ్యవస్థ కోసం తపన పడ్డారు.

అమెరికనిజం మళ్ళీ బహు దేవతారాధనకి ద్వారాలు తెరిచింది. కొత్త కొత్త బ్రాండ్ల సరుకులని మార్కెట్లోకి నిరంతరం వదులుతూండే అమెరికనిజానికి లెక్కలేనంతమంది దేవుళ్ళు ఆధ్యాత్మిక సరుకులుగా అక్కరకు వచ్చారు. బహుళ దేవుళ్ళకి నిలయాలైన ఆలయాలు కూడా నగరాల్లో వెలిశాయి. ఇవి ఒక్కొక్క

దేవుడి కోసం ఒక్కొక్క దేవాలయానికి వెళ్ళవలసిన కష్టాన్ని తగ్గించి రిలయన్స్ షాపింగ్‌మాల్స్‌ని తలపించాయి. ఈ దేవతలు ఇచ్చు వరాలుకూడా కొత్తవి. పుత్రపౌత్రాభివృద్ధి కాదు. సంపద కాదు. భూమికాదు. అమెరికాకి వీసాలు, డాలర్లూ వరాలుగా ప్రసాదించడం మొదలుపెట్టారు కొత్త దేవతలు. ఈ కొత్త దేవతలతో పోలిస్తే క్రైస్తవం వెనకబడిపోయింది. యూరప్‌లానే. భారతీయతత్వం మార్కెట్‌కు అనుకూలమైందని కొందరు అమెరికన్ మేధావులు ప్రకటించడం గమనార్హం. (పోస్ట్ అమెరికన్ వరల్డ్ - ఫరీద్ జకారియా)

బహుళత్వం మార్కెట్ సరుకుగా మారిపోవడంతో భారతీయతత్వం సారాన్ని కోల్పోయింది. పిప్పిలా మిగిలింది. అందుకే భారతీయ తార్కికత వెనకబడింది. మూఢభక్తి పెచ్చుమీరింది. నిజానికి మూఢభక్తిలా నేడు కనబడేది అతి తెలివితో మెదడుని మొద్దుబార్చే వైఖరే. సరుకుల వ్యామోహం తప్ప నేడేమీ మిగల్లేదు. కాశ్యాంతు మరణాన్ముక్తిః కాశీలో మరణిస్తే ముక్తి లభిస్తుంది లాంటి నమ్మకాలు నశించాయి. కాలిఫోర్నియాకి వెళ్ళే వరం కోసం దేవతలు అవసరమయ్యారు.

నమ్మకాలు బాగా పెరిగాయి. వాటి స్వభావం కూడా మారింది. రాజుల సొమ్ము రాళ్ళపాలు అంటారు. ఇప్పుడు రాజులు కాదు అందరూ రంగురాళ్ళలో అదృష్టాన్ని వెతుక్కుంటున్నారు. వాస్తుకి పూర్వం కంటె ఎన్నోరెట్లు ప్రాధాన్యత పెరిగింది. అక్షయ తృతీయలూ, వాలెంటైన్స్‌డేలూ రెండూ మార్కెట్టులో అమ్మకాల్ని పెంచడానికి ఉపయోగిస్తున్నారు.

ఆధ్యాత్మికత కూడా లాభసాటి వ్యాపారంగా మారిపోయింది. అది అంతర్ముఖత్వంలోకాదు బయటి వస్తుజాలంలోనే కనుగొనబడుతోంది.

కుల మత వర్గ తారతమ్యాల సరిహద్దుల్ని దాటేశారు ఆధునిక ఆధ్యాత్మిక వేత్తలు. తద్వారా వారు ఆధ్యాత్మికతని అంతర్జాతీయ సరుకుగా మార్చగలిగారు.

భారతీయులు వలస క్రైస్తవాన్ని దాటి అమెరికనిజాన్ని ఆశ్రయించారు. ఆధ్యాత్మికత కూడా అమెరికనిజం వైపే పయనిస్తోంది. బహుళ దేవతలు, బహుళ సరుకులుగా రూపాంతరం చెందాయి. తర్క రాహిత్యమే భక్తిగా చలామణిలోకి వచ్చింది. దీనిని భారతీయ అమెరికనిజం అనవచ్చు.

# వేగం - రోగం

ఆధునిక యుగంలో వేగానికి ప్రాధాన్యత పెరిగిపోయింది. వేగం, వేగం, మరింత వేగం, వేగం అనేది జీవించడానికి సమయం లేకుండా చేస్తోంది అన్నారు మిత్రులు పిల్లుట్ల శ్రీనివాస్.

ఈ వాక్యానికి మృత్యుంజయరావు గారు ఒక గ్రీకు తాత్విక వాక్యాన్ని జతచేశారు. ఒకే నదిలో రెండుసార్లు పాదాలు కడగలేము అని ఒకసారి కూడా కడగలేము అని ముక్తాయించారు.

అసలు సమస్య జీవితం క్షణికం. వేదాంతులు కూడా ప్రపంచాన్ని అనాత్మ అని అన్నారు. నిలకడలేని తనం ప్రపంచ లక్షణమే. కాని నిలకడలేనితనాన్ని ప్రాచీన తాత్వికులు ఆరాధించలేదు. మోక్షం కోసం, నిర్వాణం కోసం అన్వేషించారు. అంతా అనిత్యమే కనుక ఈ క్షణమే సత్యమని వారు అనలేదు. పరుగుని పరమ పవిత్రమైనదానిగా నిర్వచించలేదు.

క్షణిక వాదమూల పురుషుడు బుద్ధుడుకూడా ధర్మాన్నీ, నిర్యాణాన్నీ రెండింటినీ బోధించాడు. ఆ రెండిట్లో మొదటిది వ్యావహారికం, రెండవది పారమార్థికం. ధర్మమూ, నిర్యాణమూ రెండూ స్థితి బోధకాలే.

ఏమాత్రం పట్టుబడని క్షణికత్వం, నశ్వరత్వం అంతరంగికమైన స్థిత ప్రజ్ఞతని ప్రేరేపించాయి. స్థిత ప్రజ్ఞతే క్షణికత్వాన్ని అవగతం చేసుకోగలదు. క్షణికత్వంలోని సౌందర్యాన్ని కూడా అవగతం చేసుకోగలదు. ఈ లోపలి నిలకడతనానికి ఆధారాన్ని మాత్రం పట్టుకోలేం. ఆధార ఆధేయభావం వున్న ప్రతీదీ క్షణికత్వంలోకి జారిపోతుంది. అందుకే బుద్ధుడు నిర్వాణాన్ని నిర్వచించలేదు. ఉపనిషత్తులు మోక్షాన్నీ నిర్వచించలేదు.

యూరోపియన్ వాస్తవికత అనేక ముక్తిమార్గాల్ని ఆదర్శాలుగా తీసుకు వచ్చింది. వేగంద్వారా అవి సాధించబడ్తాయని బోధించింది. మరింత ఉత్పత్తి మరింత వేగవంతమైన యాంత్రిక ఉత్పత్తి. ఇదే సోషలిజానికి ప్రాథమిక షరతు అని మార్క్సు అన్నాడు.

కాని ఉత్పత్తి వేగం, వేగవంతమైన ఉత్పత్తి సరకుల్ని మేటవేసింది. చివరికి ఆ సరుకులు మనిషిని మింగేశాయి. క్రమేపీ సోషలిజం అనే పదాన్ని కూడా ఉచ్చరించడానికి సమయం లేకుండా పోయింది. అదే సరుకుల స్వేచ్ఛ అదే అమెరికనిజం.

వేగం, మరింత వేగం ముక్కలు ముక్కలైన సంఘటనల్ని మిగిల్చింది. ముక్కలు ముక్కలైన పదజాలాన్ని మిగిల్చింది. సంగీతంలోనూ, సాహిత్యంలోనూ ఈ పరిణామం కనబడ్తోంది. వ్యక్తిగత జీవిత చిత్రణకి ప్రాధాన్యం పెరగడం దీనిలో భాగమే. ఈ క్షణిక జీవిత సంఘటనల వెనుక ఒక తాత్వికతని పట్టుకోవడం అసాధ్యంగా మారిపోయింది. కె. బాలగోపాల్ వంటి మేధావులు కూడా తాత్విక వ్యాఖ్యానాల్ని ముగించేశారు. సంఘటనల్ని చిత్రిస్తూ వచ్చారు. ఆ చిత్రణలో ఆవేశం పాలు వుండవచ్చు అంతవరకే.

ఈ సంఘటనల చిత్రణ వేయిపూలు వికసించడంగా కన్పిస్తుంది. బహుళ అస్తిత్వాల వ్యక్తీకరణగా భ్రాంతి గొలుపుతుంది. కాని ఇది వ్యక్తీకరణకి ముగింపు. వ్యక్తీకరణకి మరణ ఘంటిక మోగడమే.

ప్రపంచ క్షణికత్వం వెనుక అస్తిత్వాన్ని స్థిత ప్రజ్ఞతతో వీక్షించినవాళ్ళే తాత్వికులు. ఆ క్షణికత్వ ప్రవాహంలో కొట్టుకుపోతూ అదృశ్యమయ్యేవాళ్ళు, ఆ అలల ఒడిదుడుకుల్ని కేవలం వర్ణిస్తూ కాలం గడిపేవాళ్ళు తాత్వికులు కారు. చలం మ్యూజింగ్స్‌లో అతని తాత్విక విశ్వరూపం కనబడ్తుంది. గోపీచంద్ అసమర్థుని జీవిత యాత్రలో అతని తాత్విక ప్రయాణం గోచరమవుతుంది. కాని సంఘటనలు కుప్పబోస్తూ కన్నీళ్ళు ఒలకబోస్తూన్న నేటి చప్పన్నారు జాతుల రచయితల్లో తాత్వికత శూన్యం. వారు చివరికి యూరప్ తెచ్చిన వ్యక్తీకరణని

కూడా ముగించేసి, అమెరికనిజంలో కలుస్తున్నారు. ఈ బహుళత్వపు వేగం అమెరికనిజంలో కలవడానికే.

అమెరికనిజం వేగాన్ని వేగవంతంగా పెంచేసింది. ఆ వేగంలో మానవ ఇంద్రియాలూ, బుద్ధీ శబ్దజాలమూ సర్వమూ ముక్కలు ముక్కలై పోయాయి. వాటినుంచి గొప్ప తాత్విక ప్రతిపాదనలు అసాధ్యం. ఆ వేగం జీవనతత్వాన్ని నశింపజేస్తుంది. అందుకే చెప్పేదేదో వేగంగా చెప్పెయ్ అంటున్నారు నేటి యువకులు. పాడే పాటని వేగంగా పాడెయ్ అంటున్నారు. అర్థమూలేదు. అంతర్ముఖత్వమూ లేదు. వేగం మాత్రమే మిగిలింది.

కాని నైషధ కావ్యకర్త శ్రీహర్షుడు అన్నదేమిటి? తన కావ్యంలో గ్రంథ గ్రంథులని, చిక్కుముళ్ళని ఉంచానని చెప్పాడు. తన గ్రంథాన్ని అలవోకగా కాక కష్టపడి బుద్ధి పరిశ్రమచేసి అధ్యయనం చెయ్యాలని ఆయన భావించాడు. ఇప్పుడు పుస్తకాలు రాసేవాళ్ళు అధ్యయనం చెయ్యడానికి కాదు, చూడ్డానికి, చదవడానికి మాత్రమే రాస్తున్నారు. దీనికి సరళత్వమనే దొంగపేరు పెడ్తున్నారు. యూజ్ అండ్ త్రో రచనలే బహుళత్వపు ఫోజునిస్తూ వూరేగుతున్నాయి. తాత్వికతని గాలికి వదుల్తున్నాయి. జీవితాన్నే సాహిత్యం ప్రతిబింబిస్తున్నదన్న వ్యాఖ్యానం ఇక్కడ నిజమౌతోంది. జీవితాన్ని సాహిత్యం మార్చేస్తుందన్న వ్యాఖ్యానమూ నిజమౌతోంది. ముందుచూపు లేదు. దిశానిర్దేశమూ లేదు. గుడ్డి మార్పు మాత్రమే వుంది. అంతర్దృష్టిలేని వట్టి చూపు మాత్రమేవుంది. వేగంగా బైక్‌మీద పోతూ యథాలాపంగా అనేక దృశ్యాల్ని చూస్తాం. క్షణకాలం స్పందిస్తాం. లేక స్పందించం. సాహిత్యమూ అలాగే మారిపోయింది, నిర్వాణం లేదు, మోక్షం లేదు. దమ్మం, ధర్మం లేనేలేదు. వేగమే మిగిలింది. వేగం, మరింత వేగం, మృతప్రాయమైన వేగం జీవితం ఫోజిస్తోంది. అదే అమెరికనిజం.



# నవ్వు అనారోగ్యకరం

యజ్ఞ దీక్షలో వున్నవారు నవ్వకూడదు. ముఖ్యంగా గర్వంతో నవ్వకూడదు. ఇలా నవ్వడం వల్ల విష్ణుమూర్తి తేజస్సుని కోల్పోయాడని కృష్ణ యజుర్వేద ఆరణ్యకం బ్రాహ్మణంలో ఒక కథ వుంది.

నవ్వు ఆరోగ్యాన్నిస్తుందనే పేరుతో లాఫింగ్ క్లబ్‌లు మొదలయ్యాయి. నవ్వు కోసం, ఆనందంకోసం కోలాహల పూరితమైన కృత్రిమ ఉత్సవ వాతావరణం పెరిగింది. ఆరోగ్యమూ, ఆనందాలకోసం వెంపర్లాట పెరిగింది

**సర్వేపి సుఖినస్సంతు**
**సర్వే సంతు నిరామయాః**
**సర్వే భద్రాణి పశ్యంతు**
**మాకశ్చిత్ దుఃఖ భాక్ భవేత్**

అందరూ సుఖంగా ఆరోగ్యంగా వుండాలన్న స్పృహపోయింది. కనీసం తన కులంవాళ్ళు, తన వూరివాళ్ళు ఆనందంగా వుండాలన్న ఆలోచన పోయింది. తన ఆనందం అనే భావనలేదు. తన శరీరం సుఖంగా ఆరోగ్యంగా కండలు తిరిగి రంగుతేలి వుండాలన్న స్పృహ పెరిగింది. లోపలి ఆనందంకాదు. తన ముఖంలో ఆనందం ప్రదర్శించబడాలనే తపన పెరిగింది. తనొక ఆనంద వ్యక్తీకరణగా కూడా కాదు. దృష్టి నాకర్షించే సరుకుగా ప్రదర్శించబడాలన్న తపన పెరిగింది.

ఇంగ్లీషు వలసవాదం వల్ల భారతీయ గతాన్ని వ్యంగ్య హాస్యాలతో నిరాకరించే వ్యక్తీకరణ పెరిగింది. ఆ దశ ముగిసిపోయి నవ్వుల్ని హాస్యాన్నీ సరుకుగా చూసే అమెరికనిజం నేడు రాజ్యమేలుతోంది.

తెలుగు వాళ్ళకి హాస్య దృష్టి ఎక్కువ. సినీ హాస్య నటులూ ఎక్కువే. కాని గాంభీర్యమూ లోతూ తక్కువ. తాత్త్వికత కరువైపోయింది. దీనికి కారణం తెలుగు వారిలో వ్యాపార దృష్టీ, లాభ దృష్టీ ఎక్కువ అనిపిస్తుంది. దానికి కారణం సాంప్రదాయకతనీ స్మృతినీ ధిక్కరించి వ్యాపారాన్ని ప్రోత్సహించిన బౌద్ధ, జైనాల ప్రభావం చిరకాలం కొనసాగడమేననిపిస్తుంది. దీనివల్ల మనలో వలసపోయే దృష్టీ, వ్యాపార దృష్టీ పెరిగిపోయాయి. దేనితోనూ బంధం లేకుండా పోయింది.

అందుకే మనకి లాభాన్ని కూర్చే సినిమా తప్ప నాటకం బలంగా ఎదగలేదు. సాహిత్య కోలాహలమే తప్ప సాహిత్య వాతావరణం లేదు. ఇతర సోదర ద్రవిడ భాషల వారితో పోల్చిచూసినా యీ సంగతి అర్థమవుతుంది.

ఎందుకంటే వ్యాపారదృష్టి జీవన గాఢత్వాన్ని తగ్గించివేస్తుంది. కోలాహలాన్ని పెంచుతూపోతుంది. అందుకే మనకి అమెరికనిజం తెచ్చిన బహుళత్వమే తప్ప సహజ బహుళత్వం లోపించింది.

ప్రాచీనమైన పండగలలో ఋతువులు తెచ్చే మార్పు ప్రధానమైనది. గ్రామీణ బంధాలు ముఖ్యమైనవి. పి.సి. జోషీ అనే కమ్యూనిస్టు మేధావి కొన్ని దశాబ్దాల క్రితం ఉత్తరాదిలోని జాట్‌లు నివసించే గ్రామాలని కొన్నిటిని పరిశోధించాడు. ఆయన చెప్పిందేమిటంటే గ్రామాలలో వివిధ కులాల వారిమధ్య ఎంతదూరం వున్నప్పటికీ అంతర్గతంగా ఒక అనుబంధం, ఐక్యత కొనసాగుతోంది. క్లిష్ట పరిస్థితుల్లో అది సహజంగా బహిర్గతమౌతోంది. నేననేదేమిటంటే - మన పండగల ద్వారా ఈ లక్షణాన్ని మరింత బలోపేతం చెయ్యాలి. కాని ఇప్పుడు పండగల్ని మార్కెట్ నిర్దేశిస్తుంది. ఎలక్ట్రానిక్ మీడియా ప్రచారం ప్రభావితం చేస్తుంది. పండగలు వ్యవసాయం నుంచి ఋతుక్రమం నుంచి విముక్తమై మార్కెట్‌కి అనుసంధానించబడ్డాయి. సరుకుల అమ్మకాలకి అనువైన సమయంగా మారిపోయాయి. సహజమైన సంతలు, తిరునాళ్ళ ప్రాధాన్యత తగ్గిపోయింది.

ఇప్పుడు పండగలు వ్యాపార కోలాహలంగా మారిపోయాయి. గ్రామాంతరాలకి వెళ్ళిన వాళ్ళందరూ కలుసుకొనే అనుబంధం మృగ్యమైంది.

పండగ అంటే నగరానికి పోయి మార్కెట్లో సరుకులుకొనే సమయంగా మారిపోయింది. డిస్కౌంట్లు లభించేకాలంగా మారింది.

**నాకు ఉగాదులు లేవు నాకు ఉషస్సులు లేవు**
**నేను అనంత తిమిరలోకైకపతిని**

అనడానికి వీలులేదు. భయంకరమైన వ్యాపారకాంతి, తిమిరానికి అస్కారం లేకుండా చేసింది. కోలాహలం నుంచి తపస్సులోకి తమస్సులోకి నిష్క్రమించడానికి వీలులేదు.

చీకటిని కీర్తిస్తూ దాశరథి పద్యాలు రాశాడు. విశ్వనాధవారు వేయి పడగలలో తిమిరంయొక్క గొప్పతనాన్ని కీర్తించారు.

ఎలక్ట్రిక్ దీపస్తంభాలు వచ్చి చెట్లులేకుండా చేశాయని రోదించారు.

ఇప్పుడు ఎక్కడ చూసినా వెల్తురే, కోలాహలమే. నవ్వకూడదు, పైగా గర్వంతో అసలే నవ్వకూడదు. నవ్వు వల్ల విష్ణుమూర్తే భ్రష్టు పట్టిపోయాడు అని వైదిక ధర్మం ఘోషిస్తుంది.

కృత్రిమ నవ్వులు, వెకిలి నవ్వులు, యాస నవ్వులు, భాషల్ని, ప్రాంతాల్ని పరిహసించే నవ్వులు, వృత్తుల్ని, ధర్మాల్ని పరిహసించే నవ్వులు నవ్వులు నవ్వులు నవ్వుల కోలాహలం.

నవ్వు నాలుగు విధాల చేటు. కాని ఇప్పుడు వ్యాపారానికి నవ్వు కావాలి. నవ్వుల కోలాహలం కావాలి. నవ్వే మొహాలు మాత్రమే అమ్ముడు పోతాయి. ఆత్మ విశ్వాసంతో తొణికిసలాడ్తాయి. ఆత్మమీద విశ్వాసంలేని వాళ్ళు కేవల దేహాత్మ వాదులు ఆత్మ విశ్వాసపరులుగా కనబడడం నేటి విషాదం. అదే అమెరికనిజం.



# అమ్మ ప్రేమలో అమెరికనిజం

ఆధునిక కాలంలో కరుణ అనేపదం దుర్వినియోగమైనంతగా మరేదీ కాలేదు.

వలస క్రైస్తవులు ఒక చేత బైబిల్ మరోచేత తుపాకీ ధరించి వచ్చారు. తుపాకీ హింసకి, బైబిల్ కరుణకి సంకేతాలు. తుపాకీని వుపసంహరించుకున్నా బైబిల్‌ని వదిలిపోయారు.

మొదట క్రైస్తవం భారతీయులని సంస్కరించింది. వారి విద్యా విధానాన్ని, ఆలోచనల్ని మార్చేసింది. ఈ క్రమంలో క్రైస్తవ సామ్రాజ్యానికి సమ్మతిని చేకూర్చింది. క్రైస్తవ హింసపైన కరుణని ముసుగులా కప్పింది.

స్వాతంత్ర్యానంతరం క్రమేపీ అమెరికన్ ఆలోచనా విధానం బలపడ్తూ వచ్చింది. మార్కెట్ స్వేచ్ఛే ప్రధానమైపోయింది. అన్ని విలువలనీ కాలరాసే అమెరికన్ మార్కెట్ స్వేచ్ఛకి క్రైస్తవం ఒక ముసుగులా ఉపయోగపడింది. ఈ దశలోనే మదర్‌థెరిస్సా ఆవశ్యకత వచ్చింది.

భారతదేశం అతిపెద్ద మార్కెట్. ఇక్కడ కొల్లగొట్టదగిన వనరులూ అధికమే. ఈ క్రమంలో విదేశాల నుంచి, అమెరికానుంచి పెట్టుబడిదారులు నెమ్మది నెమ్మదిగా అరబ్ ఒంటెలా తలదూరుస్తూ వచ్చారు. తమ వ్యాపార ప్రయోజనాలే పరమావధిగా ప్రవర్తిస్తూ వచ్చారు. వారి ప్రభుత్వం కూడా వ్యాపారస్తుల ప్రతినిధే. ఈ వ్యాపారం తీసుకు వచ్చే పర్యావరణ కాలుష్యం, అసమానతలు, రోగాలు అనంతమైనవి. ప్రపంచ వ్యాప్తంగా వ్యాపార సామ్రాజ్యాల కోసం అమెరికా సృష్టించిన యుద్ధ బీభత్సమూ అపారం.

ఈ పాపాలని కప్పిపుచ్చడానికి రాజకీయభావాలూ, స్వతంత్ర ఆలోచనయేదీ లేని శుద్ధకరుణ ఆచ్ఛాదనగా అవసరమైంది. అటువంటి ముసుగే మదర్‌థెరిస్సా. రోగులపట్ల, దీనులపట్ల అంతులేని కరుణ, ఆ రోగాలకీ, దీనత్వానికీ

మూలకారణాన్ని వెతక్కుండా అడ్డుపడ్తూ వచ్చింది. సరిగా ఇటువంటి కరుణే అమెరికాకీ అమెరికానంతర యూరప్‌కీ కూడా అవసరమైంది.

వలస క్రైస్తవం ఆధునిక విద్యనీ సంస్కరణనీ వెంటతెచ్చింది. కాని వలస వాదానంతరం రంగప్రవేశం చేసిన మదర్ థెరిస్సా ప్రధానంగా కరుణనే దైవ స్వరూపంగా చూపుతూ వచ్చింది. మార్కెట్టే సర్వస్వంగా లాభాపేక్షే ప్రధానంగా అమెరికనిజం బలపడ్తూవచ్చింది. అమెరికనిజం విషయంలో రాజ్యం కూడా ద్వితీయం. మార్కెట్టే ప్రథమం. క్రైస్తవ యూరప్ పాత ఫ్యూడల్ రాచరిక వ్యవస్థ లక్షణాల్ని కొంత నిలుపుకుంటూ వచ్చింది. ఇంగ్లాండ్ రాణికి ప్రాధాన్యం ఇస్తూ వచ్చింది.

చరిత్రలేని అమెరికాకి అటువంటి చారిత్రక గత భారాన్ని మోయవలసిన అవసరం లేదు. అందువల్ల క్రైస్తవం సువార్తవ్యాప్తి వంటి మతపరమైన విలువల అవసరమూలేదు. దానికి కావలసినది మతంకూడా వ్యాపార విస్తరణకి ఆలంబనగా నిలిస్తే దానిని కూడా వుపయోగించుకోడమే. అమెరికా ప్రభుత్వం వెనుక ప్రొటెస్టెంట్ క్రైస్తవుల ప్రభావం వుంటుంది. నిజమే కాని అది పూర్తిగా వ్యాపార క్రైస్తవం.

వలస క్రైస్తవానికి కొన్ని విలువలు వున్నాయి. అవేమిటంటే పాలితుల్ని సంస్కరించడం, క్రైస్తవీకరించడం, తాము అనుకొన్న రీతిలో విద్యావంతుల్ని చేయడం. కాని అమెరికాకి వ్యాపారమే విలువ. ఈ వ్యాపారం కోసం ఎంతటి క్రౌర్యానికైనా, దుర్మార్గానికైనా తెగబడ్తుంది. యూరోపీయ వలస క్రైస్తవం కంటె అమెరికాలో వంచన పాలు ఎక్కువ. సూటిగా జయించడం కాక ప్రభుత్వాల్నీ, వ్యవస్థల్నీ అస్థిరం చేసి పరాధీనంగా మార్చి తన వశంలోకి తెచ్చుకుంటుంది అమెరికా. తాను ఆయా వ్యవస్థల్లోకి సూటిగా ప్రవేశించకుండా అంతర్గత సంక్షోభాల్ని తనకి అనుగుణంగా మార్చుకుంటుంది. ఆ అంతర్గత సంక్షోభంలో ఏదో ఒక పక్షం వహించి పెద్దన్న పాత్ర వహిస్తుంది. ఇదంతా తన వ్యాపార ప్రయోజనం కోసమే.

అమెరికా మతపరమైన, రాజకీయ పరమైన సకల పదజాలాన్నీ వదిలి పెట్టేసింది. దానికి తెలిసిన పదం ఒకటే స్వేచ్ఛ. స్వేచ్ఛ అంటే తన వ్యాపారానికి అన్ని దేశాల తలుపులూ వాళ్ళంతట వాళ్ళే బార్లా తెరుచుకుని అమెరికనిజానికి ఆహ్వానం పలికే స్థితికి తీసుకురావడం.

అమెరికా సోవియట్ ప్రతిఘటనని ఎదుర్కొంటున్న కాలంలోనే, అమెరికా లాంటి దేశాలకి నైతిక మద్దతు పలికింది మదర్ థెరిస్సా. అదెలాగంటే-రీగన్ లాంటి యుద్ధోన్మాదులు ఆయుధ వ్యాపారులనుంచి ధనాన్ని, సత్కారాల్నీ, బిరుదుల్నీ కూడా స్వీకరించింది మదర్ థెరిస్సా. దీనివల్ల కరుణకి హద్దులు లేవని ప్రకటించింది. వారు తనకి గుర్తింపునిచ్చారు, డబ్బునిచ్చారు. వాటిని స్వీకరించి వారివలనే గాయపడ్డ దేశాలలోని దీనులకి సేవచేసింది. అమెరికా సైనికులు ఇరాక్ యుద్ధంలో తీవ్రంగా గాయపడిన బాలుడికి తామే స్వయంగా చికిత్స చేయించారు. తామే కాలుకూడా అతికించారు.

గాయపరచడం తప్పనిసరి. ఆ గాయాలకి మందు పూయడమే కరుణ. ఈ క్రమంలో గాయపరచిన దుర్మార్గుల దుష్ట బుద్ధిని నిలదీయనక్కరలేదు. వారి ప్రపంచ వ్యాప్త దౌర్జన్యాలని ప్రశ్నించనక్కరలేదు. వాటన్నిటిపట్లా మౌనం వహించ వచ్చు. పైగా వారివద్ద ధనాన్నీ, సత్కారాల్నీ బిరుదుల్నీ కూడా నిశ్చింతగా పొందవచ్చు. ఇదంతా కరుణలో భాగమే.

మదర్ థెరిస్సా యేర్పరచిన ఈ దారి అమెరికన్ బిలియనీర్లకి రహదారిగా మారింది. అవధిలేని లాభాపేక్ష వ్యవస్థలనే సంక్షుభితం చేసే వ్యాపార విస్తరణ వీరి హృదయం. అదే సమయంలో తృతీయ ప్రపంచ దేశాల్లో విస్తరించిన ఎయిడ్స్ లాంటి వ్యాధుల చికిత్సకోసం కోట్లాది డాలర్లు గుమ్మరించి తమ కరుణాపూరితమైన ముఖాన్ని ప్రదర్శిస్తూంటారు అమెరికన్ వ్యాపారులు. దీనికి రాచబాట వేసింది థెరిస్సాయే. దుర్మార్గమైన వ్యాపార స్వేచ్ఛకి ముసుగే యీ కరుణ. అమెరికనిజానికి ముసుగే యీ కరుణ.

విచక్షణా రహితమైన కరుణ అణ్వాస్త్రం కంటే దుర్మార్గమైనది.

చరిత్రలో రాజకీయాలు, భావాలు, సిద్ధాంతాలూ వీటితో వేటితోనూ సంబంధంలేని శుద్ధ కరుణ అనేది అమెరికనిజానికి కలసివచ్చిన వరం. ప్రపంచ బ్యాంకు చూపేది ఇటువంటి కరుణే. కాని ఈ కరుణ వెనుక భయంకరమైన సామ్రాజ్యవాదం పొంచి వుంటుంది. స్థానిక వ్యవస్థల్ని అస్థిరపరచే వంచన దాగి వుంటుంది.

గాంధీ మహాత్ముని అహింసా సిద్ధాంతం ఇందుకు భిన్నమైనది. గాంధీ మహాత్ముని అహింస నుంచి మదర్ థెరిస్సా కరుణలోకి జరిగిన ప్రయాణం స్వాతంత్ర్యం నుంచి పారతంత్ర్యంలోకి జరిగిన ప్రయాణమే.

అసలు గాంధీ స్వాతంత్ర్యం తెచ్చాడా అనేది కాదు అసలు ప్రశ్న. స్వాతంత్ర్యం నిజంగా వచ్చిందా అనేది. ఐతే గాంధీ చర్యలకంటె ఆయన సృష్టించిన ఇమేజ్ ప్రధానమైనది. చారిత్రక గాంధీ కంటె పౌరాణిక గాంధీ ప్రధానమైనవాడు. అందువల్లనే ఐన్‌స్టీన్ అన్నాడు. అసలు అటువంటి వ్యక్తి భూమిమీద సంచరించాడా అని ముందు యుగాలు సందేహిస్తాయన్నాడు. ఎందుకంటే గాంధీ ఆచరణ నిష్క్రియతో సమానమైనది. అది ప్రతీకాత్మకమైన అలంకారికమైన ఆచరణ. చరఖా, సత్యాగ్రహం, నిరాహారదీక్షలూ, ఉపవాసాలూ, భజనలూ ఇవేవీ ఆచరణగా గుర్తించదగ్గవి కాదు. మావో లాంగ్‌మార్చ్ లాంటి ఆచరణలుకాదు.

అందువల్ల గాంధీని తిరస్కరించడం చాలా సులభమేకాని ఆయన జీవితం కన్న మరణం అమరత్వాన్ని పొందింది. సహన శీలతకీ, కరుణ భావానికీ సర్వభూతదయకీ ఒక సనాతన విశాలదృక్పథానికి స్వదేశీయుడే శత్రువుగా నిలబడ్డాడు. అంటే శత్రువు బయటలేడు. అతడు లోపలే వున్నాడు. అంతరంగీకరించబడ్డాడు. ఇంటి దొంగని ఈశ్వరుడైనా పట్టలేడని నిరూపించాడు గాడ్సే. ఈశ్వర్ అల్లా తేరేనామ్ అన్నందుకు గాంధీ హత్యకు గురయ్యాడు. ఆయన పద్ధతిలోనే ప్రతీకాత్మక ఉద్యమం చేసిన నల్లజాతి నాయకుడు మార్టిన్ లూథర్ కూడా హత్య చేయబడ్డాడు.

గాంధీ చనిపోయి బతికిపోయాడు. గాంధేయవాదం విఫలమైందని మనం సులభంగా నిరూపించవచ్చు. ఈ వైఫల్యాన్ని నిరూపించడం ద్వారా మరేవాదమైనా యెక్కడైనా సఫలమైందని మాత్రం నిరూపించలేం. అసలు సాఫల్య వైఫల్యాల మౌలిక అర్థాన్ని వెతికి పట్టుకోవడం అసాధ్యం.

గాంధీకి చారిత్రకంగా వున్న ప్రాధాన్యతకంటె ప్రతీకాత్మకమైన ప్రాధాన్యత ఎక్కువ. గాంధీ వలసవాదాన్ని వలసవాద ప్రమాణాలతో ఎదిరించడానికి నిరాకరించాడు. ఈ క్రమంలో ఒకొక్కసారి ఉద్యమాల్ని విరమించి స్వాతంత్ర్యాన్ని వాయిదా వేస్తూ వచ్చాడు కూడా. ఈ విషయంలో తీవ్ర విమర్శకి కూడా గురయ్యాడు.

గాంధీ ప్రాధాన్యమిచ్చిన చరఖాని జాతీయజండాలో చేర్చాలని మొదట భావించారు. కాని చివరికి విరమించుకొన్నారు. ఇలా విరమించుకోవడాన్ని హిందూత్వవాది వీరసావర్కార్ కూడా సమర్థించాడు. గాంధీ ప్రాణంగా భావించిన చరఖాని మరుగుపరచడం ద్వారా గాంధేయ ప్రతీకలనీ ఆయన బోధించిన గ్రామ కేంద్రిత నిరాడంబర నాగరికతనీ తిరస్కరించింది భారత ప్రభుత్వం. చక్రం ద్వారా చలనమే ప్రధానమంది.

గాంధీ చారిత్రకంగా పరాజయం పాలయ్యాడు. గాంధీని ఇప్పుడు ఎక్కడా వెతికిపట్టుకోలేం. కాని ఆయన సృష్టించిన ప్రతీకాత్మకత ప్రపంచ ప్రజల హృదయాలలో ఎక్కడో తచ్చాడుతూ వుంటుంది.

చర్యకాదు ప్రతీకాత్మక చర్య ప్రధానమైనది అని బోధించాడు గాంధీ. ఆ ప్రతీకాత్మకతని ఆధునిక నాగరికతకి ప్రత్యామ్నాయంగా నిలిపాడు. అదొక దిక్సూచి అంతే.

కాని మదర్ థెరిస్సా విషయంలో ప్రతీకాత్మకత కాదు. చర్యే ప్రధానం. క్రియే ప్రధానం. ఎంతమంది రోగుల్ని స్వస్థపరిచామనేదే ప్రధానం. దానికోసం ఎంత ఎక్కువ ధనం వెచ్చించామనేదీ ముఖ్యం.అంతేకానీ ఆ కరుణ ముసుగులో బలపడ్తున్న శక్తులేవీ అనేది ప్రధానం కాదు. అట్టి విమర్శ అనవసరం. ఆమె మతోన్మాదుల్ని విమర్శించలేదు. సామ్రాజ్య వాదులనీ, నియంతలనీ విమర్శించ

లేదు. వారి ధనంతో, అండదండలతోనే సేవా కార్యక్రమాల్ని నిర్వహించింది. వారి సత్కారాల్నీ పొందింది. ఈ స్వచ్ఛ కరుణ ప్రాణాంతకమైనది.

చర్యలు కాదు వాటి పర్యవసానాలు చాలా ముఖ్యమైనవి. క్రియ కాదు దాని ప్రభావం ముఖ్యమైనది. అది రేపే భావాలూ, ఆలోచనలూ ముఖ్యమైనవి.

ఈ సందర్భంగా పశ్చాత్తాపంతో ఆత్మహత్య చేసుకొన్న ఫోటోగ్రాఫర్ ఉదంతాన్ని స్మరించడం సమయోచితమని భావిస్తాను. 1994లో Kevin Carter (కెవిన్‌కార్టర్)అనే ఫోటోగ్రాఫర్ దక్షిణ ఆఫ్రికాలో ఒకచోట కరువుతో చనిపోవడానికి సిద్ధంగా వున్న బాలికని చూశాడు. చనిపోగానే తినివేయడానికి సిద్ధంగా వుంది ఒక రాబందు. ఈ ఘోర దృశ్యాన్ని ఫోటో తీశాడు. మీడియాలో ఈ ఫోటో ప్రపంచాన్ని దిగ్భ్రాంతికి గురిచేసింది. దీనికి పులిట్జర్ బహుమతి కూడా వచ్చింది. ఐతే కెవిన్‌కార్టర్ తీవ్ర విమర్శకు గురయ్యాడు. బాలికని రక్షించకుండా ఫోటో తీస్తూ కూర్చున్నందుకు నిందకు గురయ్యాడు. ఆ అపనిందని భరించలేక పశ్చాత్తాపంతో ఆత్మహత్య చేసుకొన్నాడు.

ఆఫ్రికాలో ఆకలి చావులు సాధారణమే. ఇటువంటి ఘోర దృశ్యాలూ సామాన్యమే.అతడు బాలికని రక్షించడానికి ప్రయత్నించలేదు. అలాంటి చోట ఇటువంటి దృశ్యాలు అడుగడుగునా కనిపిస్తూనే వుంటాయి. వారందరినీ రక్షించడం తన వల్లకానిపని అని చేతులెత్తేయవచ్చు. తన వృత్తి ధర్మాన్ని నిర్వర్తించానని అతడు తనని తాను సమర్థించుకొనే అవకాశం వుంది. అటువంటి ఫోటోని ప్రపంచం ముందు వుంచడం ద్వారా ఆఫ్రికన్ల దుర్భర పరిస్థితిపట్ల చైతన్యాన్ని కలిగించానని అతడు వాదించవచ్చు. కాని అటువంటి వాదనలకి దిగలేదు. పైగా తీవ్ర పశ్చాత్తాపంతో మధనపడి మరణించాడు. అతడు అంతరాత్మ ఘోషని తట్టుకోలేకపోయాడు.

కరుణామయి మదర్ థెరిస్సా ఎప్పుడూ ఇటువంటి ఘర్షణకు గురికాలేదా? బీద క్రైస్తవుల ఉరిశిక్ష విషయంలో తన ఉదాసీన వైఖరికి ఆమె ఏనాడూ పశ్చాత్తాప పడలేదా? కెవిన్‌కార్టర్ వలె వేదనచెందలేదా?

1994లో ఆంధ్రదేశంలో చలపతి, విజయవర్ధనరావులనే బీద క్రైస్తవులకి ఉరిశిక్ష విధించబడింది. ఉరిశిక్షని రద్దుచేసి, యావజ్జీవ కారాగార శిక్షగా

మార్చాలని మానవ హక్కుల సంఘాల వారు డిమాండ్ చేశారు. ఈ విషయమై ప్రభుత్వాన్ని అభ్యర్థించమని మదర్‌థెరిస్సాని కూడా కోరారు. సుజాతాబద్రో అనే బెంగాల్ మానవ హక్కుల కార్యకర్త కలకత్తాలో థెరిస్సాని కలిసి బతిమాలారు. ఆయన O.C.D.R. అనే మానవహక్కుల సంస్థ కార్యదర్శికూడా.

ఉరిశిక్ష రద్దుని డిమాండ్ చేయడానికి మదర్ థెరిస్సా నిరాకరించారు. కేవలం ఆ బీద క్రైస్తవుల ఆత్మశాంతికోసం దేవుణ్ణి ప్రార్థిస్తానని, అదే తన కరుణశీలతకి అర్థమని థెరిస్సా స్పష్టంచేశారు. అంతేకాని అమానుషమైన ఉరిశిక్షకి వ్యతిరేకంగా నిలబడలేదు. ఆమె దీనులపట్ల కరుణశీలంగా ఉండదలచారు. కాని దైన్యాన్ని రద్దుపరచదలచుకోలేదు. అందుకే తన ఉదాశీన వైఖరికి అమ్మ పశ్చాత్తాపపడలేదు. మరి ప్రగతిశీల మేధావులు ఈ క్రూరమైన కరుణపట్ల ఎందుకు మౌనం వహించారు?

యుద్ధ వ్యాపారులు సామ్రాజ్యవాదులూ, నియంతలూ ధనాన్నీ, కీర్తికిరీటాల్నీ తనకి అందజేసినపుడు, ఇట్టి వారికి నేను సామాజిక సమ్మతిని కలగజేస్తున్నానని అమ్మ అంతరంగం సంక్షుభితం కాలేదా? ఏకాంతంలో దేవుడైనా ఆమెని నిలదీయలేదా? నీవు ఇట్టి దుర్మార్గులపట్ల చూపే మౌనం, వారితో నీ కరచాలనం తృతీయ ప్రపంచ దేశాలపట్ల తీవ్ర అపచారమని దైవం హెచ్చరించలేదా? లేక సైతాన్ ఆమె నోటిని మూసివేశాడా?

ఏదేమైనప్పటికీ తదనంతర కాలంలో సామ్రాజ్యవాద సాతానుకి ఒక గౌరవ ప్రదమైన హోదా రావడానికి మదర్ థెరిస్సా కరుణశీలత ఉపయోగపడింది. అదీ విషాదం.

అందువల్లనే పని ముఖ్యం కాదు. అదివేసే ప్రభావం ముఖ్యం. దాని ప్రతీకాత్మకత ప్రధానం. వస్తువు ప్రధానం కాదు. అది నీ రెటీనాపై వేస్తున్న చిత్రం ప్రధానం. చర్యే ప్రధానమనడం చర్యకే ప్రాముఖ్యమివ్వడం, స్వతంత్ర ఆలోచనని వ్యతిరేకించే అమెరికనిజం తప్ప మరేమీ కాదు.



# ఫాసిస్టు నీతికన్న అవినీతే మేలు

స్వచ్ఛత, స్వచ్ఛత, స్వచ్ఛత, మలినంలేని స్వచ్ఛమైన వస్త్రాల్లాగే ఎటువంటి కాలుష్యంలేని సమాజం కావాలనే రొద పెరిగింది.

చట్టబద్ధంగా వ్యవహరిస్తే సమాజం మారిపోతుందన్న ప్రచారం దీని వెనుక దాగివుంది. ధన స్వామ్యాన్ని కూడా అవినీతి నిర్మూలన అనే డిటర్జెంట్ సోపుతో వుతికితేచాలు. సమాజంలో మౌలిక మార్పు వచ్చిపడ్తుందన్న భావం దీనివెనుక దాగివుంది. చట్టాలు బాగా పనిచెయ్యాలి. ఆదాయపు పన్ను వసూలు చేయాలి. నల్లధనం కాక తెల్లధనం ప్రవహించాలి. కుటుంబ స్వార్థంలేని స్వచ్ఛమైన పరిపాలకులు కావాలి.

కాని ఘోరమైన నేరాలు ఎప్పుడూ చాలా స్వచ్ఛంగా వుంటాయి. ఆధ్యాత్మికమైన నేరమే అన్నిటికన్న గొప్ప నేరం. మౌలిక విషయాల్ని విస్మరించి పైకి కనబడే వాటిగురించి, సైడ్ఎఫెక్ట్స్ గురించి మాట్లాడడమే ఆధ్యాత్మిక నేరం.

అవినీతి నిర్మూలన గురించి చట్టాల కోసం పోరాడిన అన్నాహజారే, అవినీతి నిర్మూలనకి దృష్టాంతంగా గుజరాత్ ముఖ్యమంత్రి మోడీని చూపారు. ఇది సరైన వుదాహరణే. అన్నా హజారే వ్యాకరణ బద్ధంగానే మాట్లాడారు. మోడీ అవినీతి పరుడుకాడు. కుటుంబ స్వార్థం లేదు. అభివృద్ధికోసం స్వచ్ఛ హృదయంతో పాటుపడ్తున్నాడు. అంతా నిజమే. అందుకే ఏమన్నాడు? నా బోటి వారికి ఓటు వేయండి చాలు అవినీతి నిర్మూలన అదే జరిగిపోతుంది అన్నాడు.

జాతి నిర్మూలనని మరుగుపరిచి, అవినీతి నిర్మూలనకి గుజరాత్‌ని దృష్టాంతంగా చూపాడు హజారే. ఇదొక సత్యాన్ని తెలియజేస్తోంది. నిరాటంకమైన దౌర్జన్యపూరిత ధనస్వామ్యమే అవినీతి నిర్మూలన. దేశంలో చాలా రాష్ట్రాలకన్న పెట్టుబడులకి ఆకర్షణీయమైన ప్రదేశం గుజరాత్. అందుకే బడా పెట్టుబడిదార్లు

మోడీని కీర్తించారు. అన్నాహజారే కూడా కీర్తించాడు. సమాజంలో స్వచ్ఛతకోసం వెతికేవాడు ఆధ్యాత్మిక నేరస్తుడు. ఎందుకంటే ప్రతీ విషయం అనేక విషయాల్తో కలగలసిపోయి వుంటుంది. కనుక స్వచ్ఛత మిథ్య. అందుకే భారతీయ ఋషులు స్వచ్ఛతని ప్రతిపాదించలేదు. త్రిగుణాల, పంచభూతాల మిశ్రమంగా సృష్టిని భావించారు. ధర్మాన్ని దేశకాలానుగుణంగా వ్యాఖ్యానించారు. ధర్మ సూక్ష్మాలుకూడా వుంటాయన్నారు.

ఆధ్యాత్మిక క్రిమినల్స్ చేస్తున్నదేమిటి? అమెరికనిజానికి జనామోదాన్ని కలగజేయడం. అమెరికాని చూడండి. చట్టబద్ధతకి, ప్రజాస్వామ్యానికీ, ప్రపంచానికే మార్గదర్శకంగా భావించబడ్తోంది. అదే సమయంలో ధన స్వామ్యాన్నే స్వేచ్ఛ పేరుతో విశ్వవ్యాప్తం చేస్తోంది. మార్కెట్టునే సకల సమస్యలకీ పరిష్కారంగా చూపుతుంది. అందుకోసం మృత్యువుని కూడా వ్యాపారంగా మార్చేసింది. అదే ఆయుధ వ్యాపారం.

ఒకప్పుడు అవినీతి నిర్మూలన అంటే ఏమిటి? ప్రభుత్వ వ్యవస్థలని సక్రమంగా నడపడం. ఇప్పుడు ఆ వ్యవస్థలే కుప్పకూలుతున్నాయి.

ఇప్పుడు అవినీతి నిర్మూలన అంటే ఏమిటి? డబ్బుకోసం అడ్డంకులు సృష్టిస్తున్న రాజకీయ నాయకుల నుంచి ధనస్వామ్యాన్నీ, ధనికుల్నీ పూర్తిగా విముక్తం చేయడమే అవినీతి నిర్మూలనం. చైనాలో జరిగిందదే. అవినీతికి తీవ్ర శిక్షలు విధించడం ద్వారా ధనస్వామ్యం సులభంగా బలపడింది. బిలియనీర్లు లాభపడ్డారు. ప్రభుత్వం వ్యాపార విస్తరణని సులభం చేయగలిదింది.

అందువల్ల స్వచ్ఛత్వ వాదులు ధనస్వామ్యానికి మేలి ముసుగులు మాత్రమే. వారి నేర ప్రవృత్తి కూడా ఆధ్యాత్మిక కాంతితో విరాజిల్లుతుంది. స్వచ్ఛమైన కరుణ, స్వచ్ఛమైన నీతి సూత్రాల వల్ల జరిగేదేమిటి. అవిరెండూ ధన స్వామ్యంలో మరుగునపడిపోతున్న సకల విలువల్నీ విస్మరించేలా చేస్తాయి. మోడీలాంటి ధనస్వామ్య ఆరాధకుల్ని త్యాగరాజులుగా లోకానికి చూపుతాయి.

స్వచ్ఛత సంప్రదాయ విరుద్ధమైనది. సంస్కృతీ విరుద్ధమైనది. జరుగుతున్న పరిణామాల్లోని మౌలిక అంశాలపై నుంచి దృష్టి మళ్లించడానికీ, స్వచ్ఛమైన వ్యక్తిత్వాలతో విరాజిల్లే క్రిమినల్స్‌కి సమాజ సమ్మతిని పెంచడానికి స్వచ్ఛత్వ వాదులు ఉపయోగిస్తారు. వారు ఆధ్యాత్మిక నేరస్తులు.



# బాబాల షాపింగ్ మాల్

భారతదేశంలో అమెరికనిజం విస్తరించడానికి గొప్పనేర సామ్రాజ్యాలు అవసర మౌతున్నాయి. ఐతే అవి ఆధ్యాత్మికమైన వెలుగుని విరజిమ్ముతూండాలి. ప్రేమ, శాంతి లాంటి పదాల్ని క్రైస్తవాన్ని మించి వెదజల్లుతుంటాయి ఈ నేర సామ్రాజ్యాలు.

అమెరికనిజమే అద్వైతమని స్వామి వివేకానంద బోధించి వంద సంవత్సరాలు దాటింది. ఇప్పుడు అమెరికనిజం ప్రత్యక్షంగా భారతదేశంలో ఆధ్యాత్మిక సామ్రాజ్యాలుగా విస్తరిస్తోంది. నేర ప్రవృత్తితో కూడిన ధనస్వామ్యాన్ని వెదజల్లుతోంది. ఇదంతా ఆధ్యాత్మిక పరిభాషలో జరుగుతోంది.

ఒకప్పుడు ప్రేమ, శాంతి లాంటి పదాలు ఇంత వాడుకలో వుండేవి కావు. గ్రామీణ స్వభావంలో కుటుంబ వ్యవస్థలో అవి అంతర్లీనంగా వుండేవి. ఆతిధ్యం, కుటుంబ సంబంధాలు, బాంధవ్యాల రూపంలో పరస్పర ఆదరణ సహజంగా వ్యక్తమయ్యేది. అదొక ప్రకటనగా కాక జీవిత విధానంగా వుండేది.

ధనస్వామ్యం విస్తరించేకొలదీ ధనం మేటబడిన చోటికే ప్రేమ, కరుణ తరలిపోయాయి. అవి ధన స్వామ్యానికి ముసుగుగా మారిపోయాయి. దైనందిన జీవితం నుంచి తప్పుకున్నాయి.

ధన స్వామ్యంలోనే లీనమైపోయిన ఈ ప్రేమలూ, ఆత్మీయతలూ ధనస్వామ్యపు కొనసాగింపుకే వుపకరిస్తాయి. తృతీయ ప్రపంచదేశాల్ని అమెరికాలాంటి సంపన్న దేశాల దయాదాక్షిణ్యాల మీద బతికే దీన దేశాలుగా, దీన జాతులుగా కొనసాగించడానికి ఈ ప్రేమ సందేశాలు, కరుణ సందేశాలు వుపయోగిస్తాయి.

అందువల్లనే ప్రేమ సందేశాలు వినిపించే ప్రశాంతి నిలయాలు నేర నిలయాలుగా సాక్షాత్కరిస్తుంటాయి. కాని దీనిలో ఆశ్చర్యపడవలసినదేమీ లేదు. ఈ ఆధ్యాత్మిక నిలయాలు చట్టాలకి అతీతంగా న్యాయవ్యవస్థకి అతీతంగా తెల్లదో, నల్లదో, ఏ రంగుదో తెలియని ధనం అడ్డూ, ఆపూ లేకుండా ప్రవహించడానికి స్విస్‌బ్యాంకుల్ని మించిన సురక్షిత నిలయాలుగా వుంటాయి. తెలుపు, నలుపులూ, మంచి చెడులూ న్యాయాన్యాయాలూ యేవీ కానరాని సరికొత్త అద్వైతం ఇక్కడ సాక్షాత్కరిస్తుంది.

అందరూ ధనాన్నే ఆరాధిస్తారు. కనుక సామాన్యులకి కూడా ఇక్కడ దైవమే సాక్షాత్కరిస్తుంది. ప్రచ్ఛన్న క్రైస్తవమైన హిందూమతం కూడా ధనస్వామ్యంలో కలిసిపోతుంది. అదే అమెరికనిజం.

ప్రధానమంత్రిని కూడా నిలదీయగల అన్నా హజారేలు ఆధ్యాత్మిక నేర నిలయాలవైపు కన్నెత్తికూడా చూడలేరు. ఆధ్యాత్మిక నేర నిలయాల్లో నేరాలు కూడా పవిత్రంగా మారిపోతాయి. కోట్లాది ధన ప్రవాహం గంగా ప్రవాహాన్ని తలపిస్తుంది. ఇతరత్రా గొప్ప అలజడి సృష్టించే విషయాలు కూడా టీ కప్పులో తుఫానులా మారిపోతాయి. నిజమైన అమెరికనిజం అక్కడ సాక్షాత్కరిస్తుంది.

ఎన్నో నేరాలు జరుగుతుంటాయి. కాని అంతా ప్రశాంతి నిలయంలా వుంటుంది. నెత్తురు చిందినా, చిన్నమరక కూడా కనబడదు. అంతా ప్రేమ. అంతా శాంతి.

నిజానికి మనజీవితాలే ప్రశాంతి నిలయాలుగా మారిపోయాయి. ప్రేమ ప్రకటనలు, ఫాదర్స్‌డేలు, మదర్స్‌డేలు ప్రవహిస్తుంటాయి. ప్రేమలూ, స్నేహాలూ అనుబంధాలూ మార్కెట్ సరుకులుగా మాత్రమే దర్శనమిస్తాయి. జీవితం పొడవునా అవి కనబడవు.

ఇక్కడే ఈ తొడతొక్కిడిలో,ఈ వేగంలో మనకి శాంతి కావాలి, ప్రేమ కావాలి. వాటికోసం మనిషి ఆధ్యాత్మిక క్షేత్రాలని సృష్టించుకొంటాడు. అవి సహజంగానే అమెరికనిజానికి ఆధ్యాత్మిక వేషం వేసినట్లే వుంటాయి. మన అంతరంగమే పుట్టపర్తి అది ఆధ్యాత్మిక నేర నిలయం.

కమ్యూనిస్టు దేశాల్లో కూడా బాబాలు అవతరించారు. అక్కడ వ్యక్తిపూజ తారాస్థాయినందుకుంది. నాయకుడు తనలో అధికారాన్నంతటినీ కేంద్రీకరించు కున్నాడు. అన్ని చట్టాలూ న్యాయాలూ ఒకే వ్యక్తిలో కేంద్రీకృతమయ్యాయి. అతడు మరణించినపుడు అతడి శవాన్నికూడా భద్రంచేసి శాశ్వతంగా ప్రదర్శనకు వుంచారు. అది కమ్యూనిస్టు ఆధ్యాత్మిక కేంద్రంగా మారింది. ఐతే కమ్యూనిస్టు వ్యక్తిపూజ అధికార కేంద్రీకరణకోసం జరిగింది.

నేడు భారతదేశంలో అధికారమూ, రాజ్య ప్రమేయమూ లేని అరాచక ధన చలనమే ఆధ్యాత్మికతగా పిలవబడ్తోంది.

భారతదేశంలో ఆధునిక దేవుళ్ళు ధన చలనానికి నిరాటంకమైన సురక్షిత ప్రాంతంగా మారారు. ఫ్రీజోన్‌గా మారారు. ఈ ధనం వీరి ఫిలాసఫీలాగే దేశకాలాతీతం. కులమతాతీతం. ఈ అతీత స్థితిలో విశ్వవ్యాప్తంగా ఆధ్యాత్మిక వేషంలో ధనం స్వేచ్ఛగా చలిస్తుంటుంది.

అందుకే బిలియనీర్లూ, రాజకీయ నాయకులూ, క్రికెట్‌వాళ్ళూ అందరూ కూడా వీరిపాదాలమీద వాలిపోతారు. వారు పూజించేది నిజానికి స్వేచ్ఛాశీలమైన ధనస్వామ్యాన్ని.

ముస్లిం అతివాదుల ధనసేకరణ వెనుక మత విశ్వాసమైనా వుంది. కాని ఈ భారత ఆధ్యాత్మికత కేంద్రాల కర్తవ్యం మాత్రం అమెరికనిజాన్ని విస్తరింప జేయడమే.

నిజానికి శంకర మఠాలు బోధించే ఆధ్యాత్మిక తత్వంలో దేవుడు లేడు. దేవుడు క్రైస్తవం నుంచి వచ్చాడు. నేడు ధనస్వామ్యమే దేవుడు.

ధనస్వామ్యమే దేవుడి పీఠాన్ని ఆక్రమించడంతో ఆధునిక దేవుళ్ళు తమ మహిమల్ని కోల్పోతున్నారు. బందీలుగా మారుతున్నారు. ధన స్వామ్యం చేతిలో ఆట బొమ్మలుగా మారిపోతున్నారు. నిజానికి వీరు ఆధ్యాత్మిక అంగడిలో సరుకులుగా మారిపోయారు. అదే అమెరికనిజం.



# చైతన్యమే పెద్ద జబ్బు

చైతన్యవంతంగా వుండడానికి ఆధునికత చాలా ప్రాధాన్యం తెచ్చింది. దీనివల్ల అలసత్వం, నిశ్చలత్వం, జీవితం నుంచి నిరాకరించబడ్డాయి. దీని పర్యవసానమే ననుకొంటాను నిద్రకూడా కరువవుతోంది. కంటిమీద కునుకు రావడం కోసం వైద్యులని సంప్రదించే ఆధునిక యువతరం అవతరిస్తోంది.

మెల్లగా సన్నగా సాగే సంగీతం నిలిచిపోయింది. వేగం, ఉత్సాహం అలజడి, వుప్పెనలా లేచే పాటలే ప్రధానమయ్యాయి. చైతన్యం అచేతనపై కుక్కకాపలా కాస్తోంది.

పాశ్చాత్య మనస్తత్వ శాస్త్రం ముఖ్యంగా ఫ్రాయిడిజం చైతన్యాన్ని అచేతనపై కాపలాగా వర్ణించింది. నిషిద్ధ అదిమ వాంఛలపై సూపర్ ఇగోని అధిపతిగా నిలిపింది. అదే నాగరికత అంది. స్వస్థత అంది.

వ్యక్త అవ్యక్తాలు అచేతన చైతన్యాలు పరస్పరం అనుబంధం కలిగినవే కాని పాశ్చాత్యం వాటిలో ఒకదానిని మరొకదానిపై ఆధిపత్యం వహించే శక్తిగా నిలిపింది.

దీనివల్లనే మార్పుకీ చైతన్యానికీ తీవ్రమైన ప్రాధాన్యం పెరిగింది. వివేకానందస్వామి రజోగుణాన్ని కీర్తించాడు. యువకులలో రజోగుణం పెరగాలన్నాడు. రజోగుణం వేగానికి రాజస ప్రవృత్తికి, అహానికి చైతన్య స్థితికీ ప్రతీక. వివేకానంద రజోగుణానికి ఇచ్చిన ప్రాధాన్యం అచేతనకంటే చైతన్యానికీ, అవ్యక్తంకంటె వ్యక్తానికీ ప్రాధాన్యాన్నీ, ఆధిపత్య స్థానాన్ని ఇచ్చిన పాశ్చాత్యానికి కొనసాగింపే. నిజానికి భారతీయులు నిశ్చల శాంతి స్థానమైన సత్వగుణానికి ప్రాధాన్యమిచ్చారు.

సత్వగుణం తమోగుణాన్ని పోలివుంటుంది. కాని నిజానికి అది వేరు. నిశ్చలత, జడత్వం ఒకటికావు. తమోగుణంలో జడత్వం, స్తబ్ధత వుంటాయి. సత్వ గుణంలో నిలకడ వుంటుంది. ఆంతరంగికమైన నెమ్మదితనం వుంటుంది.

సరిగ్గా ఇప్పుడు లోపిస్తున్నదదే. అందుకే నిలకడలేని తనం మార్పుగా వర్ణించబడింది. అమెరికనిజం ఆవిర్భావంతో మార్పుకి కూడా అర్థంలేకుండా పోయింది. వునికిని ధ్వంసం చేసింది అమెరికనిజం. ఉనికి నుంచి విముక్తిని ప్రసాదించింది. దానితో ఉనికిలేని మార్పు, ఉనికితో సంబంధంలేని మార్పు వస్తు ధర్మం లేని మార్పు, మారేది అంటూ యేదీ లేని వట్టి మార్పు దేనికోసమో తెలీని మార్పు, ఎక్కడికో తెలీని మార్పు, మారడమంటే యేమిటో అర్థంకాని మార్పు, మార్పు కాని మార్పు సంభవిస్తోంది. అందుకే అది రణగొణ ధ్వనిగా వెలువడ్తోంది.

అందుకే అన్ని సిద్ధాంతాలూ తమలో తామే కుప్పకూలుతున్నాయి. అత్యాధునిక పద్ధతిలో భారీ భవంతుల్ని కూల్చివేసే పద్ధతిలో అన్ని సిద్ధాంతాలూ వున్నచోటనే కుప్పకూలుతున్నాయి.

ఇట్టి పరిస్థితుల్లో వినాయకుడు పాలు తాగడాలూ, లోక్ సత్తాలూ, అన్నా హజారేలూ అన్నీ ఒకేలా అత్యాధునిక వుబుసుపోక కబుర్లుగా మారిపోతున్నాయి. కంప్యూటర్లని వైరస్ సోకుతోంది. ఏది వైరస్సో, ఏది వైద్యమో తెలియకుండా పోతోంది. అవినీతి నీతిని బోధిస్తోంది. అధర్మం ధర్మ ప్రవచనాలు చేస్తోంది. డాలర్ వైరాగ్యాన్ని బోధిస్తోంది. విస్తరిస్తున్న బోర్‌డమ్ వినోదవ్యాపారంగా మారుతోంది.

అందువల్ల భౌతిక జగత్తులో వచ్చే పరిణామం యేదీ పట్టించుకోవలసినదిగా లేదు. యువతరం నుంచి మార్పు వస్తుందనే ప్రకటనలకి అర్థంలేదు. నిజానికి జన్యుపరంగా నూతనతరం అరికట్టబడ్తోంది. ఉన్న యువకులు కూడా యువ చైతన్యంగా పిలవబడే చదువుల్లో, ఉద్యోగాల్లో, వినోదాల్లో కుప్పకూలిపోతున్నారు. ఇదొక డార్క్ మేటర్. ఏదీరాదు, యేదీ పోదు.

అందువల్ల గాఢమైనదేదీ వుండదు. గాఢ నిద్రకూడా కరువవుతుంది. స్వప్నాలు కూడా అంతరిస్తాయి. నిద్ర, ఆలస్యాల నుంచే స్వప్నాలు జనిస్తాయి. ఇప్పుడు లోపించిందదే.

స్వప్నాలు లేనిచోట స్వప్న వాసవ దత్తలు వుండరు. మరణించిందనుకొన్న ప్రియురాలి హస్త స్పర్శని పొందుతాడు ఉదయన మహారాజు. అది స్వప్నమా, వాస్తవమా అని తేల్చుకోలేక మధనపడ్డాడు. వాస్తవానికీ, స్వప్నానికీ మధ్య సంధి దశలో సృజనాత్మకత క్షేత్రం వుంది. ఆదమరుపుకి అవకాశంలేని నేటితరం అక్కడికి చేరుకోవడం అసాధ్యం. ఈనాటి చైతన్యమంతా ఒకరోజు వ్యాపార ప్రకటన తప్ప మరేమీకాదు.



# ఫోబియాలు అమ్మబడును

యూరప్ ఆధిపత్యాన్ని ప్రపంచ చలన సూత్రంగా భావించింది. అమెరికా అకారణ భయాన్ని అంటే ఫోబియాని ప్రపంచ చలన సూత్రంగా భావిస్తోంది.

యూరప్ దృష్టిలో కొన్ని జాతులు సహజ సిద్ధంగానే గొప్పవి, నాగరికమైనవి. అవే ఆధిపత్యాన్ని వహిస్తాయి. వారి అధికారానికి తలవొంచి, వారి అడుగుజాడలలో నడవడమే ప్రపంచపురోగతి అని బోధించారు. యూరోపియన్ వలస వాదులు

అమెరికా చరిత్ర హీనమైనది కావడం వల్ల తన వునికిని నిరంతరం నిర్వచించుకుంటూ కృత్రిమంగా పరిశోధనాశాలలో సృష్టించుకొంటూ వస్తోంది. అందుకే అమెరికా నిరంతరం ముట్టడి భయాన్ని ప్రచారంలో పెడ్తోంది.

ఫోభియాల్ని సృష్టిస్తూ బతుకీడుస్తోంది. తనదైన ఉనికి అంటూ లేని అమెరికా అందరి ఉనికినీ క్షణికంగా మారుస్తూ అభద్రతనే నాగరికతగా బోధిస్తోంది. భద్రతలేని ఉద్యోగాలు, భద్రతలేని వివాహబంధాలూ, భద్రతలేని స్పెక్యులేషన్ మనీ ఇలా అంతా అభద్రతే. యూరప్ సృష్టించిన సాపేక్ష భద్రతకూడా కరువవుతోంది.

అసలు అమెరికా ఉనికియొక్క నిర్వచనాన్నే అభద్రంగా మార్చేసింది. యూరప్ చరిత్ర భావనని బలోపేతం చేసి మానవుడికి నిలకడైన స్థానాన్ని ఇచ్చింది. మానవ కేంద్రక దృష్టి ద్వారా ప్రకృతితో బొడ్డు బంధాన్ని తెంచేసిన మాట కూడా నిజమేకాని మానవ భావాన్ని కూడా అమెరికనిజం నిర్మూలించింది. చరిత్రని, సిద్ధాంతాల్నీ, నిర్వచనాల్నీ ధ్వంసంచేసి మనిషిని దిసమొలతో మార్కెట్లో నిలిపింది.

అమెరికా బానిస వ్యవస్థద్వారా బలపడింది. ఆఫ్రికన్లని వారి నేల నుంచి అనుబంధాలనుంచి, సంస్కృతినుంచి బలవంతంగా వేరుచేసి వారి శ్రమతో

బలపడింది. మొదట రెడ్ ఇండియన్ ఆదివాసీల నిర్మూలన, తర్వాత బానిసత్వం ఇవే అమెరికనిజానికి ఇంధనాలు.

అందువల్ల అభద్రతనీ, బానిసత్వాన్నీ అత్యాధునిక పద్ధతుల్లో విస్తరింపజేస్తోంది అమెరికా. అవి పూర్వంలా పైకి కనబడవుకాని సూక్ష్మ స్థాయిలో అమలవుతాయి. అభద్రత, బానిసత్వమూ సహజసిద్ధమనే భావాన్ని పెంచి పోషిస్తోంది అమెరికా. నిజానికి ఈ రెండింటి కలయికనీ అది బోధిస్తోంది. అంటే యజమాని ప్రత్యక్షంగా కనబడదుకాని, బానిసత్వం కొనసాగుతూ వుంటుంది. ఇదీ ఈనాటి పద్ధతి. యజమాని ప్రత్యక్షంగా అజమాయిషీ చేయదుకాని మనసులో నిరంతర భయం, అభద్రతా భావం నిన్ను పరుగెత్తిస్తూ వుంటాయి. ఇది సరికొత్త బానిస వ్యవస్థ.

కాని ప్రత్యక్ష అజమాయిషీ కనబడకపోవడం వల్ల చాలా స్వేచ్ఛగా చరిస్తున్నామన్న భ్రమని అమెరికనిజం సృష్టిస్తుంది.

తనదైన వునికి అంటూలేక పోవడం వల్ల అమెరికా నిరంతరం భ్రమలోనే జీవిస్తుంది. భ్రమకి, వాస్తవానికీ తేడా తెలియని స్థితిలో జీవిస్తుంది.

సుఖానికీ, దుఃఖానికీ, భయానికీ, భద్రతకీ తేడాని తుడిపేస్తుంది. దీనికి మానసికంగా సిద్ధం చేయడానికే అగోచర శక్తుల దాడిని భయంకరంగా సృష్టిస్తుంటుంది. హాలీవుడ్ భయాన్నీ, బీభత్సాన్నీ వినోద పరిశ్రమగా మార్చేస్తుంది.

దళిత వాదులూ, హిందూవాదులూ, అభద్రత, అకారణ భయాల మిశ్రమమైన అమెరికనిజాన్ని కీర్తిస్తున్నారు. సరికొత్త బానిస వ్యవస్థలో తమపేరు నమోదు చేసుకొంటున్నారు. అందుకే ప్రముఖ దళితవాది చంద్రభానుప్రసాద్ అమెరికన్ సామ్రాజ్యవాదం వల్లే జాతుల, కులాల విముక్తి సాధ్యమని వాదిస్తున్నారు.



# యోగసూత్రం - మార్కెట్ మంత్రం

భారతీయ ఆధ్యాత్మికత అంతర్జాతీయం కావడంతో పాటు పెద్ద వ్యాపారంగా మారిపోయింది. అమెరికనిజానికి మారుపేరుగా మారిపోయింది.

గాంధీ పాశ్చాత్యంలో కూడ ప్రాచ్యాన్ని అన్వేషించాడు. ఇప్పుడు ప్రాచ్యమే పాశ్చాత్యంగా మారిపోవడమేకాక అమెరికనిజంలో కలగలసిపోయింది.

తొరో అనే అమెరికా దేశీయుడు ఒక ఏకాంత వన ప్రదేశంలో అతిసరళంగా జీవించాడు. అతి తక్కువ వస్తు సామగ్రితో జీవించాడు. ఇంటికి తాళం కూడా వేసేవాడు కాదు. వాగాడంబరాన్ని పరిహరించాడు. ఏకాంతాన్ని ఆశ్రయించాడు. వాంఛలకి సరిహద్దుల్ని నిర్ణయించాడు. ఈ తొరో నుంచి గాంధీ చాలా ప్రభావితు డయ్యాడు. ఈవిధంగా పాశ్చాత్యంలో ప్రాచ్యాన్ని కనుగొన్నాడు మహాత్ముడు.

ఈనాడు ఆధ్యాత్మికవేత్తలు యోగాన్నీ, ధ్యానాన్నీ బోధిస్తున్నారు. ఏకాంతం కనుమరుగై పోవడం నేటి మానవుడి సమస్య. సృష్టిలో పదార్థం తక్కువ, శూన్యం ఎక్కువ. పంచభూతాలలో అతి సూక్ష్మమైనది అతి ప్రధానమైనదీ విశ్వసృష్టికి మూలమైనదీ ఆకాశమే.

ఆధునిక సైన్సులా కాకుండా ప్రాచీన ఋషులు అంతరంగంలో సృష్టి మూలాన్ని అన్వేషించారు. విరాట్ విశ్వానికి మనిషి సూక్ష్మ రూపము అన్నారు. అందువల్ల మనిషి ఏకాంతం సృష్టి మూలంలోకి జీవిని తీసుకువెళ్తుంది. సృజనాత్మతకి బీజావాపం చేస్తుంది. కాని మనిషికి యేకాంతం ఎక్కడ? మనిషి చుట్టూ అంతులేకుండా సరుకులు పేరుకుపోతున్నాయి. వీటి కోసం మనిషి నిరంతర ధనాన్వేషణ చేయవలసివస్తోంది. మార్కెట్ సృష్టించే కృత్రిమ వాంఛల వెంట పరుగెత్తవలసి వస్తోంది. యీ అమెరికనిజాన్ని ప్రశ్నించకుండా ప్రాణా యామం, ధ్యానం లాంటి కొన్ని పద్ధతుల ద్వారా మనిషికి శాంతి లభిస్తుందనడం మోసమే. ఇప్పుడు ప్రాచ్య వేషంలో అమెరికనిజం వీరవిహారం చేస్తోంది.

మార్కెట్ విస్తరణ తెస్తున్న ముప్పుని గురించి ప్రకృతిలోనూ, మనిషిలోనూ వస్తున్న వికృత పరిణామాల గురించి మౌనం వహిస్తున్నారు బాబాలూ, సాధుసన్యాసులూ. వారు అవినీతి నిర్మూలన అనే పదాన్ని మాత్రం ఉచ్చరిస్తున్నారు. అంటే అమెరికన్ అభివృద్ధి మార్గం పట్ల వారికి వ్యతిరేకత లేదు. పైగా సుముఖతే వుంది. ఆ అభివృద్ధికి ఆటంకం రాకూడదనేదే వారి అభిలాష. అదే వారి నీతి బోధ వెనుక వున్న సారం.

కాని భారతీయ అధ్యాత్మిక పద్ధతులకన్న మనస్తత్వ శాస్త్ర పద్ధతులే మనిషికి మానసిక ఆరోగ్యాన్ని ప్రసాదిస్తాయి అన్నాడు ప్రముఖ మనస్తత్వ శాస్త్రవేత్త యూంగ్.

ఔను మరి ఆధునికత మనిషిని ముక్కలు ముక్కలు చేసి వివిధ రకాలైన నిపుణులకి పరిశోధనా వస్తువుగా అప్పజెప్పింది. చెవి, ముక్కు, కాలు, కీలు.... అలాగే మనస్సు కూడా. ఇప్పుడు మనస్సు చాలా పాత పదం. మెదడు అనే పదార్థమే మిగిలింది.

మన ఆధునిక ఆధ్యాత్మిక వేత్తలు కూడా జీవితాన్ని మొత్తంగా చూడడంలేదు. ముక్కలుగా చూస్తున్నారు. గంటలో యోగం, వారంలో యోగాసనాల గురించి అరగంటలో ధ్యానం గురించి మాట్లాడ్తున్నారు. మొత్తంగా జీవితంలోను, సమాజంలోను వుండవలసిన పరిస్థితి గురించి మాట్లాడ్డంలేదు. వీరూ నిపుణులనే అనుకరిస్తున్నారు.

అమెరికన్ అభివృద్ధి విధానంలో మనుషుల్ని ఇమిడిపోయేలా చేయడమే వీరి పని. అందుకే వీరు మనస్తత్వ శాస్త్రవేత్తలతో పోటీపడ్తున్నారు. భారతీయ వ్యక్తిత్వ వికాసాన్ని బోధిస్తున్నారు. మోక్షాన్ని మాత్రం గాలికి వదిలేశారు. అది ఎవరికీ అక్కరలేదు. ఆధునికతకి అనుగుణంగా మనుషుల్ని మెలితిప్పే ఫ్యాక్టరీలుగా నేటి సాధు సన్యాసులు మారిపోయారు.

యోగం అనే పదానికి కలయిక అని అర్థం. విశ్వమూలంలో కలయిక, పరమాత్మలో లయం, సత్యంతో సంగమించడం, పరిపూర్ణస్థితికి చేరుకోవడం. అట్టి యోగం యిప్పుడు అమెరికన్ కార్పొరేట్ సంస్కృతిలో కలగలసిపోవడం

అనే అర్థంలోకి మారిపోయింది. దీనికే భారతీయ వ్యక్తిత్వ వికాసం అని ముద్దుపేరు ఒకటి.

నిజానికి భారతీయ తత్వం సరుకుల విస్తరణకి వ్యతిరేకమైనది. ఎందుకంటే భౌతిక వస్తుజాలమంతా మనోస్పృష్టి మాత్రమే. ఆ మనస్సూ అంటే ఆలోచనకూడా మిథ్యే

క్రైస్తవ దృష్టి ఇందుకు భిన్నం. దేవుడు బయటవున్నాడు. మన ఆలోచనలతో ప్రమేయం లేకుండా వస్తుగత సత్యంగా విరాజిల్లుతున్నాడు. ప్రపంచమూ అంతే. అంతేకాదు భాష సత్యాన్ని స్పష్టం చేయగలదు. బాబెల్ గోపురం కథలోలా భాష వివిధ భాషలుగా విభజింపబడడం వల్ల మనుషుల మధ్య దూరం ఏర్పడింది. భావ వైషమ్యం ఏర్పడింది. నిజానికి యిది పొరపాటువల్ల జరిగింది. నిజానికి ఒకే దేవుడులాగే ఒకే భాష సాధ్యమే. అంటే భాష, ఆలోచన స్పష్టంగా వైరుధ్యాలు లేని ఏకైక సత్యాన్ని ప్రవచించగలవు. బాహిర సత్యంపట్ల క్రైస్తవ విశ్వాసం దేవుడినేకాదు వస్తుజాల విస్తృతినీ, మార్కెట్‌నీ సృష్టించింది విస్తరింపజేసింది.

క్రైస్తవంపై బౌద్ధ ప్రభావం వుందని కొందరు అంటారు. నిజానికి క్రైస్తవం దేవుడు అనే భావనని బలంగా నిలిపింది. అట్టి భావన ఏర్పడడానికి పూర్వ రంగాన్ని బౌద్ధం సిద్ధంచేసింది. దేవుడు అంటే సృష్టి కర్త. అంతకు ముందు లేని విశ్వాన్ని దేవుడు సృష్టించాడు. అంటే ఒకప్పుడు విశ్వమంతా శూన్యం నిండి వుండాలి. అట్టి శూన్యస్థితిలోనే సృష్టికర్త సృష్టికర్త కాగలడు. అంతకు ముందులేని దానికి రూపమివ్వగలడు. అందువల్ల విశ్వానికి ఉనికిని ప్రసాదించేదేవుడు కావాలంటే ముందు శూన్యం వుండాలి. ఆ శూన్యాన్ని తార్కికంగా తాత్వికంగా బలపరచడంద్వారా బౌద్ధం దేవుడికి మార్గాన్ని సుగమం చేసింది. సాంఖ్యం, మీమాంస, జైనం అనాదిసత్‌ని బోధిస్తున్నాయి. వాటికి భిన్నంగా శూన్యవాదాన్ని ప్రతిపాదించిన బౌద్ధం దేవుడికి పూర్వరంగాన్ని సిద్ధం చేసింది. ఆ దేవుడే మార్కెట్‌కి మూలం. దేవుడైనా, సరుకులైనా బాహిరమైనదే సత్యం అనే భావన నుంచే పుట్టాయి.

అనాది ఉనికి, ఆ మూలంతో జీవికిగల సంబంధం బాహిర విషయాలపట్ల మిథ్యా బుద్ధిని పెంచుతాయి లేక నిర్లిప్తతని పెంచుతాయి. ఇట్టి స్థితిలో మార్కెట్ విస్తరణ అసాధ్యం.

నిజానికి మార్కెట్ విస్తరణకి ఆలోచనమూలం. ఒక ఐడియా జీవితాన్ని మార్చేస్తుంది అనేది మార్కెట్ తత్వాన్ని సూచిస్తుంది. మార్కెట్ వస్తువుల్ని అమ్మడం మానేసి ఆలోచనల్ని అమ్మడం మొదలు పెట్టింది. నిజానికి ఆలోచనలే వస్తువులు. వస్తువులూ, ఆలోచనలు వేరని, ఆలోచన ద్వారా వస్తువులు ఉత్పత్తి అవుతాయి అనేది యూరోపియన్ వాస్తవికతావాదం. దేవుడు తన ఆలోచనద్వారా భూమిని సృష్టించాడు. మనిషి తన ఆలోచనద్వారా వస్తువులని సృష్టిస్తాడు అని సారాంశం. ఆలోచనలే వస్తువులు అనేది అత్యాధునిక అమెరికన్ మార్కెటిజం. యోగః చిత్తవృత్తి నిరోధః చిత్తవృత్తుల్ని నిరోధించడమే యోగం. కాని చిత్తవృత్తులు నిలిచిపోవడమంటే వ్యాపారతత్వం నశించడమే. వస్తు వ్యామోహం నిలిచిపోడమే. చిత్తవృత్తి నిరోధాన్ని బోధించే యోగం వ్యక్తిత్వ వికాసానికి ఎలా ఉపయోగిస్తుంది? యోగంవల్ల వచ్చే ఆరోగ్యం ఎటువంటిది? మనస్సే మిథ్యని బోధించే భారతీయ ఆధ్యాత్మికతత్వం ఆధునిక మానవుడికి ప్రసాదించే మనశ్శాంతి ఏమిటి?

చిత్త వృత్తుల్ని నిరోధించే యోగం చిత్తవృత్తుల విజృంభణకి శక్తినిచ్చేదిగా వ్యాఖ్యానించబడ్తోంది. మార్కెట్ వ్యవస్థలో నిరాటంకంగా రాణించడానికి మార్గంగా చూపబడ్తోంది. జనన, మరణ చక్రాన్ని అధిగమించే మోక్షం కాక, షుగర్ బ్లడ్ ప్రెషర్‌ల నుంచి విముక్తి నిచ్చే మందుగా యోగం వర్ణించబడ్తోంది. అ విధంగా వైద్య వ్యాపార రంగంలో మనో చికిత్సా రంగంలో ప్రత్యామ్నాయంగా భారతీయతత్వం ప్రచారం చేయబడ్తోంది. అమెరికన్ మార్కెట్ దేన్నీ కాదనదు. దేన్నైనా నువ్వు సరుకుగా మార్చగలవా లేదా ? సరుకుగా మార్చడమంటే ఏమిటి ? వస్తువుని సృష్టించడం కాదు. బలంగా చలామణీకాగల కొత్త బ్రాండ్ ఆలోచనని సృష్టించడం.

యూరోపియనిజం కొంగ్రొత్త సరుకులతో వ్యాపారం చేసింది. అమెరికనిజం క్రొంగొత్త ఆలోచనలనే సరుకులుగా చలామణిలోకి తెస్తోంది.

ఆలోచనలు కూడా సరుకులేనని, నిజానికి ఆలోచనలే సరుకులని అవికూడా నశ్వరమైన ప్రాపంచిక క్షణిక వస్తువులేనని భారతీయులకి తెలుసు. అందుకే ఆలోచన యేదీ సత్యం కాదు. దేవుడనేది కూడా ఆలోచన నుంచి పుట్టేదే కనుక అదీ సత్యం కాదు. ఆలోచనకి అతీతమైన అపరోక్ష అనుభూతే పరబ్రహ్మం. అది విశ్వాసం కాదు. విశ్వాసం కూడా ఆలోచనా జనితమే. అదీ మనోవృత్తే. మనోబుద్ధి, అహంకారాలకి అతీతమైన అనుభూతే సత్యం.

చిత్త వృత్తులు అంటే ఆలోచనలు కూడా నశ్వర ప్రపంచంలోనివే. అవే నిజానికి ప్రపంచం. ఆ సత్యాన్ని అమెరికా భారత తాత్వికతనుంచి గుర్తించింది. అందుకనే ఆలోచనల్నే మార్కెట్‌గా మలచుకొంది. భారతీయ ఆధ్యాత్మిక మార్కెట్‌కూడా అమెరికనిజమే. అమెరికనిజంలో సంయోగమే నేటి యోగం. చిత్త వృత్తుల నిరోధం కాదు వాటి వీరవిహారం.

అమెరికనీకరించబడిన భారతీయతత్వం తన సారాన్ని కోల్పోయింది. అధిగమించవలసిన చిత్త వృత్తులలోనే మాయలోనే అది మునిగిపోయింది. అందువల్ల భారతీయ తత్వం తన తత్వాన్ని కోల్పోయింది. అమెరికనిజమే గెలిచింది.

ప్రయోజనమే సత్యమనే ప్రాగ్మాటిజాన్ని ఫిలాసఫీగా అభివృద్ధి పరిచింది అమెరికా. అందువల్లనే నిష్కామ్యకర్మ తత్వాన్ని కూడా క్షీణింపజేసింది. ఆ విధంగా భారతీయ తత్వాన్నికూడా ఆధ్యాత్మిక ప్రాగ్మాటిజంగా మార్చేసింది. దాంతో భారతీయతత్వం అమెరికనిజంతో మమేకమైపోయింది. అదీ అమెరికనిజం విజయరహస్యం.



## కొన్ని ఉపయుక్త గ్రంథాలు


- కైవారం నారాయణ తాత
  టి.నారాయణ ద్రావిడ విశ్వవిద్యాలయం, కుప్పం 2008
- ఆంధ్రదేశంలో జైన, బౌద్ధ మతాలు -
  బి.యస్.యల్. హనుమంతరావు, తెలుగు అకాడమీ, హైదరాబాద్ 1994
- హిందుత్వ - జ్యోతిర్మయ శర్మ, ఎమెస్కో బుక్స్, హైదరాబాద్, 2009
- సావర్కార్ హిందుత్వ -
  ఎ.జి.నూరాని, ప్రజాశక్తి బుక్‌హౌస్, హైదరాబాద్-2003
- భారతీయ తర్క శాస్త్రం -
  మేడవరపు సంపత్‌కుమార్, గొల్లపూడి వీరస్వామిసన్స్, రాజమండ్రి, 2007
- మానవీయ బుద్ధ -అన్నపరెడ్డి వెంకటేశ్వరరెడ్డి,
  పల్లవి పబ్లికేషన్స్, విజయవాడ, 1998.
- జ్వలించే పాదాలు- డి.ఆర్.నాగరాజు, ఎమెస్కో హైదరాబాద్
- సత్య శోధనలేక ఆత్మకథ - గాంధీ
  నవజీవన్ పబ్లిషింగ్ హౌస్, అహమ్మదాబాద్
- బుద్ధుని బోధనలేమిటి? - ఆనందబుద్ధ విహార, సికింద్రాబాద్, 2001
- స్టీఫెన్ హాకింగ్ కాలం కథ - పీకాక్ క్లాసిక్స్, హైదరాబాద్
- డి.డి.కోశాంబి పరిచయం, మరియు కోశాంబి వ్యాసాలు
  హెచ్.బి.టి. హైదరాబాద్
- ప్రపంచ చరిత్ర - క్రిస్ బ్రేజియర్
  హైదరాబాద్ బుక్‌ట్రస్ట్, హైదరాబాద్, 1991
- శతకమంజరి, రుషి ప్రచురణలు, విజయవాడ, 2004
- వేయి పడగలు - విశ్వనాథ సత్యనారాయణ
- విశ్వగుణాదర్శచంపూః
- పాతంజలయోగ సూత్రమ్

❖ మాధవ విద్యారణ్య విరచితశంకర విజయం.
❖ శంకరాచార్య విరచిత పంచీకరణం
❖ సర్వదర్శన సంగ్రహం (పుల్లెల శ్రీరామచంద్రుడి గారి వ్యాఖ్య)
❖ కళ్యాణ శ్రీకళా - కళ్యాణానంద భారతీ వ్యాఖ్య
❖ రుగ్వేదసూక్తములు
❖ రఘు వంశం - కాళిదాసు
❖ వైదిక మనో విజ్ఞాన్ - చౌఖంబా ప్రచురణ
❖ సాంఖ్యకారికా (గౌడపాదాచార్య వ్యాఖ్యానం)
❖ దిలాస్ట్ బ్రాహ్మిన్ మరియు పురాణ వేదం, రాణి శివశంకరశర్మ
❖ ధ్వన్యాలోకం
❖ నిశీధిని - కె.వి.ఆర్. ఝుం ఝు ప్రచురణలు, కావలి, 1991
❖ ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం, మార్క్స్, ఎంగెల్స్, ప్రగతి ప్రచురణలు, మాస్కో 1987.
❖ ఆర్షభావనా చంద్రికలు - శలాక రఘునాధశర్మ, ఆనందవల్లీ గ్రంథమాల, రాజమండ్రి, 2009
❖ సమాజం-సైన్స్ సంప్రదాయం
ఎస్.బాలచందర్, ప్రజాశక్తి బుక్‌హౌస్, హైదరాబాద్, 2007
❖ నడిచేదేవుడు మరియు జగద్గురు బోధలు (కంచి పరమాచార్య)
❖ వేదసార రత్నావళి
ఉప్పులూరి గణపతి శాస్త్రి, అన్నవరం సత్యనారాయణ స్వామి దేవస్థానం, 1985.
❖ బెంగుళూరు నాగరత్నమ్మ - హెచ్.బి.టి.
❖ మధుమురళి - బాల మురళీకృష్ణ అభినందన
(హెచ్.యస్.వి.కె. రంగారావు, నెల్లూరు - 2010)
❖ కొంటెబొమ్మల బాపు - విశాలాంధ్ర
❖ Swami Vivekananda A Hundred Years Since Chicago A Commemorative Volume. Rama Krishna Mission, Howrah. 1994
❖ The Complete Works of Swami Vivekananda.
Advita Ashrama Calcutta, 1989.

- India by A. L - Biruni. National Book Trust, India - 1983
- Media control - Noam Chomsky
  Seven Stories Press, New York.
- Hegemony or Survival -
  Noam Chomsky. Henry and Company, New York, 2004
- Bunch of Thoughts -
  M.S. Golwalkar, Jagarana Prakashana, Bangalore, 1980
- The Wisdom of China - Michael Joseph Ltd., Britian, 1944.
- Selections from H.G. Wells. Macmillan India Ltd., Madras. 1976.
- Reason in Revolt - Alan Woods. and Ted Grant. Aakar Books Delhi. 2007
- Dr. Ambedkar - A Critical Study W.N. Kuber. Peopls Publishing, House Delhi, 1973.
- The second Sex -Simone DE Beauvoir.
- Who Got Einstein's office - edregis. Addison- Wesley Publishing Compeny Coliforniya,1987.
- The Buddha And his Teachings - Narada
  Buddhist Missionary Socieaty, Malaysia, 1977
- Argumentative Indian - Amartya Sen
- Communist Manifesto - Marx.
- An Area of Dark Ness & India : A Wounded Civilization - V.S. Naipaul
- Angel of the Hell (Documentery) Available in Internet
- Decolonising the Mind Nuggi Wathiongo. Z.P.H.
- History of Indian Buddism - T.W. Rhys Davids and The Popular Life of Buddha Arthur Lillie - Asian Educational Services Delhi.




*There is no spirituality in India*

*There is no Equality in Europe*

*There is no Freedom in America*

Sree Lakshmi Press, Guntur-2 Ph: 2230643